# బహాంచెర

"నీవు షండుడివైపో"

"అయినాసరే నీవు నాకు తల్లివే ఊర్వశీ నన్ను బాధించకు"

"మహా వీరుడివి - మహా రసికుడివి. షండుడివవుతావా? ద్రౌపదీ సుభద్రల గతియేమి ?"

భగవంతుడు కృష్ణుడున్నాడు"

"ఇదేనా నీ నిర్ణయం?"

"అదే నా నిర్ణయం"

"అయితే నీవు పుట్టిన భారతదేశానికే నపుంసకత్వం ఒక మచ్చగా తయారవుతుంది. అప్పుడు వ్యాసభగవానుడు గాండా నీ గేహాన్ని రక్షి

"అప్పుడు కూడా ఎవరో ఈ మచ్చ మాపటానికి పుట్టకపోరు. నాది భారతదేశం !"

"అప్పుడు కృష్ణు డుండడు గదా !"

"కృష్ణ భక్తు లుంటారు. మహా మంత్రులు- రాజకీయ వేత్తలు - రచయితలు ఉంటారు."

"ఏం చేస్తారు వాళ్ళు?"

"ఏమయినా చేయవచ్చును. అప్పుడు నేనూ ఉండను గదా" అన్నాడు మహా వీరుడైన అర్జునుడు.

ఇది ద్వాపరంలో ఊర్వశీ అర్జునుల సంభాషణ. కాని ఆరు వేల అయిదు వందల సంవత్స రాలయినా ఆ మచ్చ మాయ లేదు.

ఆ అర్జున కిరాతకం ఏమిటంటే నపుంసకులు భారత దేశంలో ఉంటూనే ఉన్నారు. ప్రభుత్వం...అంటే నిజాం లాటి వాడు ఈ ఖోజ్జాలకి భృతి ఏర్పరిచాడు. అది నేటి గవర్నమెంటుకి ఎంత తెలుసో నాకు తెలియదు. మధ్య ప్రదేశ్ లో ఈ ఖోజ్జాలు పార్లమెంటుకి పోటీ చేసి ఓడి పోయారు. అంటే అలనాడు భారత వీరుడైన భీష్ముడు మొహంచూడడానికి కూడా యిష్టపడని ఈ తుచ్ఛ ప్రాణులు మతాన్ని - పనికిమాలిన శరీరాన్ని అడ్డు పెట్టుకుని నేటి భారత దేశాన్ని ఏలటానికి ప్రారంభించేంత ధైర్యం చేశా రంటే చాలా హేయమైన స్థితి.

క

మతానికి ప్రాధాన్యత భారతీయులు ఏనాడూ ఇవ్వ
లేదు. ఒక్క కృష్ణుడు భగవద్గీత చెప్పాడు. అది మతంకాదు-
మహాపురుషులు అనుసరించవలసిన జీవిత విధానం. తరు
వాత బుద్ధుడు చెప్పింది మతం కాదు అహింస. కాని హీన
యాన బౌద్ధం మతంకింద మారి నశించింది. తరువాత తరు
వాత తురకలు వచ్చి మహమ్మదుని ప్రవక్త అన్నారు.
బాగానే ఉంది.అలాటి ప్రవక్తలు భారతదేశంలో అనేక మంది
పుట్టారు. ఇంతలో క్రిష్టియనుమతం దేశంలో ప్రవేశించింది.
దీన్ని గురించి అనేక విభిన్నాభిప్రాయాలున్నయ్.

ఇంగ్లీషు వారి సామ్రాజ్యం దేశాన్ని కొల్లగొట్టి వెళ్ళి
పోయింది. ప్రస్తుతం హిందూస్తాన్‌లో మతం అని ఎవరికీ
పట్టింపు లేదు. ఇష్టమైన దేవుడిని ఆరాధించవచ్చు. ఇష్టమైన
విజ్ఞానం ఆర్జించవచ్చు. ఇష్టమైన పెళ్ళి చేసుకోవచ్చును.
కాని ఈ శిఖండి సమూహం నేల మీద ఏం చూస్తున్నారు.
ఇది ధర్మానికి మానవత్వానికి విరుద్ధమైన పని. ఆనాడు కృష్ణ
భగవానుడు శిఖండిని అడ్డుపెట్టి భీష్ముడిని చంపించాడు.
శిఖండికి అర్జునుడు స్నేహితుడు కనక... కొన్నాళ్ళు అర్జునుడు
స్వయంగా షండుడయ్యాడు గనకా - ఈ దౌర్భాగ్యపు
జనాభాకి ఆ మహాపురుషుడు మూలపురుషుడని చెపుతారు.

కాని వారు కొలిచేది 'బహుచార్ మాత' అనే పేరుతో-
అమ్మవారిని. కోపి అనే క్షుద్రపక్షి మీద కూర్చోపెట్టి
ఆవిడ పేరుమీద మరి కొందరిని తనలాగే తయారుచేస్తున్నారు.
అది ఘోరమైన అన్యాయం. బహుచర అంటే విచ్చలవిడిగా

తిరిగే ఆడది. అది దేవికి ఆపాదించడం కళంకం అని వీరు భావించరు. ఒక అందమైన పిల్ల తన రొమ్ముల్ని తనే ఖండించుకొని కన్యాత్వాన్ని రక్షించుకుందనీ - ఆమె దేవికి సహోదరి అనీ- ఇలా తమ శరీరాల్ని తామే ఖండించుకొని సుందరమైన స్త్రీత్వ పురుషత్వాల్ని పోగొట్టుకున్న వారు గొప్ప త్యాగ నిరతులనీ వారొకకథ చెపుతారు.

ఆమెదయకోసం యిలాంటి అసహ్యాకరమైన పనులు ఇరవయ్యో శతాబ్దపు ఉత్తరార్ధంలో జరుగుతున్నాయంటే చాలా మంది నమ్మరు. కాని నిజమంతే. వీరేషండులు. వీరే అర్జున కిరాతకులు. నిజానికి వాళ్ళమొఃహం చూడటం ఘోరం అని చెప్పాడు వ్యాసమహర్షి స్వయంగా.

వీరు స్త్రీలలాగా అలంకరించుకొని యిప్పటికే అనేక చోట్ల కనిపిస్తున్నారు.

అహమ్మదాబాద్ నుంచి ఉత్తరంగా శంకర్ పూర్‌లో బహుచెర ఆలయం ఉంది. కొంతమంది మూర్ఖులు ఖొజ్జాల్ని దైవదూతలుగా కొలుస్తారు. పిల్లలకోసం మొక్కుతారు. కిరస్తానీమతంలో నన్స్‌లాగా కాదు. వీరు సర్వాలంకారాలూ చేసుకుని ఎప్పుడు ఎవరు ప్రసవిస్తారో తెలుసుకుని వాళ్ళదగ్గరనించి ఆడపిల్లపుడితే అయిదూ, మగపిల్లలు పుడితే ఆరూ వసూలుచేస్తారు.

కొంత మంది మొగపిల్లల్ని దెయ్యాలెత్తుకు పోకుండా ఆడపిల్ల బట్టలు కడతారు.

గుజరాతులో ఒకరాజుకి బహుచెర వరంవల్ల ఒక నపుంసకుడు పుట్టి ఈ నపుంసకుల్ని ఒక వర్గంగా విభజించి (కాంగ్రెసులాగా) గౌరవించాడని మరోకథ ప్రచారంలో ఉంది.

అంతేకాదు. ఇప్పటికీ కాకతాళీయంగా బహుచెర వరం వల్ల పుట్టారని భావిస్తున్న చాలా మందిని నపుంసకులుగా మారుస్తున్నారు. రాముడి వరంవల్లా కృష్ణుడి వరంవల్లా పుట్టినవారికి ఏ భయమూ లేదుగాని బహుచెర వరంవల్ల పుట్టినవారినిమాత్రం తప్పకుండా నపుంసకులుగా- స్త్రీత్వం లేని వారుగా మారుస్తున్నారు.

చాలా రోజులు మొగలాయీ అంతఃపురాల్లో పుట కతో నపుంసకులుగా ఉండే వాళ్ళని సేవకులిగా పెట్టేవారని నా అభిప్రాయం.

కాని అది అబద్ధం. వాళ్ళని తయారుచేస్తారు. వాళ్ళని గురించి తెలియనివ్వరు. తెలియదు-వాళ్ళ సంఖ్య జనాభా లెక్కల్లో ఉండదు. ఎందుకంటే స్త్రీలూ పురుషులూ కారు కనక. కాని మొత్తం భారతదేశంలో ఎంతమంది ఉన్నారో తెలియదు గాని ఒక్క బొంబాయి నగరంలోనే అయిదు వేల మంది ఉన్నారు-వాళ్ళ ఆచారాలు వేరు. ప్రతి శుక్ర వారం అడుక్కుంటారు. తెగలు తెగలుగా బ్రతికే వీళ్ళని ఎవరూ ఏం చేయలేరు. ఇందోర్ ఖోజ్జాలు ఎక్కువమంది మహమ్మదీయులే- బరోడాలో ఉన్న ఖోజ్జాలు హిందూ తెగకు చెందినవాళ్ళు. అందరూ సంపాదించిన డబ్బు

అందరూ సమానంగా పంచుకుంటారు. ఇందులో సామ్య వాదం కూడా ఉంది.

కాని తెగ నాయక్ ఒకడుంటాడు. వ్యాకరణ సరస్వతికి బాధకలిగించే పదం ఇక్కడ పెట్టాలి. నాయకుడో నాయకురాలో అయితే వ్రాయవచ్చును. కాని నాయక్ అనే నపుంసక హిందీపదం తప్ప తెగ పెద్దని పిలిచేందుకు మరో పదం లేదు.

దీంట్లో అనగా ఈ తెగలో ఒక కొత్త ప్రాణి తనకు తానై చేరినా, వాళ్ళకు వాళ్ళే చేర్పించినా కొన్ని విషమ పరిస్థితుల్ని ఎదుర్కోవాలి. అవేమిటంటే ఒక శిఖండిని గురువుగా ఎన్నుకోవాలి. ఆ శిఖండికి యీ కొత్త జీవి కూతురు, శిఖండి తల్లి. రెండు ఈ కొత్త జీవి ఆ గురువు దౌర్భాగ్యుడి పేరూ, తనపేరూ... ప్రాయశః రెండు పేర్లూ ఆడపేర్లే అయి ఉంటాయి - ఆ పేర్లని పచ్చ పొడిపించుకోవాలి చేతిమీద. యీ విధంగా అఖండ స్త్రీత్వానికి అవమానం చేస్తున్నారువీళ్ళు. వీళ్ళకి ఆస్తిపాస్తులున్నాయి. ఒక్క బరోడాలోనే 25 లక్షల ఖరీదుగల ఇళ్ళూ, ఇండోరులో 9 లక్షల ఖరీదుగల ఇళ్లూ- హైదరాబాదులో హైకోర్టు సమీపంలో అయిదు ఆరు లక్షల ఖరీదుచేసే ఇళ్లు ఉన్నాయి. విజయవాడలో కూడా ఉన్నారని వినికిడి. అక్కయ్యచౌదరి ఇంట్లో వంటవాళ్లుగా ఉండేవాళ్ళిద్దరు. పాపం అనుకునే దాన్ని.

ఇందోరులో నందలాల్ పురాలో ఒక మసీదు ఉండేది. సమాప అనే ఖొజ్జా సన్యాసిని శివాజీరావు

హోల్గారు మహాభక్తితో కొలిచేవాడు. ఈ మసీదుని కట్టించింది నిజాం నవాబు. బరోడాలో వీళ్లున్న ప్రాంతంలో బహుచెర ఆలయం ఉంది. ఆ ప్రాంతం పేరు బరహాన్‌పుర.

ఇక్కడ వీళ్లు పెద్ద జయస్తంభాన్ని లలితకున్వార్ అనే ఖోజా గొప్పవాడి పేరుమీద నిర్మించారు.

ఖోజా అయిన ప్రాశికి కొన్ని సంప్రదాయాలూ, అలవాట్లూ ఉన్నయ్. హిందూ అయినా మహమ్మదీయులయినా ఇండియా అంతా కనిపించే వీళ్లు, వాళ్ళమతాన్ని బట్టి సామాన్యంగా ఆడపేరు పెట్టుకుంటారు. వీళ్ళకి గొప్ప యూనియన్ కూడా ఉంది- వడ్డీ వ్యాపారంతో పాటు.

కాంగ్రెసులాగా వాళ్ళూ సమావేశాలు జరుపుకుంటూ ప్రతినిధుల్ని ఎన్నుకుంటూ ఉంటారు.

ఈ తెగకి ఆస్తి ఉన్నాగాని సింపుల్‌గా జీవిస్తారు గాంధీగారి సిద్ధాంతాల ననుసరించి. తెగలో చేరని కొద్ది మంది అడుక్కుంటూ వంటచేస్తూ బ్రతుకుతారు.

ఖోజా పురాణాలు వేరు - జానపదాలు వేరు. కథలు వేరు. గాథలు వేరు. ఆచారాలు వేరు - నమ్మకాలు వేరు. వీళ్ళకి ఆదర్శం అర్జునుడూ భీష్ముడూనట. వీళ్ళలో మహా విచిత్రమైన ఆచారం ఏమిటంటే పెళ్ళి చేసుకోవడం. ఒక ఖోజా మరో కొజ్జాని పెళ్ళిచేసుకొని ఇంకో కొజ్జాని దత్తు చేసుకుని కుటుంబాన్ని ఏర్పరుచుకుంటారు.

కొంతమంది మొగపిల్లల్ని ఎత్తుకెళ్ళి వీళ్ళు హోమో సెక్సువల్లీ చేస్తారు. కొంతమంది భాగ్యవంతులు ఐశ్వర్యం పోకుండా ఉండేందుకు పిల్లల్ని వాళ్ళకిస్తారు. ఇదో మూఢ నమ్మకం. ఆంధ్రప్రదేశ్ వేములవాడలో శ్రీరామనవమి నాడు ఈ ఖొజ్జాలు నాలుగు వేల మందిని చూచాను.

కొంతమంది విధివశాత్తూ నపుంసకులుగా పుడతారు. వాళ్ళు ఈ తెగలో చేరాలంటే అప్లికేషను పెట్టుకోవాలి. వెంటనే పాత ఖొజ్జా ఒకడు కొత్త ఖొజ్జా చెవులు కుట్టి (బ్రాహ్మణ క్షత్రియుల్లో ఉపనయనం కర్మలాగా) వేస్తాడు. తరువాత ప్రమాణం ఉంది. అది ఏమిటంటే దొంగతనం చేయననీ, విటుడుగా ఉండననీను- కాని వాళ్ళు చేసేవే అవి. ఆ తరువాత పరీక్ష. అంటే ఉద్యోగంలో ప్రొబేషను లాగా.

ఆ కాలంలో ఈ కొత్త కొజ్జా విషయంలో తిండి విషయం నిబంధన ఎక్కువ. రజస్వలకీ బాలింతకీ లాగా మొదటిది స్త్రీ దుస్తులు ధరించి స్త్రీనామం పెట్టుకోవటం అప్పుడే జరుగుతుంది. అంతేకాదు. ఈ జీవి మొగవాడనే అనుమానంతో ఆరితేరిన వేశ్యదగ్గర ఈ జీవినుంచి అన్ని పరీక్షలూ చేస్తారు. వీడు ఏమాత్రం చలించినా పురుషుడికిందే లెక్క. అప్పుడు నిర్దాక్షిణ్యంగా చంపుతారు. శవం కూడా అంతు దొరకదు. అసలు కొజ్జాల శవాలు కనిపించవు.

గుజరాతులో ఈ ఖొజ్జాలకి మహమ్మదీయులే పురోహితులై ఉంటారు. వాళ్ళని కమాలియా అనే గౌరవ

నామంతో పిలుస్తూ ఉంటారు. వాళ్ళు మొగవాళ్ళే. మీసాలూ గడ్డాలూ ఉంటాయి. కాని ఆడదుస్తులు ధరిస్తారు. ఇది హైదరాబాద్‌లో కూడా ఉంది. వీరు విధివంచితులూగారు- దైవోపహతులూకారు. కావాలని భారతదేశాన్ని మలిన పరిచే దౌర్భాగ్యులు. ఈ కమాలియాకూతుళ్ళు కొత్తఖొజ్జా పరీక్షార్ధం పనికి వస్తారు.

అసలు సిసలైన నపుంసకుడని ఆవేశ్యగాని కమాలియా కూతురుగాని సర్టిఫికెట్ ఇచ్చిన తరువాత రెండో అధ్యాయం ప్రారంభం అవుతుంది.

అది పురుషేంద్రియం తీసివేయటం. అది మహాముఖ్య మైనది.

దానికి ముహూర్త నిర్ణయం పళ్ళెంలో నాకలి నిలిచి నప్పుడు. (గ్రహణ సమయాల్లో నాకలి నిలపటం గ్రహణం విడవగానే అది పడిపోవటం హిందూసమాజంలో ఉంది.)

ఈ ముహూర్తంకూడా అలాంటి పవిత్రమైనదని వీళ్ళ నమ్మకం. ఆ నాకలి నిలబడగానే మంచి ముహూర్తం. ఇక కొత్తఖొజ్జా కొబ్బరికాయలు కొట్టటం జరుగుతుంది. అందులో ఒక కాయ కుళ్ళిందంటే కొత్త ఖొజ్జా సెప్టిక్ అయి చస్తాడని మరో ముహూర్తానికి వాయిదా వేస్తారు.

నాకలి నిలిచిన అనంతరం కొబ్బరికాయ కొట్టి - పురు షేంద్రియం తీసివేసి, ఆ పుండుమీద నూనె ధారగా

పోస్తారు. అది నలభయి రోజుల్లో మానుతుంది. వీరి దృష్టిలో ఇది ఉపనయనంకింద లెక్క. పేరుపెట్టటంకూడా అప్పుడే జరుగుతుంది. ఆ తరువాత మరోఖోజ్జాతో పెళ్ళి. ఇంకో ఖోజ్జాని దత్తుచేసుకోవటమూను.

ఇది ఖోజ్జాల సాంప్రదాయం.

* * *

కానీ మనుషుల్లో...స్త్రీ పురుషుల్లో బ్రతుకుతూ మానవత్వం లేని, బహుచరభక్తు లెందరో ఉన్నారు. హైద్రబాద్‌లో ఒక ఖోజ్జా స్నేహంచేసి, ప్రతిదానిమీదా అసహ్యం పెంచుకున్న ఒక యువతి సరోజిని. కర్మవశాత్తూ ఆమెకు వివాహం చేశారు తలిదండ్రులు ఈ విషయం పసి కట్టినందువల్ల.

లేకపోతే ఆమె ఖోజ్జాల్లో చేరిపోయి బహుచెరగా ఉండేది. ఆ మనస్తత్వం ఆమెలో పోలేదు. కుటుంబ వ్యవస్థ అంటే ఆమెకు మంట. కాని ఆమె స్త్రీ శరీరం పిల్లల్ని కన్నది. మనసు మాత్రం ఖోజ్జావ్యవస్థకే అంకితం. తల్లి దండ్రులకీ రహస్యం తెలిసినందున ఆమెను హైద్రబాద్ రానీయరు. ఆమె తన ఖోజ్జానేస్తానికి...ఇక్కడ నేస్తం అనే మాట లింగభేదాలకి అతీతం అవటంవలన ఆ మాట వాడక గత్యంతరం లేదు. సరోజిని ఖోజ్జాకాకపోయినా కమ్యూనిష్టు అయింది. (కమ్యూనిస్టులు ఖోజ్జాలనికాదు)

అందువలనో? ఎందువలనో గాని ఆమెకు కుటుంబ వ్యవస్థ అన్నా మంట- భర్త అన్నా మంటే గాని పైకి

చూపించదు. ఇంట్లో మిగిలిన అందర్నీ ఆమె ఘోరంగా ద్వేషిస్తుంది గాని ఆ ద్వేషం పైకి కప్పించదు. ఆ స్థితిలో సరోజినికి తననేస్తం బహుచెర గుర్తుకి వచ్చింది. అందుకే ఆమెను ఉత్తరం వ్రాసింది.

బహుచెరా నేస్తం !

ఈ ఉత్తరం చాలారోజులకి వ్రాస్తున్నాను. మానాన్న నాకీపెళ్ళి చేసి బెజవాడ పంపకపోతే ఈ పాటికి నేనూ కమాలియా గృహంలో చేరి స్వేచ్ఛగా బ్రతుకుదునుగదా - తన రొమ్ముల్ని తనే ఖండించుకొన్న దేవీసహోదరినైతే ఈ పిల్లల పాలబెడద ఉండదుగదా. ఆమె ఎంత ధన్యురాలో? నిజంగా నేను నిన్నే పెళ్ళిచేసుకునేదాన్ని......ఏమంటావు నేస్తం? నా జీవితం ఈ స్త్రీత్వంతో బాధ్యతలతో లుక లుక లాడుతోంది. మనస్సు మాత్రంనీదే సుమా. పెద్ద ఉత్తరం వ్రాస్తున్నాను. మూడేళ్ళ కిందట నాకో కొడుకు పుట్టాడు. కనీసం వాడినయినా బహుచార్ దేవికి కోడిగా అర్పించ గలనా అని బెంగ.ఆబెంగతో నే నీ కప్పుడు ఉత్తరం వ్రాశాను. సంతోషంగా వాడిని అలాగే చేద్దామని వ్రాశావు గుర్తుందా? మనం కష్టంసుఖం చెప్పుకోవాలంటే ఈ ఉత్తరాలే ప్రస్తుతానికి మార్గం.

నా కష్టానికి విచారించే నేస్తానివి నువ్వొకదానివే. ఎందుకు అంటావేమో? ఈ స్త్రీ పురుషుల్లో......కాస్త ఎక్కువా తక్కువా తారతమ్యం తప్పితే, సాధారణంగా ప్రతివ్యక్తికీ ఏదో చీకూ చింతా ఉంటాయి. ఘనలాగా

(ఖోజ్జా) వాళ్ళు నిశ్చింతగా ఉండరు - కష్టాలూ సుఖాలూ వీళ్ళకి ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి - ఈ (స్త్రీ) పురుషుల తత్వమేమిటో నాకు అంతుబట్టటంలేదు - నేనూ లక్ష్యపెట్టటం లేదు. తేలికగానే వీళ్ళ రోగం కుదర్చగలను అనుకో.

నువ్వొక ప్రాణవే! నన్ను అర్థంచేసుకోగలిగిన విశ్వాసం నాకుంది. ఈ (స్త్రీ) పురుషుల్లో చాలా చిక్కులున్నాయి. ఆ విషయాల్ని నీకు వ్రాయటం వల్ల నాకు ఫలితం ఉంటుందనే నేను భావిస్తున్నాను. నా అభిప్రాయాన్ని నువ్వూ, బహుచారామాంతా, కమాలియా (పెద్ద ఖోజ్జా) తప్ప అందరూ అర్థంచేసుకోరు. ఇలా మన గోకంటిపాట నీకూ విసుగు కలిగిస్తున్నదా..? అన్నట్లు ఎంతమంది మనలో చేరారు ఈ సంవత్సరం ? ఆ రోజులు తల్చుకుంటే నాకు మతిపోతోంది. హాయిగా మీతోపాటు స్వేచ్ఛగా తిరిగే భాగ్యం నాకు లేదుగదా ? హైదరాబాద్ కాచిగూడా రోడ్డుమీద బాధ్యతలేకుండా షికారుచేసే యోగం కోసమే నేను ప్రయత్నిస్తున్నాను. నేను అందని కలలు కనలేదు. ఒక్క నెల రోజులు నాకీ పెళ్ళి కాకుండా ఉంటే...మానాన్న కేమిటి- అర్జునుడికి (వాళ్ళ దేవుడు) కూడా దొరికేదాన్ని కాదు. ఈ పాటికి నిన్ను పెళ్ళిచేసుకొని...ఎవరినయినా దత్తుచేసుకొని సుఖంగా ఉండేదాన్ని. మన సంఘాన్ని గురించి నేనెంత ఆదర్శపూరితంగా ఊహించుకొన్నానో నీకూ కమాలియాకే తెలుసు. మన సుందర భవంతిలో ఒకగది మనది. అది సుఖశాంతులకు నిలయం. ఇలాంటి ఆలోచనలు ఎన్ని చేశాన్నో ?

రామారావుని నేను ఇష్టపడి పెళ్ళిచేసుకోలేదు. నా శరీరానికీ అతని శరీరానికి పెద్దవాళ్ళు పెళ్ళిచేశారు.బహుశా ప్రేమమాత్రం నీదే.

ఈ స్త్రీ పురుషుల్లో పెళ్ళి అవుతుందా- ఆ మర్నాటి నుంచి ఒకళ్ళ నొకళ్ళు ప్రేమించుకోవటం ప్రారంభిస్తారు. భారతదేశంలో మనం చాలా తక్కువమందిమి కనక వీళ్ళని సహించక తప్పదు. లేకపోతే చంపేద్దుం వీళ్ళని. సరే అసలు కథ కొస్తాను.

రామారావునీ నిన్నూ ఒకచోట పెడితే నా ప్రేమనీదే. కాని వీళ్ళ రూల్సు ప్రకారం అతన్ని నేను ప్రేమించినట్లే నటిస్తున్నాను. అది అసమగ్రమయిందని నాకూ తెలుసు. కాని ఏంచేయను? ఈ స్త్రీ పురుషులూ వాళ్ళ సెంటిమెంట్లూ అంటే నాకు అసహ్యాం అనుభవ పూర్వకంగా ఆలోచిస్తే. కమాలియా ఇంట్లో ఉన్న సుఖశాంతులు ఎంత ప్రేమించినట్లు నటించినా - ఈ కుటుంబంలో కనపడలేదు. సుఖశాంతులు పొందటానికి ఆడ - మొగల - ప్రేమ చాలదు. అర్జున పూజ చేసేవాళ్ళే నిజమైన ప్రేమికులని, ఈ అల్పులైన స్త్రీ పురుషుల కెలా తెలుస్తుంది నేస్తం?

వధూవరులు...పోనీ మొగుడూ పెళ్ళాలు...మనలాగా ఉండకపోయినా- వాళ్ళపద్ధతిలో నయినా సుఖపడకుండా... చుట్టూ కుటుంబం. అత్తమామలూ పిల్లలూ బెడద ఒకటి.

వీళ్ళందరి అధికారం భరిస్తూ - అభిమానం సంపాదించటానికి నేనెన్ని కష్టాలు పడుతున్నానో ఆ బహుచార్

మాతకూ అగ్నిసాక్షికీ తెలియాలి. అన్నట్లు మన నేస్తం ఫకీజా ఎలాఉంది? మిగతా సొసైటీలో హిందూ మహమ్మదీయ కలహాలున్నాయ్‌గాని మనకి లేవు. మన శత్రువులు స్త్రీ పురుషులే.

ప్రేమ అంటూ ఒకర్ని చేసుకొని చుట్టూ నరకాన్ని నిర్మించుకొని అదే స్వర్గమంటారు వీళ్ళు. ఎంత అవివేకులో గదా!

మనం మాత్రం అలాటి అవివేకపు పొరపాట్లు ఎన్నటికీ చెయ్యం. సాటి మనవాళ్ళు మనపట్ల కనీస ధర్మాలతో - బాధ్యతలతో - వ్యవహరిస్తారు మన సొసైటీలో. ఈ స్త్రీ పురుషుల్లో ఎవరి మనస్తత్వమూ నాకు అర్థం కావటంలేదు.

మానాన్న నాకు పెళ్ళిచేసి ఆరేళ్ళు నిండాయి. ఇద్దరు పిల్లలు కూడా నా శరీరానికి పుట్టారు. వీళ్ళ ఆచారం ప్రకారం స్త్రీ జీవితంలో ముఖ్యమైనది ఇదేట. ఈ గడిచిన కాలం నన్ను అసమర్థురాల్ని చేసి కూర్చోబెట్టిందంటే చెప్పటానికి సిగ్గుగా ఉంది. అసలు సిగ్గులేకుండా నేను ఈ మాట వ్రాస్తున్నందుకే నన్ను తిట్టవచ్చును. కానీ నేస్తం! నీదగ్గర నేను దాచుకున్నది ఏమీలేదు. బహుచార్ మాత దయ లేక మనం దూరమై నేనీ రామారావుకి భార్యనయ్యాను. ఈ మాత్రానికి ఉత్తరం దేనికని నువ్వు అనవచ్చును. ఈ స్త్రీ పురుషులూ - వీళ్ళ ప్రేమలూ - పిల్లల్ని కంటాలూ ఎంత ఛండాలమో నీకు చెపుతున్నాను.

వీళ్ళ సొసైటీలో స్త్రీ కోడలిగా- భార్యగా- తల్లిగా- అమ్మమ్మగా - నాయనమ్మగా ఎంతో చేయాలి. పోనీ మొగ వాడయినా సీరియస్‌గా ఉన్నాడా అంటే వాడి ఖర్మ అంతే. కొడుకుగా- భర్తగా- తండ్రిగా- తాతగా - వాడి శ్రాద్ధంగా ఎన్నో బాధ్యతలు.

నా సంగతి.

ఈ కొంపలో నేనేం చేయాలో నాకు తెలియకుండా పోతోంది. దానికి లక్ష కారణాలు చూపించ వొచ్చునుగానీ ముఖ్యంగా నా మొగుడనేవాడు ఆ రామారావు గురించే చెపుతాను.

రామారావు- చదువుకున్న వాడట. తెలివైనవాడట - మంచి చెడ్డలు అర్థం చేసుకుంటాడట. మంచిభర్తట. అలాగే భావించాలట - పోనీ భావిస్తాను. (నిన్ను మర్చిపోవటం సాధ్యం కాదనుకో) అతనిచుట్టూ వున్నవాళ్ళు- విశాలహృదయం లేనివాళ్ళు - మనంత హృదయవికాసం వాళ్ళకెప్పుడూ వుండదనుకో. ఇలాంటి పరిస్థితుల్లో రామం (నాభర్త .. ఛీ ..) నా అభిప్రాయాలతో ఏకీభవిస్తే అందర్నీ మనలోకి లాగెయ్యగలను. ఏం ప్రయోజనం! ఆచరణలో అతను చాలా బలహీనుడు. అతని శక్తి సామర్థ్యాలు ఎందుకూ పనికిరానంత క్షీణమైనవి. నిజంగా మనం అతని పురుషాంగాన్ని తీసివేస్తే చచ్చిపోతాడేమో కూడా! అంత బలహీనుడు.

ఈ బలహీనతల్ని నేను క్షమించలేను బహూ - ఈ రామాన్ని గురించిన ఆవేదన ఇంతా అంతా కాదు - నాకు

నీమీద ప్రేమతో అత్తవారింట అడుగుపెట్టిననాకు- ఎక్కడో మగాడితో ఆపని చేయాల్సిరావటం ట్రాజెడీకాదా? వెస్టియన్స్ అని ఆక్షేపించేవాళ్ళకి- ఆ వెస్టియన్స్ ఎంత ఉన్నతులో తెలిస్తే బాగుండును.

ఆరునెలల్లో ఆ ఇంట్లో అన్ని సంగతులూ నాకు అవగతమైనవి. ఆ రేళ్ళనుంచి సరిపడని సంగతుల్తో విసిగిపోతూ నిన్ను విస్మరించలేక, నిరాశా నిస్పృహాలతో జీవితం గడుపుతున్నాను. నాయక్ (పెద్ద)తో చెప్పు.

పెళ్ళికి నువ్వూ వచ్చావుగా చీర కట్టుకుని. ఇద్దరం తలువేసుకుని ఏడిచాం గుర్తుందా? మా అత్తనీ, మామనీ, మరిదినీ నువ్వు చూసేఉంటావు. పిళ్ళ సొసైటీలో ఒకళ్ళనొకళ్ళు గౌరవించాలట - ముఖ్యంగా అత్తమామల్ని. నీకు కొన్ని సంఘటనలు చెపుదామంటే...నా పరిస్థితి నీకు అర్థంగాదేమోననిపిస్తోంది. కాని స్త్రీ పురుషుల స్వభావం అర్థం అవుతుంది. బహు!...నిన్ను ముట్టుకున్న శరీరంతో రామారావునీ ముట్టుకొని పిల్లల్నికన్నాను. క్షమిస్తావుగదూ. ఈ పిల్లల్ని మాత్రం ఈ స్త్రీ పురుషులమధ్య పెరగనివ్వను. మన కమాలియాకే ఇచ్చేస్తాను. ఏ లైతే రామారావునీ...కాని మా మరిది పోలీసుఇన్స్పెక్టరు. వీడితో మహాచావుగావుంది. కాని మనసంఘంలోకి వచ్చినతరువాత ఎవరూ ఏంచెయ్యలేరు. మనం జనాభా లెక్కల్లో లేం. ఇన్‌కంటాక్స్ కట్టక్కరలేదు. బహుచార్ మాత దయవలన నిజాం ఫర్మానా మనకి వుంది. మనల్ని వీళ్ళేం చెయ్యగలరు? మా మరిదికి మస్కా కొట్టగల

..లే... కాని పోలీసువాడుగదా అస్తమానం అనుమానంతో చూస్తాడు నన్ను. కాని నాలో ఏలోటుంది కనక? కాని బహుశా! అతని బూట్లచప్పుడు వింటే నాగుండె దడదడలాడుతుంది. ఒక తడవ కమలకి దెయ్యంపడితే దేవాలయానికి తీసుకెళ్లాలని చెప్పారు గుర్తుందా? ఆమాటవింటే కమల వణికిపోయేది. అప్పుడు కమాలియా అంది. "దెయ్యం ఉంటే ఉండనీ దేవాలయానికిమాత్రం పోవద్దు" అని. అందరం చప్పట్లు కొట్టాం. దెయ్యంకూడా మన సొసైటీలో దేవనీ-(స్త్రీ) - పురుషుడూ కానిదనీ కమాలియా చెప్పలేదూ?... ఎంత నిజం?

కాని మా మరిది నన్ను ఎందుకు అనుమానంగా చూస్తాడో నాకు అర్థంకాదు. ఈ సొసైటీలో పోలీసులూ, న్యాయాలూ - కోర్టులూ చాలా ఉన్నాయి. పెళ్ళికి చిన్నదాన్నే కనక ఇవన్నీ తెలియలేదు. ఈ పోలీసుల్నిచూస్తే వీళ్ళకిగొప్ప. మనం శవాన్నికూడా గౌరవించి ఇంట్లోనే పాతిపెడతాం. వీళ్ళు శవాన్ని నిర్దాక్షిణ్యంగా తగలేస్తారు. కోడి బహుచాక్ మాత వాహనంగదా! ఆ గౌరవం వీళ్ళకేం లేదు. కోళ్ళనీ వాటిగుడ్లనీ లగాయిస్తారు. మా మరిది కోడిని పూర్తిగా తింటాడు. అదెంత అపచారం? ఇట్లాంటివి చూడలేక చస్తున్నాను. ఎలాఅయినా పారిపోయి రావాలని ఉంది. ఇక్కడెక్కడా నాదగ్గర డబ్బులేదు. పిల్లల్నికూడా తీసుకురావాలిగదామరి. ఈ వైధవ్యం నానం గురించి వ్రాసి నువ్వునన్ను పాడుచేయకు............"

(3)

"అమ్మా" అక్క కొత్తింది" అంటూ మూడేళ్ళకొడుకు దగ్గరకు వచ్చేసరికి వాడినొకటి చరిచి కొట్టినకూతుర్ని రెండుబాది లేచింది సరోజిని.

## 2

సరోజిని విజయవాడ వచ్చిన కొత్తరోజుల్లో మొదట ఆమెకు నచ్చనివిషయం ఇంట్లో వాళ్ళంతా. అత్తమామల్ని-పూజ్య దంపతులుగా చూడటం - వాళ్ళుకూడా కొత్తగా పెళ్ళయినవాళ్ళలాగా ప్రేమగా ఉండటం తనకి డోకుకలిగించినయ్. ఆ నైఘవపని (సెక్సు) స్త్రీ పురుషులమధ్యే అసహ్యమనుకుంటే... ఈ ముసలాళ్ళమధ్యకూడా ఉండటాన్ని... ముసలాళ్ళయినా వాళ్లూ స్త్రీ పురుషులే కావటాన్ని సహించలేకపోయింది సరోజిని.

సరోజినీ ... ఏమమ్మా సరోజినీ - సరూ - ఒదినా- మొదలైన పిలుపులన్నీ ఆమెకు గొంగళిపురుగు పాకినట్లు ఉండేవి. వీళ్ళు తనకు చుట్టాలూకారు, స్నేహితులూకారు- పోనీ తను ఏ పల్లెటూరిపిల్లాకాదు. హైదరాబాదులోపుట్టి, విశాల మనస్కులయిన అర్జునభక్తులతో స్నేహంచేసి, బహుచెరతో బాంధవ్యం (వెస్టియన్స) ఏర్పరుచుకుని, స్కూలులో సుపద్వేషిణిగా పేరుపొందిన హెచ్. యస్. సి. ప్యాసయిన వ్యక్తికి. పద్ధెనిమిదేళ్ళు నిండిన తనని మామ...గా...రు.. అత్త...గా...రు...కూడా సరోజినీ అని పిలుస్తున్నారు.

రామూరావు సరోజని. సరూ అంటాడు - మొగ్రోమన్నట్లు. అలా పిలిచేహక్కు బహూశాకేఉంది. పోలీసుమరిది ఒదినా అంటాడు. పిచ్చిమోహం - వీడన్నకి తను భార్యఅయినట్లు... వీళ్ళ సొసైటీప్రకారం అంతేకాని పోలీసుమరిది ప్రభాకర రావు పవిత్రమైన పక్షికోడిని తినటం చూసినదగ్గరనించీ అతనంటే అసహ్యంతో చసకి.

కోడిని అతనేచంపి ఈ కెలుపేకి తల్లికిచ్చి మసాలాకూడా నూరాడు. ఆనాటినించీ ప్రతి రెండురోజులకీ ఈ ఆరేళ్ళలో ఎన్నికోళ్ళని తిన్నాడో లెక్కలేదు. ఎప్పుడో అనుభవించక పోడు. తను కోడిని తిననంటే...అతను-

"పాపం వదినకి బ్రాహ్మల స్నేహంవలన మాంసం అలవాటు లేనట్టుంది పోనియ్యమ్మా" అన్నాడు. ఆరోజు నించీ - ఏమాంసం అయినా తనని తినమనరు. ఒక్కకోడి తప్ప మిగతావి తను తింటుంది...కాని ఎలా చెప్పాలి? రామూరావూ మామగారు వెంకట్రామయ్యా చేపలు తింటూ...సరోజనికి గిట్టదు గిన్నెలు వాసన రానివ్వకు - అని అత్తని హెచ్చరించటం చూస్తే ఏంచెయ్యాలో తెలియటం లేదు.

చాలా జుగుప్సగాఉంది వీళ్ళంటే సరోజనికి...రామూరావు ఏకాంతంగా ఉన్నప్పుడు ఎన్ని నీచప్పనులు చేస్తాడో! సరూ సరూ అంటూ చెప్పరానివన్నీ చేస్తాడు. అసలా సంబోధనా సంభోగం అన్నీ తనకు అసహ్యమే. ఈనాటి

రచయితలు (పిశ్శు ఖోజ్జాలుకంటె గొప్పవాళ్లుకారు) ఈ స్త్రీ పురుష ప్రేమనిగురించి పుస్తకాలూ - సినిమాలూ - రేడి యోలూ...అదరగొట్టేస్తూ వ్రాస్తారు. ఈ బెజవాడలోఉన్న కనకదుర్గకికూడా మొగుడున్నాడు. వాడిపేరు మల్లికార్జు నుడుట. తను దేవాలయానికి వెళ్ళకపోతే తన మరిది-

"పోనీయమ్మా ... వదిన మార్క్సు శిష్యురాలూ - గోరాగారి శిష్యురాలూ కాబోలు. వాళ్లకు దేముడుండడు" అన్నాడు. తను బహుచాక్ మాత భక్తురాలు. కమాలియా శిష్యురాలు. ఆమాట పైకిచెపితే ఈ పోలీసుమరిది "వాళ్ళె వరు?" అంటాడు. అప్పుడు తన సంఘానికి దెబ్బరావచ్చును- అని దూరమాలోచించి సరోజిని ఊరుకున్నది.

ఈ పరాయివ్యక్తులయిన అత్తమామలు బొత్తిగా చొరవగా పిలుస్తుంటే సరోజినికి ఒకరోజున చిరాకేసి - తన ఉద్దేశ్యం వెల్లడించేసింది. ప్రభాకరం డ్యూటీకిపోతూ-

"అమ్మా! జిగురుబాటిలు ఎక్కడుంది?" అన్నాడు.

"నిన్న వదిన ఎవరికో ఉత్తరం వ్రాసింది. దాన్ని అడుగు - ఎక్కడపెట్టిందో?" అన్నది అత్త సీతమ్మ.

ప్రభాకరం తనగదిలోకివచ్చి నవ్వుతూ "వదినా! జిగురుఉందా?" అన్నాడు.

జిగురు బాకీలు ఇచ్చి "కూర్చో ప్రభాకరం! నిన్నో మాట అడగాలి" అన్నది సరోజిని. మరిది తనకన్న కొంచెం పెద్దవాడే.

"ఏమిటొదినా అది?" అన్నాడు.

"ఏమీ అనుకోవద్దు...నేను నీకంటె చిన్నదాన్నిగదా ఒదినా అని పిలుస్తావెందుకు" అంది సరోజిని ఉత్తరం అంటిస్తునే. ప్రభాకరం ఆశ్చర్యంగా సరోజిని ముఖంలోకి చూశాడు.

సరోజిని సూటిగా ప్రభాకరంవంక చూస్తూ "మీ అమ్మ దాన్ని అనటం నాకు బాగా లేదు...ఈ బెజవాడలాటి చిన్న ఊళ్లలో ఇలా పిలుస్తారేమో నాకు తెలియదు. హైద్రాబాద్‌లో నా స్నేహితుల్లో ఇలాంటి పాడుఅలవాట్లు లేవు - ఇలా పిలవడం" అన్నది.

ప్రభాకరం ముందు తెల్లబోయి, తరువాత తమాయించుకొని నవ్వుతూ "మరి ఎలాపిలవాలి?" అన్నాడు.

"అమ్మాయ్ అని పిలుస్తారు. అది చాలా మరియాద అయిన పిలుపు. మీ నాన్న వెంకట్రామయ్యగారు ఏక వచనంలో పిలవటంకూడా నాకు నచ్చలేదు. మీ అన్నయ్య చేసేపన్లా పిలిచేపిలుపు పూర్తిగా అగౌరవమైనవి" అంది సరోజిని తను చాలా సూటిగా వివరించానవే తృప్తితో.

ప్రభాకరం ఏమీ జవాబు చెప్పకుండా సరోజినివంక చూస్తూ నిలబడ్డాడు.

"[illegible]... నువ్వు కోడిని తినటం చాలా ద్రోహం. అలాటి పాపంపనులు చెయ్యరాదు. మాత శపిస్తుంది"

"కో... కోడిని తింటేనా ?"

"అవును... అది పూజింపదగిన పక్షి... నువ్వు దాన్ని చంపి ఈకెలుపీకి ... మీ అమ్మకిస్తే ఆవిడ కొంచెంకూడా భక్తిలేకుండా ఆ పవిత్ర కళేబరాన్ని పచనంచేస్తుంది. నువ్వు దాన్ని తింటావు. అది మహాపాపం"

"పాపమా ? కోడిని తింటేనా ?"

"అవును కోడిని గౌరవించి పూజించాలి. పీక్కు తిన గాదు" అన్నది సరోజిని.

ప్రభాకరం ఏమీ జవాబు చెప్పలేదు. ఆశ్చర్యంగా చూసి అక్కడనుంచి వెళ్ళిపోయినాడు.

కొంచంసేపటికి సీతమ్మగారి కేకలు వినిపించినాయి.

"కోడిని తినక కోతినితింటారా ? వాళ్ళ పుట్టింట్లో అంతా గొప్పవాళ్ళూ మనం కామూ ? అయినా కోడిని పూజించాలనే సంగతి పుట్టాక ఇదే వినటం నేను. ఏదో ఎలాతోస్తే అలా చెయ్యటమేగాని ఆక్షేపణలు పడలేదు నేను. కోడిని తినకూడదూ ? తనకిష్టంలేకపోతే మానుకోమను. అంతేగాని వెధవకోడి పవిత్రమైందా ? దాన్ని తినకూడదా ? ఇంకా నయం. దాన్ని పూజించాలా ? మనుషులు కోళ్ళని

తినక కోతుల్ని తింటారా? కోడిది పవిత్ర కళేబరమా? బాగానే ఉంది వరస" అరవసాగింది సీతమ్మగారు.

అత్తగారి మాటలువిన్న సరోజినికి భయం వేసింది. కాని ఇంట్లో అందరూ సరోజినికి మాంసాహారం ఇష్టం లేదను కొన్నారుగాని మరింకేం అనుకోలేదు. రామారావు కూడా పెళ్ళాం అహింసాతత్వానికి ముగ్ధుడయినాడు. కాపరానికి వచ్చి రెండు నెలలయినా మాంసం తినని భార్యవలన అతనికి ఆదా అవుతుందని ఆనందపడ్డాడు. ఏమయినా సరోజిని మనస్సులో మాంట మాంసాహార నిషేధం అనుకున్నారు అందరూ. కాకపోతే అత్త సీతమ్మగారు మాత్రం ఆ రోజు నుంచీ పొరపాటునయినా "నాన్" అన్నమాటే మాటాడలేదు. వెంకట్రామయ్యగారు-

"కోడిపిల్ని ఏ విధంగా వండాలి?" అన్నారు. ఆ మాట విన్న సరోజని ఏం చెప్పాలో తెలియక మొహం చిట్లించు కొంది. కోడిపిల్లలు - ఎంత అసహ్యకరమైన మాట. తెలుసా కోడిపిల్లలు కాబట్టి మిలకనా ఈ సమాజంలో? పెళ్ళిన బహుచారా మాతకి బలి ఇవ్వాలి... ఇలా తనలో తాను విసుక్కుందే గాని అప్పటికి అంతకంటె సమాధానం ఇచ్చే ధైర్యం లేక పోయింది సరోజనికి. రామారావుకి మాత్రం-

"కోడిపిల్లలు అనకపోతే నడవదా? మా అమ్మా నాన్నకి అంతకోపం ఎందుకూ? అంత మోకన దేనికీ?" అంది.

"ములకన కోడి విషయంలో..."

"ఆమాట కొస్తే కోడలుకన్న కోడి పవిత్రమైనది. మూర్ఖులకేం తెలుస్తుంది కోడి పవిత్రత?" రామారావు చిరునవ్వు నవ్వి ఆమె శాకాహారాభిమానాన్ని మెచ్చుకుంటున్నట్లు ఆమె భుజంమీద చెయ్యివేసి అభిమానంగా-

"నీ ఉద్దేశ్యం నా కర్థమైంది. సహూ! నువ్వు కూడా కొన్ని విషయాలు గ్రహించాలి. కోడి తినకపోతే పోనీలే - తినే వాళ్ళని వద్దంటే ఎలా? మీ హైదరాబాద్‌లో సాయిబులు పందిని తినరు. మేము తింటాం. అలాగే ఆహార విహారాల్లో అనేక మార్పులుంటయ్. సహించాలి మరి. నువ్వు కోడి విషయం సీరియస్‌గా తీసుకున్నావుగాని మాకు కోడిని తినటం చాలా చిన్నవిషయం. అలాగే కోడల్ని కోడలుగానే చూస్తారు ఆంధ్ర దేశంలో. మీ ఫ్రెండ్స్ బహుశా కుటుంబంలో పెరిగిన వాళ్ళు కారేమో? అది తప్పా? ఒప్పా? అనేది వాళ్ళ వాళ్ళ పరిస్థితుల్ని బట్టి ఉంటుంది - కోడి విషయంలో నువ్వు చర్చలోకి దిగద్దు. తమ్ముడికి అది లేందే ముద్ద దిగదు. నీకు అయిష్టం అయినా భరించాలి మరి. కోడి తినటం చాలా ఆరోగ్యకరం సుమా సహూ... కోడివేపుడు - కోడి పలావ్ - కోడిగుడ్లు... అసలు కోడి మనిషికి ముఖ్యాహారం... నువ్వు కూడా తినరాదూ?" అన్నాడు.

"ఆపండి" అనిఅరిచి చెవులుమూసుకుందిసహజ. రామారావు భార్య అహింసావిధానానికి సంతోషించాడుగాని కుటుంబంలో మాత్రం తను కోడలుగానే వుంది. కోడి రెండు రోజుల కోసారి వండబడుతూనే వుంది.

సీతమ్మగారు కోడల్ని అవమానించే ఆలోచనగాని- కోడిని దారుణంగా చంపే స్వభావంగాని లేని మనిషి. కోడిని చంపేది ప్రభాకరం. కాల్చుకుతిందామన్న ఆలోచన మాత్రమే ఆమెది... కాని సంపాదిస్తున్న ఇద్దరు కొడుకుల తల్లిగా ఆమె గర్వపడుతుంది. రిటైరయిన ప్రభుత్వోద్యోగి భార్యగా హోదా వెళ్ళబోస్తుంది.

ముప్పైఏళ్ళ కాపరంలో ఆమె పోలీసుసర్కిలినస్పెక్టరు భార్య- ఇప్పుడు ఇనస్పెక్టరు తల్లి. కోడలు సరోజిని నచ్చినా ఆమె మాటల్లో- చేష్టల్లో దర్పం వుంది. అది సరోజినికి అత్తగారి దర్పంగా తోచినా గాని, నిజానికి అది పోలీసుదర్పం. ఆ హోదానుంచి ఆమె అంగుళం దిగదు.

సరోజిని బహుచాలా మాత్రం భర్తగారాలయినా పసిపాపలు చదువుసంధ్యలూగల వ్యక్తే. తల్లిలాగా మనత్తలాగా ఆరితేరిన పనిమంతురాలు కాదుగానీ, ఈ బహూస్నేహం చెయ్యకముందు, కమూలియా మంజిల్ కిపోయి వెస్టియన్ కాకముందు, అందరాడపిల్లల్లాగానే అన్నీ పన్లూ నేర్చుకుంది.

ఇప్పుడు కూడా తెలివయినదే. కాని ఆమె హృదయం నక్సలైటు అడవివిడిచిరానట్లు... బూర్జ్వాసంస్థ విడిచి రావటం లేదు. బహుచెరమీద ప్రేమ పోవటం లేదు.

(4)

హిజ్రాలు (ఖోజ్జాలు)అంటే ఆమెకి చాలా అభిమానం. వీళ్ళనిగురించి మామూలు మనిషికి తెలిసింది చాలా తక్కువ

హిజ్రాలు డాన్సుచేస్తూ అడుక్కుంటూ స్వేచ్ఛగా బ్రతుకుతారు- ఈ సొసైటీలో చేరాలని అభిలషించేవాళ్ళు కూడా ఉన్నారని వ్రాయటానికి విచారం వేస్తున్నది.

హిజ్రాల సహోదరీస్వభావం మెచ్చదగిందేకాని వాళ్ళ సంఖ్యని పెంపుకోవటంకోసం ఇతర్లని ఆకర్షించటం క్షంతవ్యం కాదు- భారతీయ శిక్షాస్మృతి ప్రకారం జననేంద్రియాన్ని తీసివేయటమనే రాక్షసత్వం సెక్షన్ 320కింద నేరమేఅయినా స్వయంగా జననేంద్రియాన్ని తీసివేసుకోడం ఈ 320 వ సెక్షనులో నేరంకాదు. 309 సెక్షనులో గొప్పనేరం ఆత్మహత్యా ప్రయత్నం.

1880లో మహారాజా గైక్వాడ్ బరోడా న్యాయస్థానంలో జననేంద్రియాన్ని తీయటం ఘోరమైన నేరం అని స్పష్టీకరించారు. అప్పటి నుంచీ ఈ హిజ్రాలు తమ యాక్టివిటీస్ మరింత రహస్యంగా ఉంచుకున్నారు. వీళ్ళ సంఖ్య జనాభా లెక్కలలో వుండదు. వీళ్ళకి ఆదాయం పన్ను లేదు. వీళ్ళ యిళ్ళలోకి ఎవరూ పోలీసులతోసహా పోరు. సరోజిని లాటివాళ్ళని కొందర్ని ఆకర్షించటం వీళ్ళు డ్యూటీకింద భావిస్తారు.

మాహోభక్తులు కూడా వీళ్ళలో ఉన్నారు. దానికి కారణం వాళ్లు పిశాచాల్ని ఆహ్వానించటం వలన దేవాలయాలకి వెళ్ళరు. ఎవరయినా అడిగితేనా స్త్రీకులమనీ- మాహోభక్తుల

మనీ- మార్క్సిస్టులనీ చెబుతారు. చాలామందికి ఈఖోజ్జాలు చాలా గొప్ప హేతువాదులనీ- మావోయిస్టులనీ విధివంచితులైనా మెచ్చదగ్గ సామ్యవాదులనీ భ్రమింపచేస్తారు. వీళ్ళ పైశాచిక శక్తుల్ని వీళ్ళు చాలా గుప్తంగా ఉంచుకుంటారు. హైదరాబాద్‌లో చాలా ప్రయోగాలు బాణావతి పిశాచాలు వీళ్ళచేతులలో ఉన్నాయి. పైకిమాత్రం మార్క్సిస్టులూ, మావోయిస్టులూ, కమ్యూనిస్టులూను.

ఒక హిజ్రా చనిపోయి చైనాలో మావోగా జన్మించాడని వీళ్లు కొత్తకథ కల్పించారు. మార్క్స్ విషయంలో మాత్రం అలాటికథల్లేవుగాని, దేవాలయాలకు వెళ్ళనికారణం నాస్తికంగా చెపుతారువీరు- దేవాలయానికి వెడితే వీళ్ళ దుష్టశక్తులు పనిచెయ్యవన్నది వీరినమ్మకం.

సరోజిని నమ్మకం ఇదే. ఆమె గురువు కమాలియా ఆమెకు చెప్పింది చాలాఉంది. అందులో మొదటి విషయం దేవాలయానికి ఎట్టి పరిస్థితులలోనూ వెళ్ళొద్దు. కోడిని ఎట్టి పరిస్థితుల్లోనూ ముట్టుకోవద్దని ... తనపిల్లల్ని బహుచార మాతకి ఇవ్వాలనీను. ఈ మూడూ ప్రమాణాలు... మొదటి రెండూ ఆచరించటం తేలికే గాని, మూడోదానికి లక్ష అడ్డంకులు ఉన్నాయ్- సరోజిని కష్టించాలదు. ఆ పిల్లలు కుటుంబానికి చెందినవాళ్ళు. ఈ కుటుంబంలో ఇద్దరు పోలీసులు.అత్తగారు సి.ఐ.డి సరోజినికి భావస్వాతంత్ర్యమే గానీ వాక్స్వాతంత్ర్యం లేకుండా చేశారు వీళ్లు- పెళ్ళయింతర్వాత ఏమోగాని పిల్లలు పుట్టినప్పుడు ఆమెగర్వించింది. హిజ్రాజనాభాలో

శ్రీ శ్రీ అన్నట్లు నేను స్వైతం హిజ్రాగ్నికి సమిధనౌతానని ఆహుతివ్వవచ్చని.

సరోజిని కొందరు కవుల్ని విడదీసి వాళ్ళు హిజ్రా కవులని నిర్ణయించుకొంది. రచయితల్లో కూడా కొందర్ని ఖోజ్జా రచయితలని నిర్ణయించుకొని వాళ్ళని అభిమానించి వాళ్ళ రచనలవల్లనే హిజ్రా ప్రపంచం నిర్మితమవుతోందని నమ్ముతోంది. అందులో సోదరి రంగనాయకమ్మగారి విషవృక్షం గొప్ప హిజ్రా కళాఖండమని ఆమెభావన. ఈ రాముడు దేవుడు కాకుండాపోతే హిజ్రాల శక్తులు ఎక్కువయి, స్త్రీ పురుషులమీద కొజ్జాల అధికారం స్థిరంగా నిలుస్తుందని సరోజిని భావం. దేవాలయాల్ని పడగొట్టేయడం, తులసిమొక్కల్ని పీకివేయడంలాటి కార్యక్రమాలూ- రాముడి పటాలు తగలబెట్టడంలాటి కార్యక్రమాలూ-హిజ్రాప్రభుత్వపు నినాదాలు. మావో గతజన్మలో భారతదేశంలో హిజ్రాగనుక అతని సూక్తులు హిజ్రా ప్రభుత్వస్థాపనకి సహకరిస్తాయి. ఈరహస్య యంత్రాంగంలో ఆరేళ్ళ నుంచీ తను పాల్గొనలేక పోయినా- సరోజిని నమ్మకాలు బలపడ్డాయిగాని, వీసమంతవీక్ అవలేదు.

కానీ అత్తగారు సీతమ్మ పెత్తనంలో సరోజిని అనుకున్నవి అనుకున్నట్లుగానే ఉన్నాయిగాని ముందుకు సాగలేదు. దీనిమూలంగా అత్తా కోడళ్ళ మధ్య సివిల్ వార్ ప్రారంభమయింది.

తెల్లవారిన దగ్గరనుంచీ సరోజిని ఏపని చేద్దామని చూసినా - ఆపని మైలపడ్డట్టు చూస్తుంది సీతమ్మ - పగస్త

మాసం విషవృక్షం చదువుతూ కూర్చుంటుంది (సరోజని కాపు రానికి వచ్చిన నాలుగేళ్ళకి విషవృక్షం వచ్చింది. అదివరకు మిగతా పుస్తకాలు చదివేది) సాధ్యంకాక ఏ దోసకాయలో తరగబోతే-

"ముక్కలు పచ్చడికి పెద్దవి - పప్పుకి చిన్న ఏను- ఆదేం తరుగుడు - చూసి తరగవూ?" అంటుంది సీతమ్మ.

సరోజని బంగాళాదుంపలు వేపుడుకని తరిగితే "నూనె ఇంత ప్రియమైనరోజుల్లో వేపుడేమిటి? ఉడకేయాలిగాని - అంత చిన్న ముక్కలు ఉడకబెడితే గుజ్జు గుజ్జు అవుతాయి. అయినా ఏకూరముక్క ఎలా తరగాలో తెలియకపోతే ఎలా?" అంటుంది.

"కాఫీ నేను కాస్తాలే. ఎవరికెట్లా ఇవ్వాలో నీకు తెలియదు" అని అనటమే కాకుండా పారబోస్తుంది కూడానూ. ఈ పరిస్థితుల్లో తను కమాలియా దగ్గరనుంచి తెచ్చినమందు (స్లోపాయిజన్) ఎలా పెట్టాలో అర్థం కాలేదు సరోజనికి. అత్తగారు అనుక్షణం పోలీసువాడు ఖైదీని చూసినట్టు చూస్తుంటే ఆ మందు ఎలా పెట్టాలో తెలియలేదు సరోజనికి.

మొగుడికిమాత్రం గదిలో మంచినీళ్ళలో కలుపుతోంది. అందువలన అతను కాస్త తనమాట వింటూనే ఉన్నాడు - తనసలు దేవుడిగదిలోకిపోదు.

"కాస్త దేవుడికి పులికాపుపెట్టి దీపారాధనచేస్తే కొంపమునిగిందా? ఎంత నాస్తికురాలివైనా తులసికోటముందు ముగ్గుపెడితే ఏంపోయింది?" వగైరా మాటలు శేషు రికార్డరులా రోజూ అంటుంది అత్తగారు. అయినా సరోజిని ఆ పన్లుచెయ్యదు. ఏగ్లాసులో కడగబోతే-

"కాస్త గట్టిగా పట్టుకో...గాజు గ్లాసు. అయినా ఎప్పటిగ్లాసులు అప్పుడు కడుక్కోరూ. ఒకపూట అలాగే వుంచుకుని కడుగుతే వాసనకొట్టవూ?" అని మళ్ళీ తను కడిగి తోలుస్తుంది సీతమ్మ.

"రోజూ చేస్తున్న పనేగా. మళ్ళీ అప్పలమ్మచేత తోమించాలా ఏమిటి? అదిమాత్రం బద్దలుగొట్టదూ... అయినా ఏపని చెయ్యాలో నాకు తెలియదా ఏమిటి? అలా పాట పాడకపోతే" అన్నది ఒకరోజున సరోజిని.

సీతమ్మ విసుక్కుని "ఎలాచెయ్యాలో తెలిస్తే...ఈ వయసులో నాకీబాధ్యత ఎందుకు? దేముడి మందిరం గిట్టను గాని కాఫీకాయటం గిడుతుంది. మాయదారి సంత" అన్నది.

"మాయదారిసంతనా? కాఫీ కాయడానికీ దేముడికీ ఏంసంబంధం? నాకు దేముడంటే నమ్మకంలేదు...అది నా ఇష్టం. అయినా దేముడిని ఎవరు చూశారుగనక? మీకు మాత్రం దేముడు ఇంట్లో మనిషిలాటివాడనే నమ్మకం నాటుకు పోయింది - కావాలంటే మీరు ఎదగటానికి పుస్తకాలు ఇస్తాను చదవండి" అన్నది సరోజిని.

"ఎండి పోయింతరువాత ఎదగడమేమిటీ? నా బూడిద? అయినా ఎదగటానికి పుస్తకాలేంపనికొస్తాయి. మా తమ్ముడి కూతురు ఇంతమటుకు ఎదగలేదు. ఎన్నోమందులిప్పించాం. అది ఎదగలేదు.ఆ పుస్తకాలిట్లా పారెయ్యి వాళ్ళకి పంపిస్తాను"

"ఎదగటం అంటే అదికాదు...మానసికంగా ఎదగాలి మామాో చెప్పినట్లు?"

"మాంవో ఎవడు- పిల్లికూతలాగ. అయితే నేను మానసికంగా ఎదగలేదంటావు. కనబడని మనస్సుకి ఎదుగుడేమిటి నా మొహం. మాతమ్ముడి కూతురులాగా మనసుకూడా మాంచకమ్మా ఏమిటి నీ దృష్టిలో" అనేసి అక్కడనుంచి వెళ్ళిపోయింది సీతమ్మ. అత్తగారి తెలివితేటలకి ఆశ్చర్యపోయిన సరోజినికి పట్టుదల మరింత పెరిగింది.

సీతమ్మ అన్నట్లు మనసు ఎదగడం అనేది కొంచెం చిక్కుసమస్య. అదట్లాఉంచి సీతమ్మ ఎట్టిపరిస్తితిలోనూ సరోజినిని నమ్మటంలేదన్నది రెండోసమస్య. అత్తగారుగా కాదు. అసలు సరోజినిని చూస్తేనే (ఆడ) మాయలఫకీరు గుర్తుకొస్తాడావిడకి.

అప్పలమ్మ చిన్నపన్లూ పెద్దపన్లూ చక్కబెట్టినా, దేముడిపనీ తులిసెమ్మపనీ సీతమ్మకి తప్పదు. అతిజాగ్రత్తగా పొయ్యిదగ్గర అన్నీ పెట్టుకుని - దేముడినికూడా అక్కడే పీటమీద కూర్చోబెట్టి మరీ స్నానానికి వెళ్ళి వంటచేస్తుంద

సీతమ్మ - ఎప్పుడయినా దేముడు లేనప్పుడు సరోజిని వంట ఇంటికిపోతే పెద్దకేకలు పెడుతూ-

"దూరం దూరం ... నీబట్టలూ పిల్లలబట్టలూ ఆరేసుకో పోయి. నేను బ్రతికే ఉన్నాగా - నేను చేస్తేగాని కొంపలో ఎవరూ తినరు - అయినా ఈగోల నీకెందుకు? ప్రభు ఇవ్వాళ కోడిని తెస్తాడు" అని బెదరగొడుతుంది సీతమ్మ - ఇది కాకతాళీయమో! గడుసుతనమో అర్థం గాదు సరోజినికి - పెళ్లయి ఎన్నిరోజులయినా తనని వంటింట్లోకి రానివ్వదు సీతమ్మ. తన చేతిఅన్నంకాదు సరిగదా నీళ్ళుకూడా ఎవరూ ముట్టరు.

ముప్పయి ఏళ్ళనుంచీ వంటచేసినా సీతమ్మకి తృప్తి లేదు. ఆమెలో సంస్కారం ఏమిటోగాని...కోడలు వెనక ఏవో దెయ్యాలు కనిపిస్తాయి - సీతమ్మ అలాంటపుడు రామనామం చేస్తుంది. ఆసంగతి సరోజినికి తెలియదు.

రామారావు ఒకరోజున "ఈరోజువంట ఇలా ఉందే ముమ్మా, సరోజిని చేసిందా?" అన్నాడు.

"లేమనాయనా కూరతరిగింది. కొందరి చేతులతో కూర తరిగినా రుచిరాదు... నేనే తరుక్కుందామంటే కసపడి చావదాయె. ఆ అప్పలమ్మ కొడుక్కి జ్వరంట-అదీ రాలేదు" అంది సీతమ్మ - ఆవిడ మాటల్లో అర్థం ఆ కొడుకులకీ మొగుడుకీ తెలియాలిగాని సరోజినికేమీ అంతుబట్టలేదు - ఆవిడ అన్నమాటలు నిజమే. వంటిల్లు ఆవిడ చేతిలోఉంటే

ఆ రాయి నున్నగానూ - ఆ రంగులూ - అవిసె చేతులలో ఉన్న గూడు — ఈ మామిడి పనస వృక్షం సరోజలోకి పసిపిల్లని నిద్రపుచ్చు కోవటంపోయింట్లోకి నెట్టిన అవిసె. ఆమె హృదయం సీతమ్మ గారి కళ్ళకి అంత మరీ చమత్కారంగా రాలేదు.

రామారావునవ్వి "సరోజని చిన్నపిల్లగదా. రైగా రోజువిడిచి రోజు కోడి వంటావేమో. పోనిలే. ఇప్పుడేంపోయింది" అన్నాడు. ఆ మాటలకు సరోజనికి వళ్ళు మండలినకోపం వచ్చింది. కాని చేసేదేముంది? రామారావు వుద్దేశ్యంలో తల్లి అంటే దైవం... దిక్కు-మాలిన దైవం.

ఎప్పుడైనా రామారావు సరోజా అని పిలిచినా ఎక్కడి నుంచి వింటుందో సీతమ్మగారు- "నేను చెప్తున్నా పనున్నాం బాబూ- అదిసంగతి నందావుంటే ఇబ్బంది పెట్టకు" అని లేచి వచ్చి మరీ వడ్డిస్తుంది.

సరోజనికి రామారావుకి అన్నంపెట్టాలనీ- తద్వారా కమూలియూ ఇచ్చిన మందు పెట్టాలనీ- తన కొంగున కట్టుకొని బహుచార మాతకి అర్పించాలనీ- కన్న కలలు వెలిసిపోయి రూపుమారిపోయినయి. సీతమ్మగారు ఎన్నడూ కొడుకులకీ, భర్తకీ అన్నంపెట్టకుండా ఎక్కడికీ వెళ్ళదు. ఆఖరికి రాముల వారి సినిమా వచ్చినా సరే కాఫీకాచి ఫ్లాస్కులో పోసి భర్తకిచ్చి ఎన్ని జాగ్రత్తలు చెప్పి మరీపోతుంది. ఈ విధంగా సరోజని ఆశయాలు ఏ ఒకటీ ఫలించలేదు.

(5)

ఇంకా ఆశ్చర్యం ఏమిటంటే? కొడుకులకీ తండ్రికీ కలిపి వడ్డిస్తే సరేసరి - లేకపోతే అంతగా తనకి బద్ధకంవేస్తే- ముసిలాయన వెంకట్రామయ్యగారిని కొడుకులకి వడ్డిచ్చమంటుంది. అదీ కాకపోతే "నాయనా ప్రభాకరం! అన్నయ్యకి ఇంతపెట్టి-నువ్వు తిను. మీ నాన్న ఏదో తిప్పలుపడతారు లే- ఏంచేస్తాం?" అంటుంది కాని సరోజినికి ఛాన్సివ్వదు.

కూరా - పులుసూ - మజ్జిగా - వగైరాలు అక్కడే ఉంటాయికనుక అందరూ సీతమ్మగారి ఆజ్ఞ పాటిస్తారు.

సరోజని వచ్చిన కొత్తలో - మనుష్యులు పీటలమీద కూర్చుని కంచాలు కిందపెట్టడం చూసి ఆశ్చర్యపోయింది. కమాలియా ఇంట్లో మనుషులు కింద కూర్చుని కంచాలు పీటల మీద పెట్టేవాళ్ళు. మహారాజాలు ఆహారానిక అంతగౌరవం ఇస్తారు. ఇక్కడ ఏళ్ళు మాత్రం కంచాలు కిందపెట్టుకుని పీట నెక్కి బైటాయిస్తారు.

సీతమ్మగారు తను ఎడ్డించుకొని కోడలికి వడ్డిస్తుంది. ఒకరోజు - తను ఎడంచేత్తో అస్యహ్యమని ఎంగిలిచేత్తో కూర వేసుకోబోయింది. సీతమ్మగారు కెవ్వుమని అరుస్తూ "ఎంగిలి చేత్తో కూరగరిటె ముట్టుకుంటావా? ఎడంచెయ్యి ఏ పట్లో కలిసిందీ?" అన్నది అసహ్యంతో విసుగుతో.

అత్తగారి అంతి హూటుక్కి పోయేసరికి సరోజనిక ఖం గారు పుట్టుకవచ్చి "ఎడంచేత్తో ముట్టుకుంటే... అసహ్యమని- కుడిచేత్తో...గరిట" అంది నత్తులు గొడుతూ.

అత్తగారికి విపరీతమైన అసహ్యంవేసింది. కొంపలో శుభ్రం అనేది కావల్సినంతఉంది. ఎంగిలిచేత్తో గరిటముట్టు కునే ఖర్మలేదు. తన పుట్టింటివారినుంచి అన్నివస్తువులూ సారె తెచ్చుకుంది సీతమ్మగారు. అత్తింట్లోకూడా తక్కువ లేదు - ఈ హైదరాబాద్ పిల్ల పద్ధతులు - ఆమెకి అర్థం కావటంలేదు. పోనీ ఏమయినా ఆలోచిద్దామూ ? అంటే తండ్రీ కొడుకులు అసలు వినిపించుకోరు. తను ఆలోచించీ ప్రయో జనం లేదు.

"గరిటనేగా ముట్టుకుంది? గరిటలోంచి కూరలోకి మైల ప్రవహిస్తుందా ఏమిటి ? కూర వేసుకోండి" అన్నది సరోజిని.

సీతమ్మగారు ఉరిమి చూస్తూ "గరిటలోంచీ ప్రవహిం చదు పీటలోంచీ ప్రవహించదు. అస్తమానమూ అడ్డమైన పుస్తకాలూ చదువుతావు గదా ? శుభ్రం కొంచెంకూడా లేదేమిటి ? డాక్టర్లుకూడా పరిశుభ్రంగా ఉండమంటారని నువ్వు వినలేదా ?... ఓపక్క చెపుతూనే వున్నాను. మజ్జిగ కూడా ముట్టుకున్నావు. ఏమనిషికయినా స్వతహా తెలియక పోతే ఒకళ్ళుచెపితే వినాలి...ఛి...ఛి ... పాడు అలవాట్లు" అంది.

"పూర్వం ఈ గరిటెలూ అవి ఉన్నాయా ఏమిటి ?" అంది సరోజిని తాపీగా.

"శాస్త్రులకు ఎప్పుడూ ఉన్నాయి. మా పుట్టింట ఎప్పుడూ ఎంగిలిచేత్తో ఏదీ ముట్టుకోరు - పసిబిడ్డనీ పాల

కుండనీ ఒకలాగా చూసేవారు. భార్యాభర్తలు ఉదయాన ఆ గిట్టలువిడిచే, పెద్దవాళ్ళకీ పసిబిడ్డలకి కనిపించాలి. దిక్కుమాలిన హైదరాబాద్... మొన్నటివరకూ ఒంటెల పాలేగా అక్కడ. నీకు తెలియకపోతే నేను చెప్పినట్లు విను, తెలిసిందా?" అన్నది గద్దిస్తూ సీతమ్మ. సరోజిని మాట్లాడలేదు. ఆనాటినుంచీ అత్తగారితో భోజనం చెయ్యాలంటే భయం పట్టుకుంది ఆ మెకి. సీతమ్మగారి నోరేగాని సరోజిని ఏమీమారలేదు. బహుచార్ మాత దయవలన అత్తగార్నికూడా ఖోజ్జాల్లో చేర్చాలని కంకణం కట్టుకుంది.

# 3

అత్తగారికి తనపొడగిట్టదని గ్రహించినాకకూడా సరోజిని తనఅలవాట్లని నిరాఘాటంగా సాగించుకుంటూనే వుంది. ఇంట్లో కూరలువుంటే కత్తిపీటముందేసుకుని అన్నీ తరుగుతుంది - సీతమ్మగారు స్నానంచేసి వంటింట్లోకి వచ్చేసరికి కూరలన్నీ గుట్టలుగా తరిగివుంటాయి. అది చూసి ఆవిడ నెత్తీ నోరూ బాదుకుని "ఇన్నికూరలు ఈ విధంగా - తరిగి పాడు చేశావు. సంసారివేనా? ఇన్నికూరలు పాడుచేసుకుంటారా? ఎక్కడైనా. ఏరోజూ అన్నీ మిగిలిపోవడమే. పొరపాటు నాదే అనుకుంటున్నాను. కూరలురుచిగా లేవేమో అనుకుంటున్నాను. ఇదా సంగతి" అంది.

"బాగుంది, కాస్త కూర తరిగితేనే ప్రాణం పోతుందా? ఎప్పుడూ ఎవరో ఒకరు మింగడానికి వస్తూనేఉంటారుగా,

కాస్త ఎక్కువ తరిగితే కొంప మునిగిపోయినట్లు అరు స్తారేం ?" అంది సరోజిని. సీతమ్మగారు చిత్రంగా కోడలివంక చూసి-

"అవునా, నీ అహింసా సిద్ధాంతం కూరల దగ్గర వర్తించదా ?" అన్నది.

"మాటమాట్లాడితే నా సిద్ధాంతాల జోలి ఎత్తు తారేం? మీ సంగతి మీరు చూసుకోండి" అన్నది సరోజిని.

కూరలూ బియ్యమూ వగైరా జమా ఖర్చులన్నీ సీతమ్మగారే చూసుకుంటుంది - ఆవిడ పెద్దరికంలో ప్రేమలో - పొదుపులో అందరూ సుఖపడుతూనే ఉన్నారు సరోజిని తప్ప.

సరోజినికి మాత్రం సీతమ్మగారిమీద సదుద్దేశం ఏ కోశానా లేదు. సీతమ్మగారు ఉన్న వాళ్ళింట్లో పుట్టి - ఉన్న సంసారంలో పడినా- ఆవిడ చాలా పొదుపరి - ఆవిడ కొడు కులు కూడా దర్జాగా ఉన్నాగాని ఆమె వస్తువు దుబారా చేయదు. అందుకే వెంకట్రామయ్యగారు సీతా సీతా అని ఆవిడకి ప్రత్యేక గౌరవం ఇస్తారు.కొడుకులకి ఆవిడ సాక్షాత్తూ దైవమే - తన కాలానికీ ఈ కాలానికీ పెరిగిన ధరలిచ్చి చూపి - ఉప్పు దగ్గరనుంచి ఊరగాయవరకూ పట్టిన దరి ద్రాన్ని గురించి ఆవిడ చాలా జాగ్రత్తగా ఉంటుంది ఖర్చు విషయంలో - అన్నీ కొనుక్కుతినాలి కనక నాలుగు డబ్బులు చేతిలో ఉంటే మంచిదనేది ఆవిడ ఉద్దేశ్యం.

అత్తగారి పొదుపు గురించీ - మాబరా గురించీ సరో జినికి ఏమీ పట్టదు. ఇంట్లో ఉన్న వస్తువుల్ని పాడుచేస్తే - కొన్నాళ్ళకి దరిద్రం వస్తుంది - దరిద్రం వస్తే తన భర్తా మరిదీ లంచాలు పడతారు. లంచాలు పడితే ఉద్యోగాలు పోతాయి - ఉద్యోగాలు పోతే కమాలియా ఇంటికి... ఈ ఆలోచనలు సరోజినికి బహు - ఆనందాన్ని కలిగించేవి.

ఫస్ట్ తారీఖున తెచ్చిన సరుకుల్లో సగానికి సగం అప్ప లమ్మ ద్వారా అమ్మిస్తుంది సరోజిని. ఇది అప్పలమ్మకూ లాభమేగనక అది సరోజిని ఎడల అత్యంత ప్రేమాదరాలు చూపుతుంది. సీతమ్మగారు కొట్లవాళ్ళనీ వాళ్ళ బాబుల్నీ తిట్టటంతప్ప అసలు విషయం గ్రహించలేదు - అసలలాంటి ఆలోచనే ఆవిడకి రాలేదు. అలాటి ఆడవాళ్ళు ఉంటారని వినటమేతప్ప ఆవిడ చూడనూలేదు.

కమాలియా పుట్టినరోజు...అంటే ఖొజ్జాల సంఘంలో కలిసిన రోజున గొప్ప విందు జరుగుతుంది హైద్రా బాద్‌లో - ఒకసారి సరోజిని ఆ సందర్భాన్ని పురస్కరించు కొని గారెలు మొదలుపెట్టింది - పిండి రుబ్బటం చప్పుడు విన్న సీతమ్మగారు దొడ్లోకి వచ్చి - "ఏమిటిది" అని అడిగింది

"గారెలు చేద్దామనుకుంటున్నాను"

"ఏ పండగ ?"

"పండగకాదు చేద్దామనిపిస్తే...చేస్తున్నాను" రుబ్బు తూనే సమాధానం ఇచ్చింది సరోజిని.

"నూనె లేదు... నెలంతా ఎలా వెళ్ళాలి? ఫస్టుకి ఇంకా నాలుగు రోజులుంది. నిన్న మీ మామగారు పెసరట్లడిగితే హోటలుకి పొమ్మన్నాను. అయినా నూనె సంగతలా ఉంచి ఇప్పుడీ గారెలు దేనికి? ఎవరు తింటారు? నేను బ్రతికున్నా గదా, నన్ను అడగక్కరలేదా?"

"గారెలకి కూడా అడగాలా? మీరూ ఒకింటికోడలే! అంది సరోజిని.

సీతమ్మగారు ఆ మాటతో అక్కడినుంచి వెళ్ళిపోయింది - గారెలు రామారావూ సరోజినీ తప్ప ఎవరూ తినలేదు. మిగిలినవన్నీ పండారాలకి అప్పలమ్మకీ ఇచ్చింది సరోజిని.

మరునాడు ఉదయానే నూనె కొంచెం కూడా లేక పోవటం చూసి సీతమ్మగారు పది నిముషాలు విసుక్కుని చివరకి సరోజినిని పిలిచి-

"పక్కింటి ప్లీడరుగారి భార్యనడిగి నూనె బదులు తీసుకురా. నీ మరిది గంతులేస్తూ టిఫినుకొస్తాడు. కాస్త ఉప్మాకి లేపెడతాను" అంది. ఎన్నడూ అప్పులు చేయని సీతమ్మగారు అలా అనేసరికి సరోజిని సంతోషం పట్టలేక-

"వాళ్ళింట్లో లేదంట... అప్పుకావత్తా... నెలాఖరుగా. అందుకని డాక్టరు గారింట్లో కూడా అడిగి వస్తాను" అంది సరోజిని.

విషయం అర్థం అయింది సీతమ్మగారికి. ఆ డాక్టరు నాస్తికుడు. ఆ కుటుంబమంటే అభిమానం సరోజినికి. అయినా

అయిపోయిన నూనెకీ ఆ స్త్రీత్వానికీ సంబంధం ఏమిటి గనక ?

"తొందరగా వెళ్ళు...నీ మరిది లేస్తూనే ఆకలి అంటాడు. వాళ్ళింట్లో ఏదైనా గిన్నెలో పోయించుకురా. అప్పు తీరుస్తున్నట్లుగా ఉండాలి వాళ్ళే...మనం అప్పడిగాం అంటే ఇంట్లో అందరూ కోప్పడతారు - పోయిరా" అంది సీతమ్మ తొందరపెడుతూ.

"నే వెళ్ళను...డాక్టరుగారింట్లో లేకపోతే ?"

"నిన్న నూనెంతా - నాశనం చేసింది నువ్వు - ఇంట్లో నూనెలేదు. ప్రభాకరం రెండింటికి భోజనం చేస్తాడు. ఏమీ పెట్టకుండా ఎలా పంపేది ? నీకు జ్ఞానం అనేది ఉంటే నిన్న ఆ దిక్కుమాలిన గారెలువండ పారబొయ్యక పోదువు. ఇప్పుడేమిటో సిగ్గువెలగబెడతావేమిటి ? సిగ్గు...ఛీ ఛీ" విసుక్కుంది సీతమ్మ.

"కాసిని గారెలకే అడుగు పడుక్కు పోతుందా ? అయినా ఈ ఇంట్లో ఇవ్వటం తెచ్చుకోవటం ఎప్పుడేడిసింది గనక. డాక్టరుగారు నాస్తికులు వారింటికి పోరాదు. ప్లీడరు గారు పెద్దమనిషి. వాళ్ళింటికి పోరాదు. మోహన్ రావుగారు- మావోయిష్టు. వారింటికి పోరాదు...ఇన్ని ఖాయిదాల మధ్య అప్పుచేయకపోతేనేం కొంప మునిగిందా ?"

"నిన్న నువ్వు చేసిన ఘనకార్యానికి...నా కాయినా తెలాసాగుతాయిగాని...ఇంకనూ వెడతావా ? వెళ్ళవా ?"

"పొద్దున్నే ఏమిటి గోల... నేనూ మనిషినే. నా మొగుడూ సంపాదిస్తున్నాడు..." సరోజిని మాట పూర్తి గాకుండానే ప్రభాకరం అక్కడికి వచ్చాడు నవ్వుతూ.

"ఉదయమే... తప్పుడు కేసుపట్టిన హెడ్ కానిస్టేబుల్లా ఒదినేమిటి? అంటున్నది" అన్నాడు.

"ఆవిడ హెడ్ కానిస్టేబులేమిటి నాయనా... ఇనస్పెక్టరు జనరలే. నిన్న ఉన్న నూనెంతా తగలెట్టి గారెలువండి అప్పలమ్మ మొహాన కొట్టింది... ఈపూట టిఫిను చేద్దామంటే - కొంపలో నూనె లేదు. అప్పుడు పోయిరమ్మంటే... నా మొగుడూ సంపాదిస్తున్నాడని జవాబు. ఏంచెయ్యమంటావు?" అన్నది సీతమ్మ విసుగ్గా.

నిజానికి సరోజిని చేసినపని ప్రభాకరానికి నచ్చలేదు. గారెలు వండటం నేరంకాదు గాని - నెలాఖరుకి నూనె లేకుండాచేయడం - అమ్మని ఎదిరించడం నేరమే.

"ఊరుకో అమ్మా! ఈపూటకి ఎలాగో చెయ్యి. సాయంత్రం నేను నూనె తెస్తాను... ఈ మాత్రందానికి ఎన్నడూలేంది అప్పు దేనికి?... అయినా ఇదివరకు వస్తువులకంటె రెట్టింపు తెస్తున్నాగాని - పదిహేను రోజులకే అయిపోయినవంటున్నావు" అంటూ అప్పుడే వస్తున్న అప్పలమ్మకేసి యధాలాపంగా చూశాడు ప్రభాకర్. అది ఖంగారుపడింది... ఆమంత్రించాలు ప్రభాకరానికి. కాని అప్పటికి ఊరుకొని బాత్ రూములోకి వెళ్ళిపోయాడు.

(6)

సీతమ్మగారు వంటింట్లోకి వెళ్ళి నేతితో తిరుగమూత పెట్టింది. ఆ సువాసనకి అందరూ మేల్కొన్నారు. దొడ్లో కొచ్చిన రామారావుని చీదరగా చూసి లోపలికి వెళ్ళిపోయింది సరోజిని.

సరోజిని ఆరోజునేకాదు అంతకుముందుకూడా...అందరికీ అప్పులిస్తున్నది. బియ్యం, వుల్లిపాయలు - పంచదార - కాఫీపొడి, పప్పులు, అన్నీ ఇవ్వటం - మళ్ళీ అడక్కపోవటం- అప్పలమ్మద్వారా ఖరీదు రాబట్టుకోడం. అప్పులివ్వడం వరకే సీతమ్మగారికి తెలుసుగాని తిరిగితీసుకోటం ఆవిడ చూడలేదు. అమ్మటం అనే విషయం ఆవిడ ఊహాక అందలేదు.

ఇదిట్లాఉంచి ఫ్లాస్కులాటి వస్తువులుకూడా ఎరువిచ్చి పగిలినయ్యని అప్పలమ్మతో అనిపించి అమ్మనుంది సరోజిని. డాక్టరుగారిభార్యకీ సరోజినికీ స్నేహం, అందుకని ఆవిడవచ్చి పుస్తకాలే కాకుండా-

"అక్కా...ఇవ్వాళ కూరలేంకొన్నారు ?" అని అడిగి సగంపైన తీసుకుపోతుంది - అరకిలోనుంచి కిలోవరకూ దేముడిని విమర్శించి మరీపట్టుకుపోతుంది ఆవిడ. ఇంకా పెద్దపని... అంటే నెయ్యీ వగైరాలు కావాలంటే రాముడిని దేవుడు కాదనీ, పరమ మూర్ఖులు వ్రాసిన ఆ పాతపుస్తకాల్ని నమ్మొద్దనీ నాలుగుతిట్టి మంచినెయ్యి పట్టుకుపోతుంది. ఇక ఆ వస్తువులు ఒకటేరావటం.

సరోజిని అత్తగారిలా కాదమ్మా! కాస్త కష్టంసుఖం తెలిసిన మనిషి. అందరితో అలా అలా కలిసిపోతుంది అంటుంది నాస్తికుడైన డాక్టరుగారి భార్య. అలా అనటంతో ఊరుకోదు. ఎస్కెట్టుకోసం సీతమ్మగారి ముఖంచూస్తుందికూడా- సీతమ్మగారుకూడా కోడల్ని గురించి నిరాశ చేసుకొన్నదనే చెప్పాలి - కాని ఒకనాటి మధ్యాహ్నం రామారావూ ప్రభాకరం భోజనాలు చేస్తూన్నారు. "అబ్బ" అన్నాడు ప్రభాకరం.

"ఏమిట్రా?" రామారావు తాపీగా అడిగాడు.

"రాయి. ఏమ్మా! బియ్యం నెల్లూరువైతేనే పనికి రావుగా నీకు? ఈ దరిద్రప్పుబియ్యం ఎక్కడివి?" అన్నాడు తల్లివంక విసుగ్గా చూస్తూ ప్రభాకరం.

సరోజిని వింటూనే ఉన్నదని దృఢపరుచుకొని సీతమ్మగారు మొదలెట్టింది.

"నేనేం చెయ్యను? మీ ఒదిన డాక్టరుపెళ్ళానికి అప్పిచ్చింది ఆరుకిలోలు. అవి ఆవిడ తీర్చింది...నా పోరు పడలేక. అవేవండాను. ఇలాఉంది అన్నం. వాళ్ళింట్లో మంచిబియ్యమే తింటారు. ఇవి కేవలం అప్పుతీర్చడానికే కొన్నట్లున్నారు. మంచిదోసకాయలూ, మంచిబియ్యమూ పట్టుగెడుతుంది మీ వదిన్ని అడిగి. ఇహ అవి తీర్చదు. నేను ఊరుకోలేక మొన్న ఇలా అప్పులిస్తే సంసారంసాగినట్లే అన్నాను. అందుకని ఇదిగో ఈ విధంగా అప్పుతీర్చింది.

ఒకటా రెండా ? ఆరుకిలోలు...మరి పారబొయ్యనా ? అవే వండాను" అన్నది విచారంగా సీతమ్మగారు.

ప్రభాకరం "అన్నం అలాతగలడ్డదిసరే - కూరకూడా రుచిగాలేదమ్మా" అన్నాడు విసుక్కుంటూ.

సీతమ్మగారు మాట్లాడలేదు.

"అవికూడా అప్పతీర్చిన బాపతా ? ఛీ, ఛీ"

"మరి ఆరుకిలోల బియ్యంగదరా! పారబోసుకుంటామా ?"

"అంటే ?"

"రేపూ అవే తినాలి"

"ఎన్నడూ లేనిది ఈ అప్పులివ్వటం ఏమిటి ?"

"బాగుంది. ఇరుగుపొరుగన్నాక సహాయం చేసుకోరా ? అంటుంది మీా వదిన ?"

"అసలు వాళ్ళకి అప్పెందుకమ్మా? డాక్టరుగారు ఇన్ కంటాక్స్ కడుతున్నాడు - మరి ఈ అప్పేమిటి ? ఈ రాళ్ళేమిటి ?"

"ఆవిడ అన్నీ అప్పుతీసుకుంటుంది. మంచివి తీసుకుని పనికిమాలినవి అప్పుతీరుస్తుంది...ఇలా ఎంతకాలంగడుస్తుందో నాకూ అర్థంకావటంలేదు"

"నాకు తెలుసమ్మా! నువ్వేం బాధపడకు. డాక్టరు పెళ్లాం సంగతి తెలుసు...ఒ..."

"ప్రభాకరం" కోప్పడింది సీతమ్మ.

"అయితే ఈ పస్తులు రోజూ ఉండాలా ?"

"ఏంచెయ్యమన్నావు ?"

"ఏం చెయ్యాలా ? ఈ కొంపలో ఆవిడ కోడలు-నుఫ్ఘ అత్తవు. ఆ గౌరవం అక్కర్లేదు ... పెద్దదానివనే గౌరవంకూడా అక్కరలేదా ?"

"నువ్వు అనుకుంటున్నావు ఆమాట ?"

"ఆవిడా అనుకుంటుంది గట్టిగా చెపితే ?"

"నాకు చేతగాదురా తండ్రీ! నీకు చేతయితే అడుగు?"

"అన్నయ్యా విన్నావుగా ! నువ్వు చెప్పు" అన్నాడు ప్రభాకరం బుద్ధావతారంలాగా కూర్చుని తింటున్న రామారావుని చూసి.

"నేనుమాత్రం ఏం చెప్పను ?"

"వదినతో పోట్లాడమని అనటంలేదు. ఈ అప్పుల వ్యవహారం కాస్త మానిపించు. కడుపునిండా శుభ్రంగా తింటాం. ఎంతో అవసరం అయితేతప్ప నాన్న అప్పుచేయలేదు. అమ్మ ఇలాంటి అప్పులు చేయటం మనం ఎరగం. ఇప్పుడూవద్దు. ఆమాటే వదినతో చెప్పు"

"నువ్వు చెప్పింది నాకు తెలుసు తమ్ముడూ! నాకూ చెప్పాలనే ఉంటుంది. కాని మీా వదినదగ్గర ఏం మాట్లాడాలన్నా నాకు భయంవేస్తుంది - ఎందుకో తెలియదు" అన్నాడు

రామారావు. సీతమ్మగారూ ప్రభాకరం తెల్లబోయి అతని వంక చూశారు. రామారావు నీరసంగా మళ్ళీ-

"ఇవ్వాళ ఆమాటలంటే... తెల్లారేసరికి ఆఫీసుకు వెళ్ళలేను తమ్ముడూ... అయినా ఆమాట నువ్వే చెప్పు. నేనేం అనుకోనులే"

నిశ్శబ్దం భయంకరంగా పదిక్షణాల్ని భారంచేసింది.

"అన్నయ్యా"

"ప్రభూ"

"వదిన... నిన్ను... కొ... కొడుతుందా?"

"లేదు"

"మరి ఆఫీసుకు ఎందుకు వెళ్ళలేవు?"

"తెలియదు. ఆమెతో ఏదయినా ఆమె ఇష్టానికి వ్యతిరిక్తంగా మాట్లాడితే... తెల్లవారి లేవలేను"

"అన్నయ్యా ... క్షమించు ... సెక్సువల్ కోర్సు వల్లనా?"

"కాదు"

"మరి ఎందువల్ల?"

"అది తెలియటం లేదురా... ఆవిడ అభిప్రాయాలు వేరు. ఆమెలో అవి జీర్ణించిపోయినాయి. మనంమార్చలేం"

"ఆ అభిప్రాయాలు నీకర్థమయ్యాయా? ఆవిడని హెచ్చ
రించావా!"

"అభిప్రాయాలు...అర్థం...కావటం లేదు. అయినా ప్రేమిస్తునే వున్నాను. దానివల్లనే ఈ స్థితికి వచ్చాను."

"అన్నయ్యా"

"అవును తమ్ముడూ... నాకు సొంతఆలోచనలు రావు. నీ పంటికిందపడ్డరాళ్లు నా పంటికిందకీ వచ్చాయి. కాని వాటిని నేను అర్థం చేసుకోలేను... రాళ్ళని అర్థం చేసుకోవటం ఏమిటి? రాళ్ళని నేను అతిప్రయాసముగా నమిలి మింగాను" అన్నాడు రామారావు. పోలీసు ఆఫీసరైన ప్రభాకరం అన్నగార్ని పరీక్షగా చూశాడు. అతని [illegible] అతని మాటలూ విడ్డూరంగా వున్నాయి. సీతమ్మగారు తెల్లపోయి పెద్దకొడుకువంక చూసింది.

ప్రభాకరం కోపంగా "అన్నయ్యా! అది భార్యపట్ల అభిమానమా? దురభిమానమా?" అన్నాడు.

"రెండూ కాదు... ఏమి లేదు... ఏదో ఉందంటావా?"

ప్రభాకరం కంచంలో చెయ్యి కడుక్కొని వెళ్ళిపోయాడు. సాయంత్రం అయింది. సీతమ్మగారు కోడల్ని పిలిచి బియ్యం ఏరమంది.

"ఏరటం నాకు రాదు" కటువుగా అంది సరోజిని.

"పోనీ మీ హైదరాబాదుపద్ధతి ప్రకారం గాలించు."

"నాకు గాలించటం కూడా రాదు" అన్నది సరోజిని పుస్తకము చదువుతూ.

"మీ అమ్మానాన్న మా అమ్మాయికి అన్ని పన్లూ వచ్చని చెప్పారుగా"

"వస్తే... చెయ్యాలని రూలుందా? మేం రాళ్ళు తిని రాళ్ళు అరిగించుకోగలం. మీకోసం, ముసలాయన కోసం మీరే ఏరుకోండి" అన్నది సరోజిని. సీతమ్మగారి వళ్ళు మండి పోయింది.

"అసలేమిటి? నీ నిర్లక్ష్యం!" అందివమనాలోంతో చక

"అవును బియ్యంలో రాళ్ళు కలవకపోవటానికి మనకు పంటవస్తోందా? మీకు తెలియదేమో! దొంగసారాలాగానే రాళ్ళుకూడా బియ్యంలో కలపటానిక తయారుచేస్తారు. అలా టప్పుడు మింగాలిగాని ఏరుకుంటూ కూర్చుంటామా? మంత్రు లందరూ కూడా ఈ మాట తెలిసే ఊరుకుంటున్నారు... అసలీ స్త్రీ పురుష ప్రపంచమే ఇంత..." అని నాలుక్కొరుకుకొంది సరోజిని.

అపుడే వచ్చిన ప్రభాకరం "వదినగారికి రాజకీయ పరిజ్ఞానం కూడా ఉందన్నమాట- బియ్యంలో రాళ్ళు కలపమనే మంత్రులు ఎవరో చెపితే వాళ్ళ సంగతి తేలుస్తాం" అన్నాడు.

సీతమ్మగారికిమాత్రం బియ్యంలో రాళ్లుకలిపింది డాక్టరు పెళ్లామో మంత్రిగారో తెలియలేదు.

"నేరానికి శిక్ష విరుగుడు వదినగారూ... మనుషులు నిజాయితీగా బ్రతికితే ఏ శిక్షా అవసరం ఉండదు ... ఇప్పటి

గవర్నమెంట్లో మంత్రిగారయినా- డాక్టరు భార్యయినా బియ్యంలో రాళ్లు కలిపితే శిక్ష. హాయిగా జీవించే అవకాశాన్ని ప్రతి ఒక్కరూ వినియోగించుకోవాలి. మంత్రి చెప్పినంత మాత్రంచేత బియ్యంలోరాళ్ళు కలపడం మంచిపని కాదు. అధికారశక్తిని దుర్వినియోగంచేస్తే - మంత్రినుంచి నా వరకూ దిగిపోక తప్పదు" అన్నాడు ప్రభాకరంనవ్వుతూ.

సరోజిని అక్కడనుంచి వెళ్ళిపోయింది.

"ఏమిటోగోల... ఈ దిక్కుమాలిన బియ్యం అవతల పారబోస్తాను. అసలీగోలేమిటో తెలియటంలేదు" అని స్వగతం చెప్పుకుంది సీతమ్మగారు.

## 4

అది త్రిటౌన్ పోలీస్‌స్టేషన్. హెడ్ కానిస్టేబులు ఉపన్యాసం దంచుతున్నాడు.

"అరే కొత్తోడా? ఈ బియ్యంలో రాళ్ళనించి మా బామ్మర్దికి ఆపరేసను చెయ్యాల్సొచ్చింది...అయినా పెద్దోళ్ళు ఈ పని సెయ్యరు. సిల్లరకొట్టు ఎదవలే కక్కుర్తి పడతారు...ఇదంతా గాచారంరా బాబూ. మనం ఆ బియ్యం వేకొంటాం...మనపర్సు ఖాళీగనక...మన పెళ్లాలు ఓపికుంటే ఏర్తాయి. లేదా మనం ఆసుపత్రిపాలు. ఆర్జి సంచిత ప్రారబ్ధ కర్మచే ఆసుపత్రి పాలు కొన్నాళ్ళు.

'అందుచేత మనం రాళ్ళ బియ్యం తినాలి. కల్తీ పప్పులు మింగాలి. కాకావోడు ఇక్టోరియారాణి టైముసించీ ఒకే గిన్నెలో మరగబెట్టుతున్న టీ తాగి బతకాలి. బతకలేకపోతే చావాలి. అంతేగాని ఆ బియ్యం బియ్యమే. ఆ పప్పులు పప్పులే. ఆ టీ టీయే. ఇదిరా కత. ఈ దేశపు రామాయణం" అన్నాడు వీరయ్య హెడ్డు.

"ఊరుకోండి బాబూ. ప్రభాకరంగా రొస్తున్నారు"

త్రిటౌన్ యస్సయి. అనగా సబ్ ఇనస్పెక్టరు కందిమళ్ల ప్రభాకరరావు. అతను చాలా మంచివాడు. అతను పట్టిన కేసుని లాయరూ జడ్జీలూ మన్నించేస్తారు. అంత మంచివాడు. ఈమధ్య నగరంలో జరిగిన పూలదుకాణం వాడి హత్య కేసుని పట్టుకున్న దగ్గరనుంచీ అతనంటే డి యస్పీకి కూడా గౌరవం. అతనొచ్చి సీట్లో కూర్చుని-

"హెడ్ కానిస్టేబుల్" అన్నాడు. హెడ్ వయసులో పెద్దవాడు అనుభవజ్ఞుడు. అందుకే ప్రభాకరానికి గౌరవం.

"సార్" అన్నాడు హెడ్డు.

"కొంపలో కడుపునిండ లేదయ్యా...ముందు కాస్త కాఫీ తెప్పిద్దూ!"

"అదేటిసార్ ! అమ్మగారికి ఒంట్లో బాగలేదా ?" అన్నాడు హెడ్. ఇతను వెంకట్రామయ్యగారి దగ్గరకూడా పనిచేశాడు. అందుకని సీతమ్మగారంటే ఎనలేని భక్తి గౌర

వాలు. ప్రభాకరాన్ని చూస్తే సొంతమేనల్లుడు చిన్నతనంలో పైకొచ్చినట్లు సంతోషిస్తాడు. ఆ చనువు కూడా ఉంది. అందుకే అడిగాడు.

"అమ్మగారికి బాగానే ఉంది గానీ...ముందు కాఫీ తెప్పించు"

"ఎక్కడినించి సాబ్"

"ఎక్కడనుంచయినా సరేనయ్యా - నువ్వు గడ్డిపెట్టినా తింటానిప్పుడు" అన్నాడు ప్రభాకరం. హెడ్ కానిస్టేబుల్ వీరేశలింగం ఉరఫ్ వీరయ్య మాట్లాడకుండా బయటకు వెళ్ళాడు. కొంచెం సేపటికి కాఫీతో వచ్చాడు. కాఫీ తాగిన ప్రభాకరం కొంచెం తేరుకుని-

"ఇది పోలీస్ స్టేషన్ కాకపోతే నిన్ను మామయ్యా అని పిల్చేవాడిని. అంత బాగుంది కాఫీ" అన్నాడు.

"చిన్నప్పుడు ఆ మాట సాబ్...అసలు సంగతేమిటి?"

"అదే నాకూ అర్థం కావటం లేదయ్యా?"

"చోరీయా? చీటింగా? కంపెనీలమీద రైడింగా? ఏటిసార్ కత?"

"తెలియటం లేదయ్యా"

"చెప్పండి సాబ్ చేస్తాను"

"ఎక్కడని? ఎవరిమీదని? ఏమని?"

“ఏంటిసార్...సినిమానా? పోలీసులంటే? కడుపులో బిడ్డకూడా సాక్ష్యం పలకాల. సెప్పండి” అన్నాడు.

ప్రభాకరం నవ్వుతూ “వీరయ్యా! భారతదేశంలో లాగానే - ఇండొనీషియాలో ఉన్న పోంటియానాక్ అనే ద్వీపంలో ఆడవాళ్ళని అమిత గౌరవంగా చూస్తారు. ఆ దేశపు లా ప్రకారం ఏ ఆడదైనా నీటిలో మునిగి పోతుంటే రక్షించిన వాడిని శిక్షిస్తారు. అందుకని ప్రతి ఆడదీ విధిగా ఈత నేర్చుకుంటుంది - ఆత్మరక్షణకోసం. అలాగే పోలీసు వాడు కూడా నేరాల నీటిలో ఈత నేర్చుకోవాలి. లేకపోతే మనల్ని రక్షించేవాడు లేడు” అన్నాడు.

“అంతేసార్, రాత్రి లాకప్పులో పెట్టిన ఆడమనిషుంది చూశారూ...ఆమెగోరు చాలా పతివ్రత అనుకుంటారు సార్ ఎవరైనా”

“అయితే మన వాళ్ళెందుకు పట్టుకొచ్చినారు”

“పోలీసాడి కన్ను కప్పటం సాధ్యమా సార్. ఈ పతివ్రతని సత్తెనాణపురంలో చూసి నేను రెండుసార్లు ఒదిలేశాను సార్ - మూడోసారి పూర్ణానందంపేటలో అనుమానించి కూడా ఒదిలేశాను సార్...ఇప్పుడు రామ్మందిరం యీదిలో ఆయుర్వేద వైద్యుడూ ఆడిపెళ్లాం ఆడి ముసలితల్లీ - ఆరుగురు పిల్లలూ ఉన్న పెద్ద కంపెనీ ఉంది. సూడండి సార్...హమ్మ. ఏదైనా పిల్ల కనబడితే మందు నూరడాని కంటారు. కొంచెం గట్టిగా అరిస్తే పినతల్లి కూతురంటారు.

ఇంకా అరిస్తే...సారా ఇచ్చి పిల్లనీ ఇస్తారు. అప్పటికీ కాదంటే లంచం ఇస్తారు. ఆ కంపెనీలో ఈయమ్మా... కల్పింత సావుకోరోకడూ...దొరికారు సార్...సావుకార్ని ఈమెనీ పట్టేసినాం ... డాక్టరూ ... ఆడిపెళ్ళాం జామీను ఇవ్వడానికి వచ్చారు. రమ్మంటారా?" అన్నాడు హెడ్ కానిస్టేబులు.

"ముందు ఆ డాక్టరునీ...ఆయన పెళ్ళాన్నీ రమ్మను" అని సర్దుకుకూర్చున్నాడు ప్రభాకరం.

ఆయుర్వేదం డాక్టరూ, అతని భార్యా వచ్చారు. ఆ డాక్టరు చాలా మొద్దులా కనబడుతున్నాడు. అతని భార్యా మాత్రం చురుకైనది.

"నమస్కారంఅండీ" అంది కొంగువిప్పుతూ.

"నమస్కారం... మీ ఇంట్లో ఆడపిల్లలు పోలీసులకి దొరికారు. కేసు వ్రాసి కోర్టుకి కడుతున్నాను"

"ఆవిడ మా పినతల్లికూతురు సార్ ... రాజమండ్రి నుంచి వచ్చింది"

"షావుకారు మీ మేనత్త కొడుకా"

"మీరలా సెలవిస్తే ఎలా? ఏదో ప్రభువులు చూసీ చూడనట్లుపోతే మేం పిల్లాపాపాతో బ్రతుకుతాం. అసలు మా ఇంటివాళ్ళే మా మీద ఇలాంటివి రిపోర్టుఇస్తారు. కన్నన్‌గారికి ఇయన్నీ తెలుసండీ"

"కన్నవ్‌కి ఏం సంబంధం?"

"పోలీసువారిలో పెద్దమనిషి కదండీ ఈయన. ఇలాంటి వారు భూమిమీద ఉండరు. అసలు మాఇంటివాళ్లుయిదంతా చేశారండి"

"ఎవరు మీయింటివాళ్ళు."

"బ్రాహ్మలు... ఆవిడ పుస్తకాలు రాస్తది. అబ్బో బహు గీరండి. వెబిచారం పనికిరాదట. యిల్లు కాలీ చెయ్యాల్లిట... మీకు రిపోరుటు చేసింది... కన్నన్‌గారే భగమంతు డనుకోండి. ఆయన మా పక్సంలేకపోతే డి. యస్పీ. బాబు మమ్మల్ని లేపమనేవాడండి. ఆల్లూ ఆల్లూ ఒకటి గదండీ... అదండీ రహస్యం"అంది ఆడది. ప్రభాకరానికి అర్థం అయింది. అయినా అడిగాడు.

"మీ రెవరు?"

"ఒరియా బ్రాహ్మలమండి"

"మరి డియస్పీబాబూ... మీ యింటివాళ్ళూ ఒకటే నంటా వేం?"

"అంతేనండి... మేం సీమ తింటామండి"ఉత్సాహంగా చెప్పింది ఆడమనిషి ప్రభాకరాన్ని బుట్టలో పెట్టాననే సంతో షంతో.

"అంటే కథ డియస్పీబాబుదాకా వెళ్ళిందా?"

"వెళ్ళిందండి. నిన్న ఇంటివారబ్బాయి మమ్మల్ని ఖాళీ చెయ్యమన్నాడండి. మావారూ ఆ కుర్రాడ్నిమాకొట్టుకొన్నారు.

ఆ సంగతిచూసి కన్నన్‌గారు వీళ్ళందర్నీ లాకప్పులో పెట్టారండి. ఆమె... అదే మా యింటామె డియస్పీ బాబుకి ఫోను చేసి కొడుకుని యిడిపించుకొంది."

ఆ మాట వినగానే ప్రభాకరానికి చెమటలుపోసినయ్. ఈ కేసు మామూలుగా లేదు. "వీరయ్యా కన్నన్ ఉన్నాడా" అన్నాడు.

"ఉన్నాడు సార్ పిలవమంటారా?"

"పిలవ్వయ్యా...కొంచెం అవతలుండమ్మా"అన్నాడు. ఆ ఆడమనిషి మొద్దబ్బాయిలాంటి భర్తను తీసుకుని గర్వంగా అవతలికి వెళ్ళింది. కన్నన్ వచ్చి శాల్యూట్ కొట్టాడు. ప్రభాకరం ఉరుముతూ-

"ఏమిటి పోలీసుల్లో నువ్వొతప్ప పెద్దమనిషి లేడట... డియస్పీగారితో ఏం చెప్పావు? అసలు వారేం ఫోనుచేశారు? చెప్పు"

"ఏంలేదు సార్. ఆ యింటివారబ్బాయి డాక్టరుని కొట్టాడుసార్... అందుకని లాకప్పులో పెట్టాను. డియస్పీ గారు వదిలేయమన్నారు. వదిలేశానండి...ఆపిల్లాడిని."

"అంతాయింతేనా. ఆడాక్టరు తప్పులేదా! వీరయ్యా"

"ఎస్ సార్"

"ఆ కుర్రాడి వయసెంత?"

"పదిహేడేళ్ళుంటాయిసార్. సన్నగా ఉన్నాడు"

"డాక్టరుని కొట్టాడంటావా?"

"డాక్టరుని ఆ పిల్లాడేం కొట్టగలడండి... అసంభవం."

"ఏమయ్యా దొంగకేసు బనాయించావా! నీకులంచాల ఆశేగాని ప్రమోషన్ల ఆశలేదు. మరి మమ్మల్నీ అలాగేఉండ మంటావా! డియస్పీగారు ఏమని ఫోనుచేశారు!"

"అసలు సంగతేమిటి అని అడిగారండి? ఈళ్ళిద్దరూ ఈదిలో కొట్టుకున్నారండి. అదే చెప్పాను. అయినా ఆ కుర్రాడిని ఒదిలివెయ్యమన్నారండి. ఒదిలేశాను" అన్నాడు కన్నన్. అతను గుండెలుతీసినబంటు.

"సరే వెళ్ళు... వీరయ్యా ఏమిటయ్యా అసలుగొడవ" అన్నాడు కన్నన్ వెళ్ళిన తరువాత వీరయ్యనుద్దేశించి.

"ఆ ఆడది మహాకిరోడా సాబ్ - దానికికన్నన్ మద్దతు. ఈలయితేఇంటివారిదే కంపెనీఅని డియస్పీగారిచేత ఒప్పించ గలడు...?

"అది సరేనయ్యా. చిన్నవిషయంలో డియస్పీగారు కల్పించుకొన్నారెందుకు."

"మనవి చేస్తాను. ఈ డాక్టరు ఇంటివార్ని సంసార్లమని చెప్పి మోసగించి ఇంట్లో దిగాడు. అద్దె సరిగా కట్టలేదు సరికదా ఈ కంపెనీ... ఇంటివాళ్ళు రిపోర్టు చేస్తే కన్ననురైడువెళ్ళి కతికి వదిలిపెట్టాడండి. మొన్న ఇంటివాళ్ళకీ యీళ్ళకీ యుద్ధమై పోయిందండి... ఆళ్ళబ్బాయిని కన్నను తెచ్చి లాకప్పులో ఏసినాడండి. ఇంటివాళ్ళు డియస్పీ

గారితో చెప్పారండి. కన్నను అబద్ధం చెప్పాడని గ్రహించిన డియస్పీగారు మరో బెంచ్‌ని రైడుకెళ్లమన్నారండి. అప్పుడు ఈ షావుకోరూ పతివ్రతా చిక్కారండి ... ఇప్పుడు జామీ నివ్వడానికి డాక్టరు, పెళ్ళాం వచ్చారండి..."

"నీ అండీపాడుకాను... యింటివాళ్ళు యీ తడవ యస్పీ దగ్గరకెడితే... ఆ డాక్టరు పెళ్లాంని రమ్మను"

"యస్ సార్"

తక్కుతూ తారుతూ వచ్చిన డాక్టరు పెళ్ళాన్ని చూసి ప్రభాకరం మనసులో ఏమనుకున్నాడోగాని పైకి మాత్రం -

"ఏమమ్మా జామీనూ వగైరాలు కోర్టులో తేల్చుకోండి" అన్నాడు.

"ప్రభువులు. ఆడకూతురు. ఎప్పుడూ జైలు కెళ్ళలేదండి. తమరు ఎప్పుడు హాజరు పర్చమన్నా గాని హాజరు పరుస్తాం. అసలు మొదటి తడవగనక దయచూడండి" అన్నది. ఈమెకు పోలీసులతో అనుభవం, కోర్టులలో అనుభవం కూడా వుంది. న్యాయాన్ని అవసరమైతే కొనేరకం. కాసుకు కన్నన్ని కొనేసింది గనుక పైసాకి ప్రభాకరాన్ని కొందామని ఈమె ఊహ.

"వీరయ్యా! ఆ ఆడమనిషిని హాజరుపెట్టు. నువ్వు అవతలకు వెళ్ళమ్మా" అన్నాడు ప్రభాకరం.

ఆ వచ్చిన మనిషిని చూస్తే సి. ఐ. డి. ఏజంటుకూడా వ్యభిచారిణి అని అనలేడు. అంత పవిత్రంగా స్వచ్ఛంగా ఉంది. ప్రభాకరం ఆశ్చర్యంగా ఆమెవంకచూసి-

"ఏమమ్మా ఏమిటీ ఖర్మ?" అన్నాడు. అతనిలో మానవత్వం పూర్తిగా పోలేదు. పోలీసుతత్వం పూర్తిగా రాలేదు. అందుకే మెల్లిగా అడిగాడు.

"ఇనస్పెక్టరుగారూ - నేనెప్పుడూ చేయలేదండి" అన్నది ఆమె.

"నీ పేరేమిటి?"

"కమల"

"చదువుకున్నట్లున్నావు. ఆ డాక్టరు యింటిలో షావుకారుతో నీవు అసభ్యంగా ప్రవర్తించలేదా?"

"లేదండి"

"మరెందుకొచ్చావు అక్కడికి"

"డబ్బుకోసం రాలేదండి... డబ్బు యివ్వడానికి వచ్చాను."

"అంటే నువ్వే ఎదురిచ్చి షావుకారులాటి సుందరాంగుడిని వలిచావన్నమాట"

"కాదండి"

"మరేమిటమ్మా నీగోల. అది కంపెనీ. అందులో నువ్వు దొరికావు అసలు నీ సంజాయిషీ ఏమిటి?"

"అసలు నేను వ్యభిచారిని కాదండి."

"పతివ్రతనంటావు... మరి ఆ యింట్లోకి ఎందుకు వెళ్ళావు?"

"అమ్మాయి కోసమండి"

"బాగుంది. నువ్వు కూడా అమ్మాయిల్ని సప్లయి చేస్తున్నావా?"

"కాదండి"

"మరి అమ్మాయెందుకు?" చిరాగ్గా అడిగాడు ప్రభాకరం.

"నాకు అమ్మాయే కావాలండి"

"అదే ఎందుకూ అని?" అరిచాడు ప్రభాకరం. ఇంతలో మఫ్టీలో ఉన్న సి. ఐ. డి. యినస్పెక్టరు వచ్చాడు అక్కడికి. అతనూ కూర్చున్నాడు.

"చెప్పమ్మా నీకు అమ్మాయే యెందుకు కావాలి?"

"అది నా అలవాటండీ"

"మిస్టర్ ప్రభాకరం! ఈమె లెస్బియన్ అనుకుంటాను." అన్నాడు సి.ఐ.డి. యినస్పెక్టరు. అదిరిపడ్డాడు ప్రభాకరం.

"మన దేశంలో... విజయవాడలో... మగవాడిలాగా ఆడది కూడా డబ్బిచ్చి హ్యూమన్ ఫ్లెష్‌ని ఖరీదు చేస్తుందన్న మాట. చిత్రంగా వుంది" అన్నాడు యింగ్లీషులో.

"ఆడపిల్లల హాస్టలులో యిది అతి సామాన్యమైనఅల వాటు. నీ పర్మిషనుతో ఆమెను ప్రశ్నిస్తాను."

"విత్ ప్లెజర్" అన్నాడు ప్రభాకరం.

"ఏమమ్మా నీ పేరేమిటన్నావు."

"కమల"

"చదువుకున్నావా"

"చదువుకున్నానండి"

"ఎప్పుడీ అలవాటయింది" మెల్లిగా లాలనగా అడిగాడు సి. ఐ.డి.

"చెపితే వదిలేస్తారా."

"ఇహముందు ఇలాటివి చేయనంటే - వదిలేస్తాం... అసలీ అలవాటు ఎలాఅయింది" తిరిగీ ప్రశ్నించాడు సి. ఐ.డి. ఇన్‌స్పెక్టరు.

"అయ్యా తమరు పోలీసులుకాదు... పెద్దమనుష్యుల్లా కనిపిస్తున్నారు...నాకీ అలవాటు చిన్నప్పటినుంచే ఉండగాడి - అంటే హైస్కూలులో చదివేటప్పటినుంచీ"

"ఏ హైస్కూల్లో చదివావు?"

"ఊళ్ళో హైస్కూల్లోనండి"

"నీవు స్త్రీవై ఉండే స్త్రీనే ఎందుకు కోరుతున్నావు?"

"తెలియదు...నాకు పదిహేనేళ్ళు వచ్చినప్పటినుంచీ అంతే...మొగవాళ్ళు...మీరేమనుకోరు గాని ఆడవాళ్ళు నేనంటే భయపడతారండి"

"ఇందులో...ఆడా...మొగా ... ఏమిటిగానీ ... నీ మనిషిగా భావించిచెప్పు" అన్నాడు సి. ఐ. డి. ఇనస్పెక్టరు.

"ఆడవాళ్ళు నామీద తిరగబడతారండీ ... నాతో దూరంగా ఉండాలనే ప్రయత్నిస్తారు... వాళ్ళతో చాలా విసిగిపోయి ప్రేమించటం మానేసి డబ్బెట్టి కొనుక్కుందామని వీళ్ళ ఇంటికి వచ్చానండి. అంతేగాని షావుకారుతో నేనే పాపమూ చెయ్యలేదండి...నాకు విసుగుకూడా. ఈ స్త్రీ పురుష సంబంధాలంటే"

"అలాగే పాపం"

"నేను హైస్కూలులో చదువుతున్నప్పుడు...మొగ పిల్లలతోనే స్నేహంగా ఉండేదాన్ని. నాతో కలిసి మా క్లాసులో పదిమంది ఆడపిల్లలు ఉండేవాళ్ళు. అందరం ముందు బెంచీలమీద కూర్చునేవాళ్ళం. ఎక్కువకాలం కబుర్లే చెప్పుకునేవాళ్ళం - మొగపిల్లలు మా వాగుడు భరించలేక మాస్టారికి రిపోర్టు చేసేవాళ్లు...మాస్టారులేనప్పుడు బూతులు తిట్టేవాళ్ళు...అందరిలోకీ నేను చిన్నదాన్ని అవ్వటంవల్ల మొగపిల్లల ప్రేమలేఖలు నాద్వారా ఆడపిల్లలకి చేరుతూ ఉండేవి. ఆ ఉత్తరాలు మొదట నేనే చదివి ఆ మొగపిల్లల వర్ణనల్ని ఊహించుకొని - ఆయా ఆడపిల్లల్ని అనుభవిం

చాలనే కోరుకునేదాన్ని మనసులో ... ఆడవాళ్ళ విష యంలో...తరువాత తరువాత...నేను ఆడపిల్లల్ని ప్రేమిం చాను. దానికి కారణం దూరంగా ఉండే ఆడపిల్లలూ-మొగపిల్లల వర్ణనలూ.

"పాపం"

"నాతో రాధ అనే అమ్మాయి చదివేది. క్లాసుకోసం మాఇంట్లో ఇద్దరం తలుపులు వేసుకొని...చదివేవాళ్ళం... అలా పదమూడేళ్ళకే అలవాటు పడ్డాం"

"రాధ ఏమయింది ?"

"దుర్మార్గురాలు పెళ్ళిచేసుకొని నా హృదయాన్ని గాయపరచింది...ఆ తరువాత సుబ్బలు...అదీ అంతే... ఇహ ప్రేమించటం మానేసి...డబ్బొచ్చి అనుభవిద్దామని వచ్చాను"

"ప్రభాకరం! ఆమె చెప్పింది నిజమే...మనదేశంలో అతి స్నేహంగా ఉండే విద్యార్థులమధ్య ఉండేది ఉత్త స్నేహమేకాదని మన సత్వవేత్తల అభిప్రాయం...ఇహ నేను పోతున్నాను" అని లేచి వెళ్ళిపోయాడు సి. ఐ. డి ఇన్స్పె క్టరు. ప్రభాకరం-

"వీరయ్యా! ఆ డాక్టరు అతనిభార్యా జామీనిస్తే ఈమెను పంపించివేయి" అన్నాడు. ఆమె మొహంచూడా లంటే భయం పట్టుకుంది. దేశం ఏమైపోతుంది. పెట్టుబడి దారులు అమెరికాకి దగ్గరవుతోందనవచ్చును. పెకింగ్

రేడియో తిప్పితే భారతదేశంలో ప్రజావిప్లవం నియంతృత్వాం అధికంగా ఉందని వినరావచ్చును...ఈరెండూ అబద్ధాలే... కాని జరుగుతుందేమిటి ? ప్రభాకరానికి విసుగొచ్చింది.

"వీరయ్యా"

"సార్"

"పతివ్రత వెళ్ళిపోయిందా ?"

"వెళ్ళింది సార్"

"పతే లేంది...పతివ్రిత ఏమిటిగాని...ఇంతకూ ఆమె దీవ్రారేనా ?"

"అవునండి...వన్ టౌన్‌లో ఇల్లుందండి ... ప్రతాది వారం భజనలుచేస్తారు ఆడంగులుచేరి ఆ ఇంట్లో...ఆళ్ళిచ్చే దక్షిణలూ వాటితో ఈయమ్మపొట్ట వెల్లిపోగా ఇంకా మిగులుతుందండి. ఆమెనుచూస్తే అందరూ పతివ్రితా భక్తురాలూ అనుకుంటారు. ఈ డాక్టరుగాడి కొంపలో పట్టు బడకపోతే...పోలీసుల అభిప్రాయమూ అంతే"

"ఆమె మొగవాళ్ళని...ముట్టుకోదు"

"మరి పూజిస్తాదా ? మరి కంపెనీ కెందుకొచ్చినాది?"

"ఆడపిల్లలు కోసం"

"అంట్లోసాయంగా కంపెనీ నడపటానికి ట్రైనింగు అవుద్ది కాబోలు"

"అంతేలే" అన్నాడు ప్రభాకరం ఆలోచనగా. వెస్టి యన్స్ అడపాదడపా మొగవాళ్ళతో సంబంధాలు కూడా ఏర్పరుచుకుంటారు. హైదారాబాద్‌లో ఇలాటివి ఇంకా అధికమేమో? విజయవాడలోనే ఉన్నప్పుడు...హైదారాబాద్ కర్మ ఏం కాలింది? అలాటిదే అయిఉండాలి. నిర్ణయించుకొన్నాడు ప్రభాకరం.

## 5

సీతమ్మగారు గుళ్ళోకి పోయి వస్తుంటే పక్కింటి డాక్టరు భార్య ఎక్కిరింపుగా చూస్తూ "ఏమండోయ్, మీ కోడలు కాఫీ పొడుం అప్పు తీసుకెళ్ళి ఆరు రోజులయింది. మర్చిపోయింది కాబోలు. వెంటనే పంపిస్తారా - మా ఇంట్లో అయిపోయింది" అన్నది.

సీతమ్మగారికి కోపం వచ్చినా ఆపుకుని "అలాగే... ఇప్పుడే పంపిస్తాను" అని గబగబా ఇంటికి వచ్చి సరోజిన్ని పిలిచి-

"డాక్టరు పెళ్ళాం దగ్గర కాఫీ పొడుం అప్పు తీసుకున్న దానిని వెంటనే తీర్చవద్దూ? ఇలా అప్పులు చేసే అవసరం ఏం వచ్చింది? అసలెందుకు తీసుకున్నావు?" అన్నది మండిపడుతూ.

"మొన్ననే తీర్చాను...మీతో ఎలా చెప్పిందీ... మీ రెట్లా నమ్మారు?"

"నమ్మటం నమ్మక పోవటం తరువాత...ముందు అప్పు తీర్చిరా"

"తీర్చాను...వాళ్ళ పనిపిల్ల కూడా వుంది...ఇలా అయితే అయినట్లే" అంది సరోజిని.

డాక్టరు భార్య ఇవ్వలేదంటుంది. సరోజిని ఇచ్చానంటుంది. ఎవర్ని నమ్మాలో సీతమ్మగారికి అర్థం కాలేదు- కోడలు నిజాయితీ మీదా డాక్టరు భార్య నిజాయితీ మీదా కూడా ఆమెకు నమ్మకం లేదు. నిజానిజాలు ఆ పరమేశ్వరుడికే తెలియాలి.

"ఈ పోట్లాట దేనికి - ఆ కాఫీ పొడుం ఇచ్చి...నువ్వ ఎప్పుడూ అప్పుతీసుకోకు" అంది సీతమ్మగారు.

"బాగుంది తప్పంతా నాదే అయినట్లు ఏమిటిగోల ?!" అని లోపలికి వెళ్ళిపోయింది సరోజిని...సీతమ్మగారే కాఫీ పొడుం అప్పు తీర్చివేసింది. - సీతమ్మగారికి సరోజిని అంటే నచ్చని చాలా విషయాల్లో ఇంట్లో చెప్పులేసుకుని తిరగటం ఒకటి. అసలే కొంప అశుభ్రంగా ఉంచటంతో పాటు... చెప్పులతో నడవడం, మొహం కడుక్కోకుండా కాఫీ తాగటం...రజస్వల అయినప్పుడు స్నానం చెయ్యక పోవడం, కనీసం తెలియనియ్యకుండా జాగ్రత్త పడలేక పోవడం, ఆ పాడుచీరతో మగవాళ్ళెదురుగా తిరగటం వగైరాలు చాలా ఉన్నాయి.

(9)

"దూరంగా కూర్చుంటే మాత్రం మగవాళ్ళకి తెలియదా ?" అనేది సరోజిని.

"తెలుసు...మగవాడికి తెలియనిది స్త్రీ దగ్గరా, స్త్రీకి తెలియనిది మగవాడి దగ్గరా ఏమీ ఉండదు. అందుకని ఇంత అసహ్యంగా ప్రవర్తించ నవసరంలేదు" అంది సీతమ్మగారు.

"అందుకే నాకు స్త్రీ పురుషులంటే అసహ్యం" అని గదిలోకి గిరుక్కున వెళ్ళింది సరోజిని.

కోడలు వచ్చిన తరువాత కొంపలో ఏది ఎట్లా ఉంటుందో ? ఎక్కడుంటుందో...కాల స్థల నిర్ణయాలు లేకుండా పోయినయ్. ఇవాళ్ళ ఇక్కడున్నవస్తువు రేపు ఎక్కడుంటుందో వెదకాలి. దేముడి గదితప్ప సరోజిని తిరగని చోటు లేదు కొంపలో...వంటింట్లోకూడా ఏదో మాయమవుతూనే ఉంటుంది.

వెంకట్రామయ్యగారి చెప్పులు...రోజూ కనపడవు... సీతా సీతా అనే కేకలు రోజూ ఉంటాయి...మాసిన చీరలు ఇస్త్రీ పెట్టెలో వెయ్యదు సరోజిని. ఉండచుట్టి బాత్ రూమ్‌లో పెడుతుంది. ఎంతకొత్త చీరయినా ఎలుకలు కొడతాయి. కొబ్బరినూనె సీసా ఎక్కడుంటుందో దైవానికి తెలియాలి.

సీతమ్మగారు చాలా శుభ్రస్తురాలు...కోడలు బస్తీ చదువులు చదివిందని తృప్తి పడింది...కాని ఒకరోజు రామారావు గదిలోకి చూసి ఖంగారుపడింది. అది కొత్తదంప

తుల్ల శృంగార మందిరముగా లేదు...రెండు పిశాచాలు కాపురంచేస్తున్న గుహలా ఉంది.

"ఆ పెట్టెలన్నీ వరసగా పెట్టి కాస్త దుప్పటి ఇస్త్రీది వేసుకోకూడదూ ?" అంది. సరోజిని మాట్లాడలేదు.

"వాడి పాంటులన్నీ అలా కిటికీ రెక్కలమీద వేస్తే... కర్రతో ఎవరయినా లాగనచ్చు...వాటిని మడతవేసి బీరువాలో పెట్టుకో" అని కోడలు సమాధానానికి ఎదురు చూడకుండా... అక్కడినుంచి వెళ్ళి పోయింది... రామారావు స్వతహా చాలా శుభ్రస్తుడు...తల్లి శుభ్రం అతనికి చాలేది కాదు. బూట్లూ...బట్టలూ చాలా నీట్ గా ఉంచుకునేవాడు. అలాటివాడు యింత దరిద్రపు గదిలో ఎలాపడుకుంటున్నాడో! కోడలు యిన్నాళ్ళుగా తను పెంచిన పిల్లన్నీ తను ఉంచిన ఇంటినీ ఇంకా అందంగా మారుస్తుందనుకుంది గానీ...ఈ విధంగా తన కొడుకుని అశుభ్రస్తుడిగా - నీరసుడిగా చేస్తుందనుకోలేదు.

వెంకట్రామయ్యగారి గది విశాలంగా ఇంగ్లీషు తెలుగు పుస్తకాలతో నీటుగా ఉంటుంది. ప్రభాకరంగదిలో—టేబుల్ ఫ్యానూ, ఫోనూ, రేడియో...ఇంకా ఏవేవో ఫైల్సూ ఉంటాయి. ఈ రెండు గదులూ దగ్గరుండి అప్పలమ్మ చేత ఊడిపించి సర్దుతుంది సీతమ్మగారు. ఆవిడ మంచంకూడా వెంకట్రామయ్యగారి గదిలోనే ఉంటుంది. ప్రభాకరానికి పెళ్ళి సంబంధాలొస్తున్నాయి...రామారావు గదీ జీవితం ఏదో అల్లకల్లోలంగా ఉంది అనిపించింది ఆ తల్లికి. ఏంచెయ్యాలో

తోచలేదు. ఆ సాయంత్రం రామారావు ప్రాణం లేచొచ్చినట్లుగా వచ్చి తండ్రి మంచంమీద పడుకున్నాడు. వెంకట్రామయ్యగారు ఇంకా ఇంటికి రాలేదు.

"ఏమిట్రా నాయనా" అంది సీతమ్మగారు.

"ఆ గదికన్నా నాన్నగారి గది బాగుందమ్మా-ఇక్కడే పడుకుంటాను...నాకు హాయిగా ఉంది" అన్నాడు.

"మరి నాన్నగారెక్కడ పడుకుంటారు ?"

"చంపకమ్మా...నన్ను నిద్రపోనీ..." అని ఒత్తిగిలి పడుకుని వెంటనే నిద్రపోయినాడు రామారావు - సీతమ్మగారి మనసు చివుక్కుమంది. రామారావు ఆ పక్కమీదే పెరిగి పెద్దవాడయ్యాడు. ఇప్పుడూ ఆ పక్కమీదే నిద్రపోను న్నాడు. తప్పేమిటి? తిరిగి తిరిగి వచ్చిన బాటసారి ఇంట్లో చేరినట్లు తండ్రి పక్కమీద సుఖంగా పడుకున్నాడు. తల్లిదండ్రుల గదికన్న సురక్షితమైన ప్రదేశం మరి ఎక్కడుంటుంది ?

వెంకట్రామయ్యగారు వచ్చి...తల్లీ కొడుకుల్ని చూసి "ఏమిటి? పెద్దవాడు ఇక్కడ పడుకున్నాడు ?" అన్నారు.

"వాడికిక్కడే బాగుందట"

"ఏమిటీ...యవ్వనంలో...తనగదికన్న తల్లిదండ్రుల గది బాగుండటమా ! చిత్రంగా ఉందే ?"

"ఆ గది చూస్తే మీరట్లాగనరు"

"ఏమి? అంత అసహ్యంగా ఉందా?"

"అంతకంటె అసహ్యంగా ఉంది. అగరొత్తుల వాసన లేదు. ఇస్త్రీ దుప్పటిలేదు. నా కొడుకు గొంతుక కోశారు పాడుసంబంధం చేసి"

"ఊరుకోసీతా! వాడు లేస్తాడు. వింటే బాగుండదు"

"లేచేట్లు ఉంది వరస...ఆ నిద్దర చూడండి - మత్తు మందు మింగినట్లు"అంది సీతమ్మగారు. వెంకట్రామయ్యగారు ఉలిక్కిపడి కొడుకు వంక చూశారు. నిజమే...చీమ చిటుక్కు మంటే లేచే రామారావు మొద్దులా నిద్ర పోతున్నాడు... తన ఎదుట ఎప్పుడూ అలా పడుకోలేదు.

"పిడికేమయింది?"

"అది తెలిస్తే లేనిదేముంది? పదండి వడ్డిస్తాను" అంది సీతమ్మగారు. వెంకట్రామయ్యగారు రిటైర్డ్ పోలీసాఫీసరు. అనుమానం వస్తే తేల్చుకోనిదే ఆయనకు తోచదు. కొడుకు దగ్గరికి వెళ్ళి నుదుటిమీద చెయ్యి వేశారు...చల్లగా ఉంది.

"ప్రాణం ఉంది ఫరవాలేదు"

"అదేమిటి?" ఆదుర్దాగా అడిగింది.

"ఏదో మత్తు మందు..."

"తాగాడా?"

"లేదు"

"అయితే మత్తుమందేమిటి ?"

"ఏమో నాకూ తెలియటంలేదు. ఈ రాత్రి నేను మేలుకునే ఉంటాను. ప్రభాకరం వచ్చాడా ?"

"రాలేదు" అంది భయంగా సీతమ్మగారు.

"భయం దేనికి...బీరువాలో పిస్టలుతియ్యి...ఈపూట భోజనం వద్దులే. కాసిని పాలు ఇయ్యి. ఆ భగవద్గీత అలా అందుకో" అన్నాడు ఆయన క్షణంలో పోలీసు ఉద్యోగిగా మారిపోయి. అవి ఆజ్ఞలే. ఆసంగతి తెలిసిన సీతమ్మగారు వెంటనే ఆపన్లుచేసింది...కొడుక్కి ఎవరు మత్తుమందు పెట్టారు? ఏంజరిగింది? ఈ ప్రశ్నలకి భర్త సమాధానం ఇవ్వడని ఆవిడకి తెలుసు...ప్రభాకరం వచ్చినట్లు అలికిడి అయితే సావిట్లోకి వెళ్ళింది ఆవిడ. సరోజినిగది మూసేఉంది...మత్తుమందు బైటనే పెట్టారా ? ఆవిడకేమీ అర్థంకాలేదు.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు" తన వెంటనే గదిలోకి వచ్చిన తల్లిని పరీక్షగాచూస్తూ అడిగాడు ప్రభాకరం.

"ఏంలేదు...భోజనానికి రా"

"దానికి నువ్వు ప్రత్యేకం పిలవాలా ఏమిటి ? వస్తూనే ఉంటినిగా. అసలు అలా ఉన్నావేం ?"

"ఏమీలేదు"

"అయితే ఏదో ఉన్నదన్నమాట. వదిన ఏమయినా ందా ? ఊరుకుంటే సరిపోతుంది. ఏంచేస్తాం ?" అన్నాడు.

"నీసలహా అవసరం [illegible] నాన్నగారి గదిలోకి వెళ్ళు" అని మెల్లిగా చెప్పింది సీతమ్మగారు. ప్రభాకరం వెడుతూ సరోజినిగది తలుపులవంక చూశాడు. అవి మూసుకునే ఉన్నాయి.

"నాన్నగారూ... అన్నయ్య ఇక్కడ పడుకున్నాడేం ?" అన్నాడు ఆశ్చర్యంగా రామారావుని పరికిస్తూ ప్రభాకరం.

"ప్రభాకరం"

"ఏం నాన్నగారూ ?"

"సి అన్న ఏదో వలయంలో చిక్కిసట్లు తోస్తోంది. లచెకుండా అమానుషమైంది"

"అంటే?"

"నాడి పెదవులు అడివి మూలికల వాసన వేస్తున్నాయి. వాడికి ఇచ్చిన మత్తుమందు...భద్రాచలం అడవుల్లో కోయవాళ్లు పులుల్ని వాటినీ చంపటానికి...చచ్చిన గొడ్డుశరీరంలో పెట్టేది. అదితిన్నపులి నాలుగురోజులు పిచ్చిగా తిరిగి చివరకు చనిపోతుంది. నాకు తెలిసినంతవరకూ దానికి విరుగుడు కర్పూరం"

"నాన్నగారూ ?"

"అవును...వాడంటే ఎవరికి కోపం ? ఎవరీపాడుపని చేసింది" గొంతుక జీరపోయింది ఆయనకి.

"ఇప్పుడేం చేయమంటారు ?" దిగులుగా అడిగాడు ప్రభాకరం.

"మీావదిన గదిలోకి రహస్యంగా చూడు"

"అలాగే" అని అక్కడినుంచి వెళ్ళిపోయినాడు అతను. ఆ గది కిటికీ పెరట్లోకిఉంది. మెల్లిగా అక్కడకెళ్ళి తొంగి చూశాడు. సరోజిని నిద్రపోతోంది...అరగంట జాగ్రత్తగా పరిశీలించి అది నిద్రఅని ఋజువుచేసుకొని తండ్రిదగ్గరకొచ్చి-

"నిద్రపోతోంది" అన్నాడు మెల్లిగా.

"నిద్రపోతుంది. ఇది అమానుషం అయిన కేసు" అన్నాడు ఆలోచనగా వెంకట్రామయ్యగారు.

"అంటే..." భయంగా అడిగింది సీతమ్మగారు.

"భయంలేదు సీతా! పోలీసులు దొంగల్తోనేకాదు... కనిపించనివాటితో కూడా పోట్లాడాలి".

"నాన్నగారూ..."

"అవునునాయనా... హేతువాదులు ఇవన్నీ నమ్మరు. దేముడితోపాటు ఏవీ లేవంటారు. నిజమే, నేనూ అలాగే అనుకునే వాడినికాని అనుభవంతో అవి నిజంగానే ఉన్నాయని తెల్సుకున్నాను...నాయనా! శరీరం వదిలిన ఆత్మ సుమారు రెండు అవున్సుల బరువుంటుంది. భాస్వరంవల్ల వెలుగ్గా ఉంటుంది- కోరిన రూపాల్లోకి మారుతుంది. మనుషుల్లోలాగానే ఆత్మల్లోకూడా మంచివీ చెడ్డవీ ఉంటాయి. దెయ్యాలు పట్టడం గురించి విన్నావుగదా! మనిషిఆత్మ బలహీనంగా ఉన్నప్పుడు... ఉన్మాదావస్థలోనూ, నిద్రావస్థ

లోనూ ఆ దుష్టాత్మలు ఆవేశిస్తాయి. ఈ రాత్రి ఏదో ఆత్మ సాక్షాత్కారం మనకి అవుతుందనుకుంటాను."

తండ్రి మాటలకు ఒళ్ళు ఝల్లుమంది ప్రభాకరానికి. పదిమంది గూండాల్ని ఎదుర్కునే తనకు... రెండు అవున్నల ఆత్మ అంటే భయం దేనికి ? కాని ఎలా ఎదుర్కోవాలి? పద్ధతి ఏమిటి? పోలీసు ట్రైనింగులో దెయ్యాలతో ఎలా పోట్లాడాలో చెప్పలేదు.

"నాన్నగారూ - ఏం చెయ్యాలి ?"

"నాయనా, ఆ దైవంమీద భారం వేద్దాం. నేను నిజామాబాద్‌లో పనిచేస్తుండగా ఇలాటి కేసులు చూశాను. నైజాంరాజ్యంలో వీటికి శిక్షలుండేవి. ప్రజాస్వామ్య హేతువాదులు వీటిని నమ్మరు. అందుచేత శిక్షలు లేవు. అందుకని ఈ పిశాచాల ప్రయోక్తలు పట్టుబడటంలేదు. గాలిలో తిరిగే ఆత్మల్ని పిలిచి స్వప్రయోజనానికి వినియోగించుకుంటారు వీళ్ళు...ఇదంతా అబద్ధం అని డాక్టర్లూ పోలీసులూ కొట్టివేస్తారు. కాని నేను స్వయంగా చూశాను. ముందు త్వరగా డాక్టరుని తీసుకురా" అన్నాడు వెంకటాద్రియ్య గారు.

ప్రభాకరం పదినిముషాల్లో డాక్టరుని తీసుకువచ్చాడు అప్పటికీ సరోజిని గది మూసే వుంది. మెల్లిగా బయట గొళ్ళెం పెట్టింది సీతమ్మగారు. డాక్టరు అరగంట పరీక్షచేసి-

"మత్తుమందండీ" అన్నాడు.

"అవును...అది తెలుస్తూనే ఉంది...విరుగుడు ఉందా?"

"లేదు...ప్రమాదంకూడా లేదనుకుంటాను. నిద్ర పోనివ్వండి అదే, మంచిపని" అని వచ్చినట్లే వెళ్ళిపోయాడు డాక్టరు. తండ్రి కొడుకులు తల్లివంక చూశారు. ఆమె సహజంగా ధైర్యస్తురాలయినా ఇందాకటినుంచీ ఖంగారు పడుతోంది. ఇప్పుడు ఆ ఖంగారు తగ్గి నిట్టూర్చింది ఆవిడ.

"అమ్మా అన్నయ్యకి భయంలేదు" అన్నాడు ప్రభాకరం. ఆ మాట తల్లికేగాదు తనకీ వర్తిస్తుంది...ఒక విధంగా తనకి తనే ధైర్యం చెప్పుకున్నాడు ప్రభాకరం. రామారావు స్పోర్ట్సులో డిబేటులో ప్రైజులు తెచ్చుకుని తల్లి తండ్రులకి గర్వ కారణం అయినాడు. అందంగా చలాకీగా తిరిగి కన్యలకు మనసయిన వాడు. పేటంతటకీ పెద్దబాబు అని తలలో నాలికయినవాడు.

అతనికి మత్తుమందు పెట్టింది ఎవరు? వదినా? అందుకేనా? నాన్నగారు ఆమెను అనుమానించింది?

"నాన్నగారూ...ఎవరు మత్తుమందు ఇచ్చారు?"

"ఆలోచిద్దాం. సీతా! సాయంత్రం ఇంటికివచ్చిన తరువాత వీడు మళ్ళీ బైటకి వెళ్ళాడా?"

"లేదు...స్నానంచేశాడు...సరోజిని కాఫీ తీసుకు వెళ్ళటం చూసు...నాలుగు నిమిషాల్లో ఎవరో తోస్తున్నట్లు ఈ గది

తోకివచ్చి ఈ గదే బాగుందంటూ నిద్రపోయినాడు" అన్నది సీతమ్మగారు.

"విన్నావుగా. అవకాశం ఆమెకీ మీ అమ్మకీ ఉంది. ఆలోచించు" అన్నారు వెంకట్రామయ్యగారు ప్రభాకరానికి ట్రైనింగు ఇస్తున్న ధోరణిలో. "సరేనాన్నా...అవకాశం వుంది...అవసరం ఏమిటి ? పైగా అమానుష శక్తుల్ని ఆహ్వానించే శక్తి ఒదినకి ఉందా ?" అన్నాడు ప్రభాకరం.

"అదే ముఖ్యమైన ప్రశ్న. అన్నయ్య పెళ్ళిలో హైద్రాబాదులో ఒక ఖొజ్జాలగుంపు విందుకొచ్చింది చూశావుగా"

"అవును...హైద్రాబాద్‌లో వాళ్ళు రావటం ఆచారం అన్నారుగా."

"ఆచారమే. పురిటికీ పెళ్ళికీ వచ్చి కానుకలు దండుకుంటూ ఉంటారు ... వారిలో నాయక్ చాలా క్షుద్ర మంత్రాలు ప్రయోగిస్తాడని అందరూ అన్నారు"

"అయితే..."

"మీ వదిన ఆ నాయక్‌ని కన్నవాళ్ళకంటే గౌరవించడం విడ్డూరంగా లేదా? వాళ్ళ ఇంటికి వెళ్ళి సెలవు తీసుకోట. విడ్డూరంగా లేదా ? మగతా వాళ్ళు ఖొజ్జాలతో అంతక్లోజ్‌గా ఉండరు. వాళ్ళది వాళ్ళకి పారేసి తొందరగా వదిలించుకుంటారు. దీన్నిబట్టి క్షుద్రమంత్రాల్లో, ప్రక్రియల్లో ఈమెకి అనుభవం ఉండాలి. ఇన్నాళ్ళూ నేను పట్టించుకోలేదు. పులులకి పెట్టే

ఈ మత్తుమందు రామారావుకి పెట్టే అవకాశం ఆమెకే వుంది.' కారణం రామాన్ని నిద్రబుచ్చి... ఏ బాణావతినో ఆహ్వానించి ఉండవచ్చును. అంటే ఈ రాత్రి ఏదో పిశాచం అన్నయ్య శరీరంలో ప్రవేశిస్తుందన్నమాట''

"ఎలా నాన్నగారూ ?"

"సీతా...నీ పూజకుంకుమా పూలూ వాడిపక్కన పెట్టు...తరువాత రాత్రి పన్నెండింటినుంచీ మూడువరకూ మనం మేలుకుని ఉందాము'' అన్నాడు వెంకట్రామయ్య గారు. సీతమ్మగారు అలాగే చేసింది.

"పన్నెండుకీ పదినిముషాలు ఉంది. అందరి గుండెలూ కొట్టుకుంటున్నాయి. నిశ్శబ్దంలో గడియారం చప్పుడు మద్దెల దరువులా - గుండెల చప్పుడులా...భయంకరంగా ఉంది.

"ఒకటి... రెండు...గడియారం పన్నెండు గంటలు కొట్టింది...అప్రయత్నంగా తండ్రీకొడుకులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. పదినిమిషాలు గడిచినయ్. ఊపిరి పీలుస్తున్న చప్పుడు వినిపిస్తోంది. అంత నిశ్శబ్దంగా ఉంది.

చరుగ్రమని వెలుగు రూళ్ళకర్ర కిటికీలోంచి వచ్చి రామారావు మంచంచుట్టూ తిరిగి...వెంకట్రామయ్యగారి ఎదురుగ్గా నిలబడింది...ప్రభాకరం చిత్రంగా చూస్తూన్నాడు. సీతమ్మగారు లోపల భగవన్నామస్మరణ చేసుకుంటోంది.

"ఎవరు నువ్వు ?'' వెంకట్రామయ్యగారు అడిగారు.

సమాధానం లేదు.

"సమాధానం చెప్పలేవా ?"

"టక్"

"శబ్దాలు చేయుగలవా ?"

"టక్"

"అయితే అవునంటే ఒకటీ ... కాదంటే రెండూ శబ్దాలుచేయి"

"టక్"

"నీవు ఆత్మవా ?"

"టక్"

"నీయింతటకి నీవే వచ్చావా ?"

"టక్...టక్"

"ఎవరైనా పిలిచారా ?"

"టక్"

"అయినా నువ్వు చేస్తున్నది తప్పుగదా"

"ట...క్..."

"మా అబ్బాయి శరీరంలో ప్రవేశిద్దామని వచ్చావా ?"

"టక్"

"నీ ఉద్దేశ్యం ఏమిటి?"

"టక్ - టక్"

"అంటే ఉద్దేశ్యం లేదనా?"

"టక్"

"ఆత్మలున్నప్పుడు... దైవంకూడా ఉంటాడుగదా....
ది దైవధిక్కారణకదా"

"టక్"

"మరి ఇదేంపని?"

"టక్...టక్"

"మావాడి శరీరంలో ప్రవేశించలేకపోతే ఏంచేస్తావు?"

ఆకూశ్ప కర్ర ఎగిరి కిటికీలోంచి దూసుకుపోయింది...
ప్రభాకరం ఆశ్చర్యంలోనుంచి తేరుకోలేదు.

"కోడి కూసేలోపల మళ్ళీరావచ్చు...ఎవరూ నిద్ర
పోవద్దు" అన్నారు వెంకట్రామయ్యగారు.

"చాలా ఆశ్చర్యంగాఉంది నాన్నగారూ?" అన్నాడు
ప్రభాకరం.

"ఇందులో ఆశ్చర్యంలేదు. ఇది శాస్త్రీయంగా ఋజు
వైన విషయం. అనేకమంది శాస్త్రజ్ఞులు ఆత్మల ఫోటోలు
తీశారు. దాని బరువు రెండు ఔన్సులు ఉంటుందని తేల్చారు.
ఈ ఆత్మలకి మనిషిలా బ్రతకాలని...కోరిక జాస్తీ...అందుకే

ఆ కోరిక ననుసరించే క్షుద్రవిద్యలవాళ్ళు వీటిని ఆకర్షిస్తారు. ఒకప్పుడు అవే మనిషిని ఆవహిస్తాయి. దీన్నే దయ్యం పట్టడం అంటారు. తరువాత దైవంఅంటే వీటికి భయం. దానికి కారణం తమకన్న దైవం శక్తివంతుడనే వాటి నమ్మకం కావచ్చును. లేదా ఆదైవం ఉనికిని...తమ అను సమానమైన ఆత్మలద్వారా అవి గ్రహించి ఉండవచ్చును. ఏదిఏమయినా దైవనామం- దైవనిర్మాల్యం - దేవాలయం - అంటే వీటికి భయం. ఆ ప్రాంతాల్లో ఉండవు. అందుకే భారతదేశంలో- ఈదెయ్యం వదలగొట్టే పద్ధతి దైవారాధనే. ఈ రెండు అవున్నల ఆత్మని సీసాలోకి ఎక్కించి భూస్థాపన చెయ్యటం ఉంది. నిజాం రాజ్యంలో ఈ సంచారాన్న తెలిపే పనిచేయడం చుకునే క్షుద్రవిద్య ఉంది. దాన్ని శౌకానిలా అంటారు. ఇప్పుడు హేతువాదం పెరిగిపోతున్నాది. ఎవరూ నమ్మటం లేదు. పూర్వంలా వినిపించేటన్ని దెయ్యంకేసులు ఇప్పుడు కన పించటంలేదు. దానికి కారణం భయంవల్ల ఇంద్రియాలు బలహీనమైతేనే దెయ్యంపడుతుంది. ఇప్పుడాభయం లేదనే చెప్పాలి. శాస్త్రీయంగా ఆత్మ ఉన్నదని చెప్పిన శాస్త్రజ్ఞులుకూడా - దాని రెండు అవున్నలబలంతో అది మనిషిని ఏం చేయలేదని నిర్ధారణచేశారు. హిందువుల ఆచారం ప్రకారం తగులబెడితే ఆ రెండు అవున్నల ఆత్మా ఉండదు. కాని గర్భిణీస్త్రీలనీ...బాలింతవాళ్ళనీ...పిల్లల్ని పాతిపెడతారు మనలో...మిగతాకులాల్లో అందరూ పాతిపెడతారు. అగ్నిపూజకులైన పార్శీలు అసలు శవాల్ని కాకులకీ గద్దలకూ వేస్తారు. ఆత్మ శరీరంనుంచి మరణానంతరం వేరై ఆ శరీరాన్ని చూస్తూఉంటుంది. ఆ ప్రకారం తగలబడిపోయే

శరీరంలోంచి ఆత్మ బయటకి రాకముందే సూర్యాస్తమానం కాకముందే తగలవేయటం మన ఆచారం. పాతిపెట్టిన శరీరం శిథిలమైనా ఆత్మ శరీరంమీంది మమతచేత, ఆచుట్టు పక్లె తిరుగుతుంది. పార్శీల ప్రకారం తన శరీరానికి పట్టిన గతి చూసి విరక్తిచెంది వెళ్ళిపోతుందంటారు. కాని నేను హైదరాబాద్‌లో పనిచేస్తున్నప్పుడు ఒకదయ్యాలపోతునిపట్టుకున్నాం. వాడిని అడిగితే... దెయ్యాల్లో ఎక్కువ పాతిబెట్టినవాళ్ళేనని తేల్చాడు. పార్శీలు వృద్ధులయితే ఫరవాలేదుగాని ముప్పయి ఏళ్ళలోపు వాళ్ళు చస్తే... మానవ ప్రపంచంమీంద కక్షతో తప్పకుండా దెయ్యాలవుతారన్నాడు... వాడిదాకా ఎందుకు? రవీంద్రనాధఠాగూర్ క్షుదిత పాషాణ్‌లో ఈ ఆత్మల్ని గురించి వ్రాశాడు. ఆయన మూర్ఖుడు కాదు. శరత్ చంద్రుడు ఆత్మ ఉందని అనకపోయినా స్మశానంలో రాత్రిని వర్ణిస్తుంటే మనగుండె దడదడలాడుతుంది. ఆయనమెడమీంద ఎవరో నిట్టూర్పు విడిచారన్నది అసత్యం కాదు. మాట్లాడలేని ఆత్మ అంతకంటేఏమీ చెయ్యలేదు.మనుషుల్లోలాగానే దుష్టాత్మలూ ఉంటయి. వాటికి చిలిపి పనులు జాస్తీ...ఆ జ్యోతిశ్శరీరాన్ని రకరకాలుగా మారుస్తాయి. ఎదటివాళ్ళని భయపెడతాయి. సూర్యుడి వెలుగులో వీటివెలుగు కలిసిపోతుంది. అందుకని పగలు కనిపించవు. ఇదీ ఆత్మలకథ''అన్నారు వెంకట్రామయ్య గారు.

"నాన్నగారూ, ఈ ఆత్మ అన్నయ్య దగ్గరికి- ఎందుకు వచ్చింది ?''

ఆ ప్రశ్నకి ఆత్మే సమాధానం చెప్పింది ఎవరో పిలిస్తే వచ్చానని.

"ఎవరు పిలిచి ఉంటారు ?" సాలోచనగా అన్నాడు ప్రభాకరం.

"దానికి పరిశోధన కావాలి...పోలీసులకి అదీ అవసరమే" అన్నాడు వెంకట్రామయ్యగారు. ఇంతలో కోడి కూసింది.

# 6

సరోజినికి మామగారి చూపులూ - మరిది చూపులూ గిట్టవు. మామగారు మరీను. కోడల్ని చూసినట్టు చూడడు. దొంగనీ హంతకురాల్నీ చూసినట్లు చూస్తాడు - సరోజిని దృష్టిలో ఆయనను గౌరవించాలని లేదు. పెద్దవాడు యజమాని అనే భావం అసలు లేదు. కాని ఆయన ఎదుట తిరగాలంటే ఎందుకో భయంగా ఉంటోంది. వెంకట్రామయ్యగారిలో పోలీసుతనం క్షణం క్షణం కనిపిస్తూ ఉంటుంది.

అత్తా కోడళ్ళు కూడా ఈమధ్య దూరంగానే ఉంటున్నారు. వెంకట్రామయ్యగారు అయినదానికీ కానిదానికీ సీతా సీతా అంటూ భార్య వెనకాల తిరగటం సరోజినికి నచ్చలేదు. ఈ వయసులో కూడా వాళ్ళిద్దరూ...ఛీ...ఛీ... ఏం స్త్రీ పురుషులు అనుకుంది సరోజిని.

సీతమ్మగారుకూడా భర్తని ప్రపంచంలో అందరికంటె ఎక్కువ గౌరవించి ప్రేమిస్తుంది. - ఆవిడతోపాటు ఈయన కూడా ఈమధ్య వంటింట్లో చేరటం సాగించాడు. ఉల్లి పాయలు ఒలవడం వగైరా చేస్తున్నాడు. దానివలన సరోజని గదివిడిచి బైటికి రావాలంటే ప్రాణాంతకంగా ఉంది. ఈ మధ్య రామారావు మళ్ళీ చురుగ్గా తయారయి కొంపకి రావటం మానేశాడు. ఒచ్చినా తల్లి తలుపు తీస్తుంది. తండ్రి గదిలో పడుకుంటాడు. ఆ గదిలో ఒక క్యాంప్ కాట వేశారు - ఇది మరీ చిరాగ్గా ఉంది సరోజినికి.

. . ఈ ముసిలాయన తీరిగ్గా వంటింట్లో పీటవేసుకుని, ఉల్లి పాయిలు ఒలవడం, కొబ్బరి కోరటం, పచ్చిమిరపకాయలు తొడిమెలుతీయటం- అతి జాగ్రతగా చేస్తూ కదలడు. భార్యా అంటె ఆయనికి ప్రేమవుండచ్చుగాని ఈ బహిరంగ ప్రదర్శనము సరోజినికి గిట్టడంలేదు ఎబ్బెట్టుగా అసహ్యంగా వుంది. భార్యాభర్తలు వయస్సు మర్చిపోయి అన్నివిషయాలూ మాట్లాడటం, హాస్యాలూ, చమత్కారాలూ, చనువులూ, చాలా చిరాగ్గా ఉన్నాయి సరోజినికి. పిళ్ళిద్దరూ ఆ వెధవ పని (సెక్స) చేసి కొడుకుల్ని కన్నారని తల్చుకొంటే ఒళ్ళు జలదరిస్తోంది సరోజినికి.

అలాగే ఆఇంటికి ఎవరొచ్చినా ముందు వెంకట్రామయ్య గారికే నమస్కరిస్తారు. వాళ్ళ సంభాషణలో ఆయన అన్నీ చర్చిస్తాడు. కొడుకులూ తండ్రి వయస్సుభేదం మర్చిపోయి అలా కబుర్లుచెప్పుకోడం సరోజినికి సుంతకూడా గిట్టదు.

ఇవాళ సరోజిని సినిమాకి వెళదామన్నది రామారావుతో. అతను సరేఅన్నాడు. వెంటనే "అమ్మా...నాన్న గారూ మీరూ వస్తారా ?" అని అడిగాడు.

"ఏంసినిమా ? ఇప్పుడెందుకూ ?" అన్నది సీతమ్మ గారు.

"పోనీ రారాదూ ?" అన్నాడు రామారావు.

"నేనెందుకులే మీ నాన్నని తీసుకెళ్ళు..." అని వెంకట్రామయ్యగార్ని పిలుచుకొచ్చింది సీతమ్మగారు.

"సరోజినీ...ఇంకా కూర్చున్నావేం పద పోదాం" అన్నాడు రామారావు.

"ఏమిటి మీ అమ్మఅంటున్నది" పరిశీలనగా చూస్తూ అన్నది సరోజిని

"ఏం లేదు. ఆవిడరాదట...నాన్నగార్ని తీసికెళ్ళమంది. లే మరి చీరమార్చుకో"

"నేను రాను"

"ఎందుకూ ? ఇంతలోనే ఏమయింది ?"

"తల నొప్పిగా ఉంది"

"నేను నమ్మను. నాన్నగారు రావటం నాకూ ఇష్టం లేదు కాని ఆయన వస్తానన్నారు. ఏంచెయ్యాలి ?"

"అయితే మీ నాన్న, మీరూ కలిసిపోండి"

"ఆ అవసరం లేదుగానీ, అసలు వస్తావా? రావా?"

"సరదగా సినిమాకి పోదామంటే - మీకు బుద్ధిలేక మీ అమ్మకి చెప్పారు. ఆవిడకి జ్ఞానంలేక ఆయన్ని పిలిచారు. ఆయనకు మతిలేక మనతో ప్రయాణమయ్యాడు. నాకుమాత్రం మీ నాన్న అమ్మల్ని చూస్తే అసహ్యం. వాళ్ళతో రాను. అదీ సంగతి."

"అయితే ఇప్పుడు ఏం చెయ్యమంటావ్?"

"మీ నాన్నా, మీరూ వెళ్ళండి"

"నువ్వో రా"

"మీ నాన్నతో చచ్చినా రాను"

"పోనీ ఈ ఒక్కసారికీ పోదాం...ఇంకోతడవ ఇలా జరగదు"

సరోజిని రానన్నది. రామారావు బయటికివచ్చి తండ్రితో మాట్లాడుతూ కూర్చున్నాడు... వెంకట్రామయ్య గారి మొహాన ఆ క్షణాన ఉన్న విజయగర్వం సరోజినిచూస్తే వెంటనే హైద్రాబాద్ పారిపోయేది.

సరోజిని అత్తమామలమీద పితూరీలు చెప్పుదామన్నా వీలుకాకుండా ఉంది.

"నువ్వలా అనుకోకూడదు సరోజినీ! వాళ్ళిద్దరూ చాలా అన్యోన్యమైన దంపతులు - మా ఇద్దర్నీ ప్రాణప్రదంగా పెంచారు. వాళ్ళెలాఉన్నా గౌరవనీయులే - పెంచి పెద్దచేయ

టం అందరూ చేస్తారు. కాని అమ్మా నాన్నగారూ అలా కాదు. వారినేమీ అనకు" అన్నాడు రామారావు. సరోజిని ఆశ్చర్యపోయింది.

ఈ ఆడా మొగా వెధవపనిచేసి...సంతానాన్ని కని వాళ్ళని పెంచి అదో ఘనకార్యంకింద ఆ సంతానంతోనే అని పించుకోవటం ఆశ్చర్యాల్లో ఆశ్చర్యం...అదివాళ్ళ స్వార్థం-బాధ్యతా-అందులోఉన్న నిర్వాకం ఏమిటో...విశ్వాసాలూ కృతజ్ఞతలు దేనికో. ఈ లెక్కన తనని పెంచని మిగతా వాళ్ళంటే ... మనుషులు ద్వేషిస్తారన్నమాట - ఆమాటే రామారావుతో అంది.

"అదేమిటి? అందర్ని ద్వేషించటం దేనికి? వెధవ తర్కం నువ్వూను ... అయినా కన్నవాళ్ళు పెంచుతారు. మిగతావాళ్ళని ద్వేషిస్తామా అందుకని" అన్నాడు రామా రావు.

"ఈ పెంచటంలో...(స్త్రీ) పురుషులు చేస్తున్న ఘన కార్యం ఏమిటి? పశువాంఛ తీర్చుకుంటే పిల్లలు పుడ తారు... వాళ్లే పెరుగుతారు"

"పశువాంఛో? పవిత్రప్రేమో? వాళ్ళశరీరాల్లోంచి పుట్టాం"

"పుట్టాం అనకండి...పుట్టాను అనండి"

"అంటే మీ అమ్మా నాన్నా ఆ వెధవపని చెయ్య కుండా...నిన్ను గాలికి కన్నారా?" అన్నాడు రామారావు. ఆ ప్రశ్నకి నిరుత్తరురాలైంది సరోజిని.

"ఎవరైనా అలాగే పుడతారు. స్త్రీ పురుష సంగమం లేని సృష్టిలేదు. దుర్భిణిలోంచి చూసి ఆలోచించినా స్త్రీ పురుష సంగమం లేకుండా పిల్లలు పుట్టరు...మానవజాతిలో పిల్లల్ని గుర్తించడానికే వివాహం...ఆపిల్లలకి సోషల్ స్టేటస్ రావడానికే ఆ స్త్రీ పురుషులు కంట్రోలుగా ఉంటారు. అలాంటి వాళ్ళని గౌరవించటం సంతానం ధర్మం...మిగతా దేశాల్లో ఈ ధర్మం తగ్గింది. భారతదేశంలో ఉంది"

"భారతదేశంలో స్త్రీ పురుష సంబంధం లేని ఎంతమందో ఉన్నారు"

"అవును, సన్యాసులూ-ఖొజ్జాలూ - సొసైటీవాళ్ళను గౌరవించదు. ఇంతటితో ఈ తర్కం ఆపేద్దామా? తమ్ముడు వచ్చినట్లు ఉన్నాడు" అన్నాడు రామారావు ఉలిక్కిపడిన సరోజినిని చూడకుండానే.

ప్రభాకరం కోడిని పుచ్చుకుని లోపలకు వచ్చాడు... సరోజిని తలుపేసుకు లోపలికి వెళ్ళింది.

విజయవాడలో ప్రారబ్ధం అనే ఎల్లోపత్రిక ఉంది... అది పురప్రముఖుల చాటు జీవితాల్ని గురించి సేకరించి ప్రచురించీ బ్లాక్ మెయిల్ చేసీ ఏడిపిస్తోందని పోలీసు రిపోర్టువచ్చింది- ప్రభాకరం కోడినిచ్చి వెంటనే బయటికెళ్ళాడు.

ప్రారబ్ధంఆఫీసులో గడియారం చేస్తున్న చప్పుడు నిశ్శబ్దానికి జీవనాడిఉందా అనిపిచ్చేటట్లున్నది. అసలాగదిలో కరెంటుపోతే నిశ్శబ్దంగా ఉంటుంది. కారణం ఆ గదిలోఉండే

ఫాను-అది తిరగటం అంటూ ప్రారంభించాక పిండిమర శబ్దం వస్తుంది. పారిబంప్రతిక ఎడిటరుగా పిలవబడుతున్న శర్మకి మాత్రం ఆ సీలింగ్ ఫాన్ మీద చాలా గౌరవం ఉంది. శర్మకి భార్య లేకపోయినా భార్యకంటె మిన్నగా రొదచేస్తున్న ఆ ఫానుమీద చాలా ప్రేమ. ఒకవిధంగా ఫానుకున్న ప్రత్యేక లక్షణాలు భార్యకి ఉండవని అతని అభిప్రాయం.

పారిబంప్రతిక సబ్ ఎడిటరు గలశ్రీ - పూర్వాశ్రమంలో వర్ధమానభావకవి పేరు భానుమూర్తి. పెన్ నేమ్ గలశ్రీ...కాని అందరూ భావకవి భానుమూర్తి అంటారు. గలశ్రీ అని ఎవరూ పిలవనందుకు జనంమీద దిగంబర కవిత్వం చెపుతూ ఉంటాడు. అతను భావకవిత్వాన్ని వదిలితే దిగంబరచిత్రాలకోసం వేటాడతాడు.

శర్మ ఆజ్ఞప్రకారం గలశ్రీ బయటికి వెళ్ళాడు. విజయవాడలో శర్మదృష్టిని ఆకట్టుకొన్న విషయం ఒకటున్నది. ఆ విషయం తాలూకు వ్యక్తుల ఫొటోలకోసం గలశ్రీ ఉరఫ్ భానుమూర్తిని పంపించాడు. అతనికోసం ఎదురుచూస్తున్నాడు. ఇంతలో పోలీసువాడు ప్రవేశించాడు.

"నా పేరు నరహరి. నరుల్ని హరిస్తాననికాదు" అని ఒకజోకు పారేసి నవ్వుతూ కుర్చీలాక్కుని కూర్చున్నాడు. శర్మకి ఏంతోచలేదు. శర్మ సంశయాన్ని కనిపెట్టిన నరహరి -

"పోలీసువాడినే అనుకోండి. కవిత్వంకూడా వ్రాసుకొచ్చాను తమరు ప్రచురిస్తారని" అని ఒక కట్టతీసి బైట పెట్టాడు.

శర్మ సర్దుకుని ఠీవిగా "మీదేవూరు ?" అన్నాడు.

"మాది కాశ్మీర్ సార్ ! అలాచూస్తారేం ? మా ముత్తాతకి మూడు తరాలముందట ఓ మహానుభావుడు సన్యాసం పుచ్చుకుని దేశాటన ప్రారంభించాడు. తెలుగుదేశం వచ్చి పండుమిరపకాయలూ గోంగూరా తిన్నాక ఆయనకి ఓ తెగులుచ్చుకుంది. పెళ్ళి చేసుకోవాలని వెంటనే తెలుగు పిల్లని చేసుకున్నాడు. అసలే అప్పటివరకూ సన్యాసం పుచ్చుకుని ఉన్నాడేమో ! వరసాగ్గా పదకొండుమంది సంతానం కలిగారు. ఆవంశం అలాగే పెరిగింది తమదయవల్ల. నేనూ ఆ వంశంలోవాడిని"

ఈ వాగ్ధోరణికి శర్మ జంకలేదుగాని పోలీసు యూనిఫారానికి కొద్దిగా జంకాడు. అయినా అడిగాడు.

"తమరు మా ఆఫీసుకు దయచేసిన కారణం ?"

"సత్యాన్వేషణ ఉంది చూశారా ?...అది చాలా గంభీరమైంది- లోతైంది"

"సత్యాన్వేష ణేమిటి ?"

"నా కవిత్వం పేరండి..."

"మేము కథలేగాని కవిత్వం వెయ్యం"

"సార్ ! గొలుసు కథ అని వెయ్యడానికి ఏలుగానే వాళ్ళావండి"

నరహరి మాట పూర్తికాకుండానే భానుమూర్తి ప్రవేశించి పోలీసునిచూసి గతుక్కుమన్నాడు.

నరహరి భానుమూర్తికి షేక్‌హాండిచ్చి ఊడిపడేలా చెయ్యి ఊపుతూ "వెరిగ్లాడ్" అన్నాడు.

భానుమూర్తి ఖంగారు తగ్గకుండానే అతని వీపుమీద చెళ్ళున చరిచి "ఏమ్మారు మిత్రమా" అన్నాడు నరహరి.

శర్మ అందుకుని "ఈమ్మారేనండి" అన్నాడు.

అంతటితో నరహరి ఆగకుండా భానుమూర్తి రెండు బుగ్గలూ సాధ్యమైనంత ఎడంచేద్దామని విశ్వ ప్రయత్నం చేస్తూ సాగదీసి శర్మవంకచూస్తూ-

"మీ కొడుకేనా సార్" అన్నాడు.

"క్షమించండి నా కొడుకుమాత్రంకాడు" అన్నాడు శర్మ నిర్లిప్తంగా.

"సరేసార్, నా కవిత్వం చూడండి మళ్ళీ వస్తాను" అని బయటపడి వీధి చివరఉన్న ప్రభాకరాన్ని కలుసుకున్నాడు.

"ఏమయింది?"

"అనుమానాస్పదంగానే ఉందిసార్. మొత్తానికి ఆ ఇద్దరూ చాలా ఖంగారుగా ఉన్నారు" అన్నాడు నరహరి

"నీ కవిత్వం వదిలి వచ్చావా?"

"వదిలి వచ్చాను సార్"

"ఎల్లో జర్నలిజం వేస్తున్నారు...కాని బ్లాక్ మెయిల్ చేస్తున్నారా ? లేదా ? కాస్త చూడు"

"యస్ సార్"

"నేను ఇంటికి వెడతాను" అని ప్రభాకరం మోటారు సైకిలు స్టార్టు చేశాడు.

ఇంట్లో ఈరోజు కోడికూర గనక వదిన బైటికిరాదు అనుకుని ఆలోచిస్తూ ఇల్లు చేరాడు.

తల్లి వంటయింట్లో వున్నది ... వెంకట్రామయ్యగారు పడకుర్చీలో కూర్చుని వున్నారు.

"నాన్నగారూ ... ప్రారబ్ధంపత్రిక గోల ఏమిటి ? మీకు తగిలిందా ?" ప్రశ్నిస్తూ కూర్చున్నాడు ప్రభాకరం.

"తగిలింది...పూర్వం దానిపేరు అభాండం. కమ్యూనిస్టుల్ని బూతులు తిట్టేది. అచ్చమాంబగార్ని...గోరాగార్ని అది తిట్టినతిట్లు ఘోరం. అభాండం - బస్తీ-కోల-ప్రారబ్ధం-ఈ నాలుగు పత్రికలూ ఒకటే. పోలీసులు పట్టుకున్నప్పుడల్లా పేరు మారుస్తారు. ఇప్పుడేం జరిగింది ?" అన్నాడు వెంకట్రామయ్యగారు.

"ఊళ్ళోవాళ్ళని విమర్శించటం తిట్టటం మామూలే ననుకోండి...కాని బ్లాక్ మెయిల్ ప్రారంభించిందని రిపోర్టులూ ఆకాశరామన్న ఉత్తరాలూ వస్తున్నాయి"

"బ్లాక్ మెయిలర్సుని పట్టుకోవడం కష్టం. తప్పుచేసిన వాళ్ళని ఆ తప్పు కారణంగా డబ్బు గుంజటం నేరమే అయినా పెద్దమనుషులు పోలీసుల దగ్గరమాత్రం ఆ తప్పు ఒప్పుకోరు. బ్లాక్ మెయిలర్సుకే డబ్బు పారేస్తారు."

"ఆకాశరామన్న ఉత్తరాలూ-పేరులేని రిపోర్టులూ వచ్చినయ్. ఏం చెయ్యాలో తోచడంలేదు. ఇలాటప్పుడే డిటెక్టివులువుంటే బాగుండుననిపిస్తుంది" నవ్వుతూ అన్నాడు ప్రభాకరం.

"డిటెక్టివులు...ప్రయివేటు డిటెక్టివులు నవలల్లోనే తప్ప సామాన్యంగా వుండరు. ఈ డిటెక్టివు నవలల్లో వ్రాసినది తప్పు. పోలీసు డిపార్టుమెంటులో డిటెక్షన్ ఒక భాగం. గవర్నమెంట్ ఎయిడ్‌తో ఒకళ్ళిద్దరు ప్రైవేటు డిటెక్టివ్‌లున్నారు. కాని ప్రస్తుత శవ సాహిత్యంలోలాగా వీధికి ఇద్దరు చొప్పున లేరు. మరి ఈ సాహిత్యం ఏమిటో నాకు తెలియదు. ఇప్పుడు ప్రారబ్ధంమీద దాడి చేస్తావా?" నవ్వుతూ అన్నారు వెంకట్రామయ్యగారు.

"ప్రారబ్ధంమీద దాడి చేసినట్లే వుంది...మీరన్నట్లు బ్లాక్ మెయిలర్సూ...బ్లాక్ మెయిల్ చేయబడినవాళ్ళూ రహస్యంగా వుంటారు. హత్యలో శవంఅయినా దొరుకుతుంది. ఇందులో ఏ ఆధారమూ దొరకదు. ఆ శర్మ, భానుమూర్తి సామాన్యులు కారు. వాళ్ళు అనుమానం కలిగించే విధంగా లేరుగాని ఖంగారు పడుతున్నారు.

"ఖంగారుపడటం పోలీసుల్ని చూసికావచ్చును...మన డిపార్టుమెంటులో ఎంతమంది నేరస్తులకి మద్దతు యిస్తారో తెలిసే ఏంచేయలేని స్థితి?

"రైడుకి ముందే సగంమంది తప్పించుకు పోతారు. ఏం చేయలేం. దొంగదాటిపోయిన తరువాత రిపోర్టు వస్తుంది. ఏం చేయలేం. విజయవాడలో చచ్చినవాడి శరీరంమీద పదికత్తి పోట్లుంటాయి. లాయరు రుజువు లేదన్ని వాదిస్తాడు. హంతకుడు విడుదల అవుతాడు. మళ్ళీ పార్టీలూ, కక్షలూ మామూలే. ఏం చేయలేం" నిట్టూర్చాడు ప్రభాకరం.

"అది అలాఉంచు. ఇంటిదొంగని ఈశ్వరుడుకూడా పట్టలేడు. దాని సంగతి ఏంచేశావు?" మెల్లగా అన్నారు వెంకట్రామయ్యగారు.

"ఏం చేయమంటారు... ఆత్మలతోటీ, ప్రారబ్ధంతోటీ ఎలా పోట్లాడాలో తెలియటంలేదు"

"కొండఅవతల హిజ్రాలున్నారు. వాళ్ళకీ, హైద్రాబాద్ హిజ్రాలకీ సంబంధం ఉండొచ్చు... నీ అన్న ప్రాణం నీచేతిలో ఉంది" విచారంగా అన్నారు వెంకట్రామయ్యగారు.

"నాన్నా! తప్పకుండా పనిచేస్తాను. మీరు విచారించకండి"

"అలాకాదు. ఈ ప్రారబ్ధంశర్మ ఆడా మొగా కాదని నా వుద్దేశ్యం. వాడు పెళ్ళిచేసుకోలేదు. వాడినీ ఒకకంట కని

పెట్టు. కొండవతల నలుగుర్ని పడేయి. నాలుగురోజుల్లో తెలుస్తుంది"

"అలాగే చేస్తాను... కాని నిజాంపర్వానా చూపిస్తే"

"ఏం ఫరవాలేదు. వాళ్ళు శిక్షింపవచ్చును. కాని ఇతరులందర్నీ హిజ్రాలు చేయటం ఘోరం. ఈ రాత్రి నువ్వు యింటిముందు ఇద్దరు అవసరం"

"ఎందుకు?" గతుక్కుమన్న ప్రభాకరం అడిగాడు.

"నాకే తెలియదు. నాలుగురోజులకిందట ఈమె వ్రాసిన ఉత్తరానికి కేరాఫ్ పోస్టుమాస్టరుకి సమాధానం వచిన ఉంటుంది. కోడి పుణ్యమా అని బయటకురాదు. పోస్టాఫీసుకి వెళ్ళి ఆ ఉత్తరం తీసుకొస్తే... సగం తెలుస్తుంది..." అన్నాడు మాజీపోలీసుఆఫీసరు వెంకటావ్రామయ్యగారు.

# 7

సరోజినికి!

బహుచార్ మాతవాహనంనిన్ను కనిపెడుతూఉంటుంది. దాన్ని (కోడి) గౌరవిస్తూ ఉన్నాననుకుంటాను. మొన్న ప్రయత్నము విఫలమైనందుకు విచారించకు. గర్భవతిగా ఉన్నప్పుడు సంతానాన్ని బహుచార్ మాత సేవకి అర్పిస్తానన్నావు. పిల్లల్ని విజయవాడలో మనవాళ్ళకి అప్పజెప్పు. గాంధీహిల్ కి షికారు

ని తీసుకురావచ్చును- నీ దగ్గర వెయ్యిరూపాయలదాకా ఉన్న డబ్బుకూడా మన వాళ్ళకి ఇచ్చెయ్యి. నాలుగురోజు లలో పిల్లలూ డబ్బు అందిన తరువాత కార్యక్రమం వివరంగా వ్రాస్తాను.

నీ నేస్తం
బహుచెర.

ఈ ఉత్తరం ఉరుదూనించి తెలుగుచేసిన బ్రాహ్మణుడు అదిరిపోయి ప్రభాకరాన్ని చూశాడు. ఆయనకి అరవయి ఏళ్ళు దాటినయ్. ఆయన ఉర్దూ ఇంగ్లీషు సంస్కృతం తెలుగుల్లో పండితుడు... ఆ సంగతి తెలిసిన ప్రభాకరం ఉర్దూ ఉత్తరాన్ని తెలుగులో అనువదించమన్నాడు.

"ఏం నాయనా! ఈ సరోజిని ఎవరు... ఎవరికొంపలో చిచ్చుపెట్టింది?" అన్నాడాయన.

"మీకేమన్నా తెలుసా?" ఆతృతగా అడిగాడు ప్రభాకరం.

"బహుచెరభక్తులంటే స్త్రీలూ, పురుషులూ కాని వాళ్ళు. వాళ్ళ శిష్యరాలు ఎవరో? ఎందుకో? కాపురంచేసి పిల్లల్ని కన్నట్లుంది. ఆ పిల్లల మర్మావయవాలు తీసేయటమే...పిల్లల్ని బహుచార్ మాతకి అప్పచెప్పటం...... వాళ్ళకి భర్తాపిల్లలూ మమకారం వుండదు. ఉన్నది బహుచార్ మాత ఒక్కతే" అన్నాడాయన - ప్రభాకరం ఖంగారు పడుతూ-

"కోడి ఏమిటి?" అన్నాడు.

"అది బహుచార్ మాత వాహనం. దాన్ని వీళ్ళు గౌరవిస్తారు. అది పవిత్రమైన పక్షి గనక తినకూడదంటారు. ఇంతకీ ఎవరీ సరోజిని!"

"మీ కివన్నీ ఎలా తెలుసు ?"

"నేను కలకత్తాలో వుండగా నా భార్యను ఈ కొజ్జాలు చంపారు."

"అదెలా ?"

"నా భార్య బాలింతరాలు. మా అమ్మా భార్యా ఇంట్లో వున్నారు. వీళ్ళు వచ్చినప్పుడు తెలియక తలుపు తీయటమే నా భార్య పొరపాటు. చుట్టుపక్కల మేడలమీద నుంచి అందరూ అరిచినా బెంగాలీరాని నా భార్య తలుపు తీసింది. వృద్ధురాలైన మాఅమ్మ ఒక గంటలో చచ్చిపోయింది. నా భార్య నాలుగురోజులకి హాస్పటల్లో చనిపోయింది. నా బిడ్డని వాళ్ళెత్తుకుపోయినారు" గద్గదంగా అన్నాడాయన.

"ఎలా చంపారు ? పోలీసు రిపోర్టు ఇవ్వలేదా ?"

"ఎలా చంపారంటావా ? స్త్రీ అవయవాలని చేతులతోనే పీకేద్దామని ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో నా తల్లీ భార్యా చనిపోయినారు. నా మగబిడ్డ ఆచూకీ తెలియదు. పోలీసు రిపోర్టు యిచ్చాను. పోలీసు ఎంక్వయిరీలో

ఏమీ తేలలేదు. ఖొజ్జాలకి తలుపు తీయటమే తప్పన్నారు. అసలు పోలీసులకీ వాళ్ళంటే భయమే. వెంటనే మోడు లాగా తిరిగి వచ్చాను. పిళ్ళమీద పగ తీర్చుకుందామని ప్రయత్నించాను గాని అన్నీ వృథా అయినయి..."

"చెప్పండి"

"వాళ్ళకోంపలచుట్టూ తిరిగాను. ఆడవేషాలలోఉన్న ఖొజ్జాలు నేను మగాడినిగనుక నన్ను ప్రేమించారు ... ఉత్త ప్రేమించటంకాదు. నన్నుకూడా హిజ్రాని చెయ్యాలని ప్రయత్నించారు. దానితో పారిపోయివచ్చాను. ఈ పిల్లలెవరో... వాళ్ళని కాపాడాలి"

"ఈ పిల్లలు... మా పిల్లలే...మా అన్నగారిపిల్లలు. ఈ సరోజిని మా అన్నభార్య."

"నాయనా... ఇబ్బందే. ఆ పిల్లల్ని ఈ కొజ్జాలు తీసుకెళ్ళి కొజ్జాల్ని చేస్తారు... గాంధిహిల్ ప్రాంతంలో కొజ్జాలు ఎక్కువగా ఉన్నారు. నా కొడుకు ఇప్పుడు పాతికేళ్ళవాడు" నిట్టూర్చాడు ముసలాయన.

"పోలీసులకి కూడా అసంభవమేనంటారా? పట్టుకోవటం..."

"అసంభవమే... వాళ్ళదగ్గర మూలికలూ,మంత్రాలు వశీకరణ చూర్ణాలూ, దెయ్యాలూ గట్రా అనేకంవుంటాయి"

'దెయ్యాలు ఉ...న్నా...యి అంటారా?"

"అనుమానం లేదు. ఈ కొజ్జాలే పెద్దదయ్యాలు. వీళ్ళ చేతులలో ఉన్న దయ్యాలుకన్న వీళ్ళే భయంకరులు. వీళ్ళు ఎదురుతిరిగిన వాళ్ళని చంపి, వాళ్ళసావిట్లో పాతిపెట్టి ఉప్పూ సున్నం వేస్తారు. ఆ హత్యలు బయటికి రావు. శవం కనపడదు గనక పోలీసులు లోపలికి వెళ్ళరు కొజ్జాల కొంపలోకి ఎందుకులే అనే తేలిక భావంతో. ఎత్తుకెళ్ళిన పిల్లల్ని నిమిషాల మీద మార్చటం అనేది వాళ్ళప్రత్యేకత. కొజ్జాల్ని చేయటమే కాకుండా పాతరూపం పోయేందుకు శతవిధాల ప్రయత్నం చేస్తారు... పచ్చపొడుస్తారు. పుట్టుమచ్చలు కల్పిస్తారు. అసలు ఆకారమే మారిపోతుంది నాలుగునెలలలో... పోలీసులు మాత్రం ఏం చేయగలరు ఈ స్థితిలో" నిట్టూర్చాడుఆయన.

"మరెలా?" విచారంగా అన్నాడు ప్రభాకరం.

"నేను చెప్పినట్లు వింటావా?"

"వింటానండి"

"ఆ పిల్లల వయస్సెంత?" అన్నాడు ఆలోచనగా.

"అయిదు, నాలుగు"

"ఈ పిల్లలు బడికెడుతున్నారా?"

"వెడుతున్నారు"

"నీవు పినతండ్రివే కనక, ఆ పిల్లలు నీ కలవాటేఅయి వుంటారు. బడినుంచి వాళ్ళని రానివ్వకు. ఎక్కడన్నా దాచేయి. తర్వాత జరిగేది ఆలోచిద్దాం... మీ నాన్నగారిపేరు"

"వెంకట్రామయ్యగారు"

"అంటే పోలీసు డిపార్టుమెంటులో పనిచేసిన వెంకట్రామయ్యగారేగా... నువ్వు వెంకట్రామయ్యగారి కొడుకువిటోయ్. ఆయనా నేనూ స్నేహితులం... నా కథ ఆయనకు తెలుసు"

"నాన్నగారు చెప్పారండి. అందుకే ఈ ఉత్తరం మీ దగ్గరికి తీసుకొచ్చాను"

"ఈ ఖోజ్జాలతో ... నా జీవితం నాశనం అయింది. వెంకట్రామయ్యగారికికూడా ఈ శని పట్టుకుందన్నమాట... నువ్వా ? మీ అన్నయ్యా ? పోలీసు డిపార్టుమెంటులో పని చేస్తున్నది ?

"నేనేనండి"

"వివాహం కాలేదా ?"

"లేదండి"

"చూడు బాబూ. ఈ సరోజిని నీ అన్నభార్య ఏ క్షణంలోనయినా వెళ్ళిపోతుంది. ఆ వెళ్ళటంకోసం ఇంటిల్లి పాదినీ చంపటానికి వెనుదీయదు. ఆ ఖోజ్జాల మనస్తత్వం అలాంటిది. పిల్లల్ని కాపాడాక నీ అన్నని రక్షించుకో. సీతల్లిదండ్రుల్ని రక్షించుకో...నిన్ను నువ్వు రక్షించుకో...కష్టమైన పనే. కాని తప్పదుగదా" అని నిట్టూర్చాడు ఆయన. ప్రభాకరం తండ్రి చెపితే కొంచెం నిర్లక్ష్యం చేశాడు. కాని

ఇప్పుడాతనికి భయం పట్టుకుంది. ఖొజ్జాల భయంకర మనస్తత్వాన్ని ఇలా ఊహించుకోలేదు. ఏదో తేలిక వ్యవహారం ఫరవాలేదు అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు! వాళ్ళని గురించేనా? స్త్రీ పురుషుడూ కాని ప్రాణికి ఈ స్త్రీ పురుష ప్రపంచం అంటే అసహ్యం. వాళ్ళకోపం మనుష్యుల జననేంద్రియాల మీద. కొందరు చచ్చిపోయినా కొందరు వాళ్ళ జనాభాని పెంచుతారు. అదే వాళ్ళ ఆశ. వీళ్ళకి సాక్షాత్తూ అర్జునుడు దైవం. ఆయన విరాటరాజు కొలువులో కొద్దిరోజులు ఖొజ్జాగా వున్నాడు గనక! వీళ్ళకి వ్యభిచారపు కొంపలంటే యిష్టం. స్త్రీ పురుషులు పతనం అయ్యేది అక్కడే గనక. వాస్తిక వాకమంటే యిష్టం? వాళ్ళ క్షుద్రశక్తులు పని చెయ్యాలి గనక. వాళ్ళు పత్రికలు చదువుతారు. రేడియోలు వింటారు, సినిమాలు చూస్తారు. టెలివిజన్‌లుకూడా ఉంచుకోగల ఆర్థిక స్తోమతవుంది. ఎలాగంటే వ్యభిచార గృహాలకు అధిక వడ్డీమీద అప్పులు పెడతారు. వడ్డీ వ్యాపారం వాళ్ళ ప్రధానవృత్తి. అడుక్కోవటం రెండో వృత్తి. ఆడవాళ్ళలాగా చీరలు కట్టేవాళ్ళని గుర్తుపట్టలేం. వీళ్ళు ఆడఖొజ్జాలు. మీసాలు వుండేవాళ్ళు మొగకొజ్జాలు. వీళ్ళని తేలిగ్గా గుర్తుపట్టగలం. అందుకని వ్యాపారం అంతా ఆడకొజ్జాలే చేస్తారు. మొగకొజ్జాలు బయటికివస్తే నవ్వుతారు గనక వాళ్ళు రావటం తక్కువ. ఈ వూళ్ళో పెద్ద బ్రోతల్ కంపెనీలకి అప్పిచ్చేది వాళ్ళే ... మీ నాన్నగారికి ఈ సంగతులు తెలుసు...వీళ్ళు ఆయన ఉద్యోగ విరమణ

చేసేదాకా దొరకలేదు. నువ్వయినా పట్టుకుంటే సంతోషం" అన్నాడాయన.

ప్రభాకరం ఆయనకి నమస్కరించి బయటకు వచ్చాడు. ఆ ఉత్తరం మళ్ళీ పోష్టుఆఫీసులో ఇచ్చేశాడు. సాయంత్రం నాలుగయింది. బడి ఇవతల నుంచున్నాడు ప్రభాకరం. ఉత్తరం రేపు అందుతుంది. పిల్లల్ని ముందు దాయాలి... దానికి వీరయ్య యిల్లే సురక్షితం... అసలు నాన్నగారితో చెప్పే టైములేదు. పిల్లలు ఇంటికి రాకపోతే ఇంట్లో జరిగే అల్లరి ఊహించుకుని ఖంగారుపడి ఇంట్లో చెప్పుదామనుకున్నాడు.

కాని లాభంలేదు. బడివిడిచిపెట్టే టైమయింది. పిల్లలు వచ్చేస్తారు. ఏమయితే అది అయింది. మొండిగా నిలబడ్డాడు. బడిగంట కొట్టారు. ఒకే యూనిఫారంలో ఉన్న పిల్లలందరూ తన అన్నపిల్లలుగానే తోచారు. ప్రభాకరానికి... వీళ్ళని కొజ్జాలు చేయడం... ఆ భావనరాగానే అతని నెత్తురు ఉడికి పోయింది... పిల్లలవంక పరీక్షగా చూశాడు.

ఇంతలో పిల్లలిద్దరూ వచ్చి అతని కాళ్ళకు చుట్టేసు కున్నారు.

"బాబాయ్, ఇక్కడున్నావేం...ఇవ్వాళ పోలీసాఫీసుకి పోలేదా?" అన్నాడు పిల్లవాడు.

"లేదు బాబూ... ఇవ్వాళ నువ్వూ నేనూ చెల్లీ తాతయ్య ఇంటికి పోదాం"

"ఈబట్టలతోనే పోదామా? మరిపుస్తకాలో" అన్నాడు పిల్లవాడు.

"ఫరవాలేదులే... ఇలాగే వెడదాం. వీరయ్యతాత ఇంటికేగా. ఇవ్వాళ అక్కడుండాలిమీరు! రేపు మనంకరం కలిసి అక్కల్లాగా పోదాం"

"ఓ" అన్నారు పిల్లలిద్దరూ సంతోషంగా.

రిక్షాని పిలిచి పిల్లలతో కూర్చున్నాడు ప్రభాకరం. వీరయ్యపెద్ద కూతురుపిల్లలు ఇద్దరు ఉన్నారు. వాళ్ళతో ఆటల్లో పడ్డారు పిల్లలిద్దరూ.

"వీరయ్యమామా"

"ఏమిటి సార్"

"మామా అని పిలిచాను. పోలీసు ఆఫీసరుగాకాదు... ఈ పిల్లల్ని నాలుగురోజులు నీ ఇంట్లో దాయాలి" అన్నాడు ప్రభాకరం అతనిచేతులు పుచ్చుకుని.

"ఎంతమాట. ఇసయం సెలవిచ్చినారుగాదు" అన్నాడు వినయంతోపాటు కుతూహలంతో జోడిస్తూ.

"విషయం ఏమీలేదు. ఈ పసిపిల్లల ప్రాణాలు నీ చేతిలో ఉన్నాయి... నీ ఇంట్లో కాకపోతే రేపు ఈ ఇద్దరు పిల్లలూ మాయమయ్యే స్థితి వచ్చింది....

"అయ్యో... నాన్నగారికి..."

"తెలుసు... పిల్లల్ని యిక్కడ దాచానని ఇప్పుడు చెప్పుతాను. పిల్లలు ఏదయినా అడుగుతారేమో" జేబులో చెయ్యి పెట్టబోయినాడు ప్రభాకరం.

"ఎంతమాట? నేను చూసుకుంటాలెండి"

"వీరయ్యమామా... ఈవూళ్ళో పెద్దబోర్తల్ కంపెనీ ఏది ?" అన్నాడు ఆలోచనగా ప్రభాకరం.

"అన్నీ పెద్ద కంపెనీలే. సంసారి కంపెనీల్లో పెద్దయి డాక్టరు కంపెనీ, కామాక్షమ్మ కుట్టుకంపెనీ, అగ్గిమందు కంపెనీ, అగరుపుల్లల కంపెనీ వగైరాలు ... ఎందుకు సార్ ?"

"ఈ కంపెనీలకి అప్పిచ్చేది ఎవరు ?...నీకు తెలుసా?"

"కాబూలోళ్ళు. మాంకాళమ్మ"

"మాంకాళమ్మ అంటే ?"

"అయ్యబాబో...మాంకాళమ్మ పెద్ద వడ్డీ యాపరస్తురాలు. ఏదైనా తప్పు దొరుకుద్దని ఇరవయ్యేళ్లనుండి కన్నేసి ఉంచాను. యాపారం డబ్బూ తప్ప ఆ యమ్మదగ్గర మరేటి తప్పూ కనపడలేదు"

"ఇల్లెక్కడ"

"గాంధీహిల్లు వెళ్ళేదారిలో నాలుగో పెంకుటిల్లు. ఆ యమ్మకి ఎవరూ లేరు. మాతల్లి. ఈ వడ్డీడబ్బు ఏం చేస్తదో ?" అన్నాడు వీరయ్య.

గాంధీహిల్ అనేసరికి అతనిగుండె జల్లుమంది.

"సరే వీరయ్యా! పిల్లలు జాగ్రత ... వస్తాను" అని బయటపడ్డాడు ప్రభాకరం...మళ్ళీ లో వున్నాడు గనక సగం బాధ వదిలింది. వెంటనే మళ్ళీ కలకత్తా ముసలాయన్ని కలుసుకున్నాడు.

"ఏం నాయనా ... మళ్ళీ వచ్చావు ?" అన్నాడాయన.

"మాంకాళమ్మ ఎవరో తెలుసా ?"

"నా అనుమానం కొజ్జా అనే...ఋజువు లేదు. పెద్ద వడ్డీ వ్యాపారస్తురాలు. దానికి ఆ పత్రిక శర్మకీ సంబంధం అనుకుంటాను. రాత్రిళ్ళు అతను వస్తాడు. దాన్నిబట్టి కొజ్జా అనే నా అభిప్రాయాన్ని మార్చుకున్నాను."

"అలాకాదు. ఇద్దరూ కొజ్జాలు కాకూడదా ?"

"నే నంతదూరం ఆలోచించలేదు...అదీ సంభవమే. వీళ్ళలో అలాంటివాళ్ళూ వుంటారు. వాళ్ళు స్త్రీ పురుష ప్రపంచంలో తిరుగుతూ హానిచేస్తారు. మాంకాళమ్మ ఆడ కొజ్జా...శర్మ మగకొజ్జా అంటే పుట్టినప్పటి సెక్స్ అదన్న మాట...ఎందుకు- ఏమయినా క్లూ దొరికిందా ?" అన్నాడాయన ఆతృతగా.

"శర్మకి తల్లిదండ్రులు లేరు. మాంకాళమ్మ పుట్టు పూర్వోత్తరాలు ఎవరికీ తెలియదు. శర్మ ఊరు కలకత్తా అనీ, మాంకాళమ్మ నిజాంనుంచి వచ్చిందనీ అంటారు."

"అయుండదు బాబూ! నా కొడుకుని ఈ పరిస్థితిలో చూసేకన్నా వాడు చనిపోవటమే మేలు" అన్నాడా ముసలాయన శిఖండి రహస్యం అర్జునిడికి చెబుతున్న భీష్ముడి లాగా బాధపడుతూ.

"కాదు బాబుగారూ...శర్మ ఈ వూరు రావటానికి కారణం తన జన్మని ఋజువుచేసుకొని మీఆస్తి తీసుకోటానికి అనుకుంటాను. ఈ లెక్కన మీకూ ప్రమాదముంది. వాళ్ళ నాయక్ ఆజ్ఞప్రకారం మిమ్మల్ని చంపవచ్చును. అనంతరం ఋజువు చేసుకొంటాడు. మీరు వీలు వ్రాశారా?"

"వ్రాయలేదు"

"దైవికం. వ్రాసుంటే ఈపాటికి చనిపోయి ఉండేవారు. మీరు మా ఇంటికి రండి. మా నాన్నగారు సంతోషిస్తారు. కొంతగొడవా తగ్గుతుంది" అన్నాడు ప్రభాకరం.

"అలాగే, నువ్వుపద. నేను వస్తాను." అన్నాడు ముసలాయన నిట్టూరుస్తూ...తనకొడుకు శర్మఅని తనకి అనుమానం ఉన్నది. తల్లిని చంపినవాళ్ళ పక్షమనీ అనుమానం ఉంది. ఆస్తికోసం వచ్చాడనీ అనుమానం ఉంది. కానీ ఈ శిఖండీ తనకొడుకుకాడు. ఈ బ్లాక్ మెయిలర్ తన కొడుకుకాడు. అందుకే పోలీసులతో ఏమీ చెప్పలేదు తను.

ప్రభాకరం గాంధీహిల్ దగ్గర మూడో పెంపుడెంటికి కాస్త దూరంగా కల్లికొట్టు బల్లమీద కూర్చుని సిగరెట్ ప్రాగటం ఆరంభించాడు. రాత్రి ఎనిమిదయింది. మూరాన

శర్మ వస్తున్నాడు. తనని అతను గుర్తుపట్టలేదు... ఎందు కయినా మంచిదని కీసీడలోకి జరిగాడు ప్రభాకరం. శర్మ సరా సరి ఆ కిల్లీకొట్టు దగ్గరకే వచ్చి కిల్లీకొట్టు అతనితో బాతా కానీ మొదలుపెట్టాడు. "ఏమయ్యా చార్మినార్ సిగరెట్ యిచ్చి కబుర్లుఏమయినాఉంటే చెప్పు" అన్నాడుశర్మఠీవిగా. కిల్లీ కొట్టు మస్తాను నవ్వి-

"మొన్నటికీ యియ్యాల్టికీ కబుర్లుఏముంటాయి. మాంకా ళమ్మ మా ఆయన్ని యిక్కడే నిలబెట్టేశానని తిడుద్ది. సిగరెట్ తీసుకుని తొందరగా వెళ్ళండి" అన్నాడు.

"మాంకాళమ్మ మాట అలా వుంచు. మస్తానూ! కుక్క లేమయినా యిటొచ్చాయా?" (పోలీసుల్ని నేరస్తులు అలా పిలుస్తారు)

"కుక్కలకేం సంబంధమండి... అయ్యేం రాలేదు. మా యప్ప మాంకాళి వడ్డీయాపారం సేసుద్ది... మొన్నొకాయన తన కూతుర్ని కంపెనీలోకి రికమెండీసను సెయ్యమని ఎంత బతిమాల్నాగాని ఈ ఆడోల్ల మొగోల్ల సంబంధ బాంధవ్యాల మీాద మంచిగానే నా కసిహ్హెం. యింకీలాటి పన్లంటే మా సెడ్డరోత. అని కసిరేసినాది అప్ప. మీా అదృష్టం అప్ప సెడ్డ పతివ్రత"

"అవునోయ్"

(14)

"అదేసార్ నేనంటుండీని- వడ్డీ యాపారం తప్ప మరోటిలేదు. అయినా ఈ సినిమాలొచ్చేక ఆడోళ్ళు అన్యాయులుగా సెడిపోయినారు." నిట్టూర్పు విడిచాడు మస్తాను.

"అదెలాగ?" ఆశ్చర్యంగా అడిగాడు శర్మ.

"సదూకునోర్నరు. మీాకు తెలియదా గాని...సినిమా ఆలుకి మూడుగంట్లాటకి ఎల్లని ఆడదాన్ని సిటీ మొత్తం మీాద నాకు చూపించండి. అలాగ ఎల్లిపోవడం టికెట్ కొనెయ్యడం...సినిమాలోనే జేరమాడ్డం. చేయడం! ... ఇద్దరాడోళ్ళు స్నేహితులైతే దానింటికి దీని రంకుమొగుడిని. మా మామయ్య దార్లో కనబడ్డాడు అని తీసుకొస్తుంది. దాని మొగుడు వెర్రిముండా కొడుకు. తనపెల్లాం లేదని ఆళ్ళిద్దరికీ మర్యాదా సేసేసి పడగ్గదిలో కూసుండబెట్టి పెల్లాంకోసం వెతికటానికి ఊరిమీాద బడతాడు. ఆడిపెల్లాం కజినుగాడితో ఇదే మాదిరిగా స్నేహితురాలింట్లో వుంటది. ఇది ముందా పర్పాటు. కొన్నాళ్ళు ముండా మొగుడి సంపాదనకన్నా రిప్రజెంటేటివుగాడి రూపమూ ఆడిపర్సూ ఆడోళ్లకి బాగుంటాయి. తరువాత విరుగూ పోరుగూలో పెడ్డ పోటీలొచ్చి బయటపెట్టేసుకుంటారు ఆడోళ్లు. అదయింతరువాత ఆబయుం సలితీరి, కజిన్లూ, మామలూ, సిన్నబ్బ, అల్లుడూ, పిన్నాం కొడుకులూ అందరూ వచ్చేస్తూ వుంటారు. ఆయాల్టికి మొగుడికీ తెలుస్తది. ఈడి సంపాదనకన్నా దాని సంపాదనే ఎక్కువ గనక ఆడు నోరుమూస్తాడు. లేదా సమాన అక్కులంటది ఆడది. నా గింజ నేనూ నీ గింజ నువ్వూ తింటున్నప్పుడు నీ ఎక్కువేటి? ఆళ్ళమాటలు ఈళ్ళమాటలు

నమ్మక అని కసిరేస్తాది...కన్నోరింటికి పోతానంటది. ఇకాడు మాటాడ్డు- సమాన అక్కులుగదా మరి. రోజూ సినిమాలు చూసి కూరలు కొనుక్కుని భాగ్యవంతులయిన ఆడోళ్ళు కరుసుకుంటాది. సేదా ? అని సేస్తున్నారు...పదుకల్లా ఇళ్ళకి సేరతారు. బెజవాడ సుట్టుపక్క ఊళ్ళనించి యిలాటివాళ్లు తెగవస్తారు రోజూ. అళ్ళకీ, పోలీసులకీ మామూలుంటది. అళ్ళకి బేరాలు మాట్టాడే రిచ్చావోళ్లు బ్రోకర్లు. హోటలోళ్లు నర్సింగుహోములు రన్ను చేసేవోళ్ళు...కావల్సినంతమంది... నర్సింగ్ హోములు మరీ వీలండి. ఒకదానికి కడుపునొప్పంటది డాక్టరుకి తెలిసో, తెలియకో చేర్చుకుంటాడు. దాన్ని సూట్టానికి పిన్నాంలు, వదినమ్మలు, సెల్లెమ్మలు వచ్చేసి సినిమాలు సూసి నాలుగు డబ్బులు సంపాదించి మరీ పోతారు. వూళ్ళోవున్న సెనిమిటి బరతలు- పాపం మా ఆడం గులు ఆస్పత్రిలోవున్న అల్ల ఒదిన్ని సూట్టానికి వెళ్లారు అని సెప్పుకుంటూ పాతేర్ల ఆడంగులతో మజా ఉదా యిస్తారు. పెల్లాం కొత్తసీరతో మల్లెపూలతో దిగుతాది. ఈ సీర మా పిన్నాం కొనిపెట్టింది. ఈ వొందా రూపా మాపాయులూ సేతులో పెట్టింది. అని కులుకుతూ సెప్తుంది. ఆడి రామాయనం బయటపడకుండా అమూ జాగర్తగానే ఉంటాడు. ఇదీకత" అన్నాడు మస్తాను.

"అవునయ్యా మధ్యలో సినిమాలు ఏం చేసినయ్" అన్నాడు శర్మ.

"కడ తా యని రాముడికి సీతేటవుద్దంటూ రేటండీ... యిపుడు సినిమాలో మూడొంతులుఆడోళ్ళేగదండీ.ఆదోరం

మాత్రం మొగుళ్ళతో మళ్ళీవత్తారు. కంపెనీ ఓనర్లు తమ సరుక్కి ప్రశారం ఆడే సేసుకుంటారు. కాలేజి పిల్లలు స్టయిలుగా ఆడే శేరం సెటిలు సేసుకుంటారు. సిల్లరకర్చు ఆడోళ్ళకీ ఎక్కువయి పోనాది మరి. కుటుంబనియంతరణ వున్నెమా అని ఆ బయం అసలేలేదు...గరబ్రసానం నాయవేగందా? పోనీ పిల్లాడు పుట్టినా...పిల్లలమీద అమెరికాయినించి పండు తెచ్చి తినేసి సేవసేసే ఆశ్శరమాలు ఉన్నాయ్...కిల్లీ కొట్టోడు ఈడికేం తెలుస్తదని కొట్టి పారేయకండి...జరుగుతున్నకతే ఇది"

"మొగోళ్ళు లేకుండా ఆడోళ్ళు ఏం చేస్తారయ్యా"

"మొగోడు ఉంటాడండి - ఆడు రాజమండ్రీనుంచీ బెజవాడ వస్తాడు. బెజవాడవాడు రాజమండ్రీ ఎలతాడు. ఆడిపెళ్ళాంకత ఆడికి తెలియదు - ఈడిపెళ్ళాంకత ఈడికి తెలియదు. సంసార్లే ఇలా సేత్తావుంటే కంపెనీ నంజల్ని అనకూడదండి. ఆళ్ళు పొట్టకూటోళ్ళు. ఆళ్ళపొట్టల్ని ఈ సంసారోళ్ళు కొడుతున్నారు. పోలీసులు ఇయేంసూడరండీ. కంపెనీ వోళ్ళని పట్టిగెడతారు...సినిమాసూడందే ఈళ్ళకి నిదరపట్టదండి" అన్నాడు మస్తాను...ఒకోమాటా విడిగా అంటూ:

"ఇంతకూ కంపెనీవాళ్ళే మంచివాళ్ళంటావు?"

"అబ్బెంతర వేంటండి"

"పోలీసులు పొరపాటు చేస్తున్నారంటావు?"

"అబ్బెంతర వేంటండి"

"మరిప్పుడేం చెయ్యాలి ?"

"తిన్నగ ఎలిపోండి అప్పుదగ్గరకు ... ఇలాటోళ్ళతో పోలిస్తే అప్పుసెడ్డ పతివ్రిత...మీా అదృష్టం. ఎల్లండిసార్" అన్నాడు మస్తాను.

శర్మ వెళ్ళిపోయాడు...[illegible] మీాద కూర్చున్న ప్రభాకరం సోకేళా పోజుతో వెల్తురులోకొచ్చి మస్తానువంకచూసి కన్నుగీటి-

"ఎవరోయ్ ఆ సెడ్డపతివ్రిత ?" అన్నాడు వంద రూపాయలనోటు పైకితీస్తూ.

"తమరిదేవ్వూరండి" మస్తాను అడిగాడు.

"కాకినాడ ఆఫీసు పనిమీాద వచ్చాను...ఎందుకు ?"

"అలా చెప్పండి...మాంకాళమ్మ పతివ్రాతేటండి నాశార్థం మీారు కొత్తోరు గనక..."

"ఇందాక నువ్వే అన్నావు గదయ్యా"

"అన్నానుండి...శర్మ రాంగానే తవురు సీకట్లోకి జరగటం చూసి...ఈడినీ ఈడిరాతల్నీ ఎరుగున్నారేమో అనుకున్నాను"

"రాతలేమిటి ?"

"ఈడు పత్రికెట్టి ఆల్లనీ ఈల్లనీ గురించీ అవాకులూ సివాకులూ రాత్తాడు. అది తెలుసనుకున్నా లెగండి"

"మరి పతివ్రాత సంగతేమిటి?"

"అది పతివ్రాత కాకపోతే ఏటి సేస్తాదండి ?"

"అంటే"

"అయ్యా...అది ఆడదిగాదండి. ఈడు మొగోడూ కాడండి. ఆయమ్మ పతివ్రాతే...ఈడు పెద్దమనిసే..."

"మరి నువ్వు అన్నావుగా"

"అయ్యా...మాంకాళి దగ్గర నేనప్పు తీసుకున్నానండి...అందుకని...ఏం సెయ్యాను సార్...గంప సంసారం... మా ఆడది పూర్వోత్తరం మనిషి...సైసంపాదన సేత కాదండి"

"అందుకని విచారం లేదుగాని...ఈ మాంకాళమ్మ వడ్డీ వ్యాపారమేనా ? ఇంకేమన్నా చేస్తుందా ?"

"చిత్తం, ఆ ఊసులన్నీ తమకెందుకండి ?"

"ఊరికినే...కాకినాడ నుంచి వచ్చాను. చూడూ మూడురోజులుంటాను మరి..."

"అయ్యా, మాంకాళమ్మ హైదరబాదనుంచి యీడికీ యీడినుంచి హైదరబాదకీ పిల్లల్ని సేరేత్తదండి"

"ఆడపిల్లల్నా"

"సిత్తం...ఆడపిల్లలయితే పరవాలేదు అర్థమవుతాది. మగగుంటన్నా కొడుకుల్ని కూడా సరపరా సేత్తది. అదే అర్థం కాటంలేదు.

"మస్తానూ... అదేగదూ నీ పేరు"

"అవును సార్"

"నీ అప్పు ఎంత ?"

"రెండొందలు సార్"

"అది నేనిస్తానుగాని... తెలిసింది చెప్పు దాచకు"

"రెండొందలు ఎందు కిత్తారుగానండి... నేను తమరికి ఆడోళ్ళని సప్లయి సేయలేనండి"

"అక్కర్లేదు, సమాచారం చెప్పుతేచాలు"

"ఇంతకూ తమరెవరు ?" అనుమానంగా అడిగాడు మస్తాను. ప్రభాకరం అతని చెవులో ఏదో చెప్పాడు. ఆ మాటతో కట్టెలా బిగుసుకుపోయిన మస్తాను కొంచెంసేపటికి తేరుకొని-

"క్షమించాలి. ఇందాక ఏదేదో వాగాను" అన్నాడు.

"అవన్నీ నిజాలయినప్పుడు నీకు భయం దేనికి ? మాంకాళమ్మ సంగతి చెప్పు" అన్నాడు ప్రభాకరం.

"నాకు తెలుసండి. పాపం దాగదండి. అల్లా దయవల్ల ఈ గోరకలి ఆగితే సాలండి... మొగపిల్లల్నీ ఆడపిల్లల్నీ తీసుకెళ్ళి హైదరబాదులో ఖోజాలు చేస్తారటండి... మొన్న మాంకాళి కొంద ఖోజాలతో ఉరుదూలో మాట్లాడితే ఇన్నానండి. నాకు ఉరుదూ రాదనుకున్నారండి" గబగబా చెప్పేసి నీరసపడిపోయాడు మస్తాను.

"మరి ఈళ్ళిద్దరూ హిజ్రా లేకదా ? మరి ఏం చేస్తారు?"

"అయ్యబాబో...అడక్కండి. ఆళ్ళలవ్వ ఈడదాకా వినబడుద్దండి. ఆడా మొగా అంతల్లరి సేయరు సార్...ఈళ్ళదంతా యాక్సనండి...కిటికీలోంచి సూత్తే? పకపకలూ ఇకఇకలూ - తినడాలూ వాగడాలూ...బజారు చివరకి వినబడేలా యాక్సను సేస్తారండి...అసలు సేసేదేం లేదు" సిగ్గుపడుతూ చెప్పాడు మస్తాను.

"ఇప్పుడు నాకో ఆడపిల్ల-అంటే చిన్నపిల్ల గాదు-కావాలంటే ఎల్లా ?"

"నేను తీసుకెడుదునుగాని - నన్ను నమ్మదండి: మాంసెడ్డ గడుసుది. కూసేపటికి...కంపెనీసిలకా దానిలనూ ఒత్తారండి...అప్పుడు ఎల్దురుగాని"

"వాళ్లెందుకు ?" ఆశ్చర్యంగా అడిగాడు ప్రభాకరం.

"ఇయ్యన్నీ తమకు తెలియదా సార్...ఆడా మొగా ప్రేమించుకుంటుంటే శర్మగోమూ పూంకాళీ సూత్తారండి...అప్పుడు ఎర్రికేకలు ఇంకా ఏత్తారండి...ఇది తెల్లాళ్లూ జరిగే బాగోతమే" అన్నాడు నిట్టూరుస్తూ మస్తాను.

"అయితే అవసరం లేదు - నువ్వు జాగ్రతగా చూస్తూ ఉండు-పదయింది. రేపు నేను వస్తాను. మిగతా కబుర్లు చెబుదువుగాని" అని అతని వీపుతట్టి ముందుకు నడిచాడు ప్రభాకరం. అతనిచ్చిన వందరూపాయల నోటూ చూసుకుంటూ ఉండిపోయాడు మస్తాను.

# 8

"పిల్లలు ఇంటికి రాకపోతే అలా కూర్చుంటారేమిటి తండ్రీ కొడుకులూ ?" దాదాపు ఏడుస్తూ అన్నది సీతమ్మ గారు. వెంకటా్రమయ్యగారికి ఖంగారుగా ఉన్నదిగాని ప్రభాకరం దాచాడని అనుమానం - సరోజినికి తన హిందూ్రి ఫ్రెండ్స్ తీసుకెళ్ళారేమో అని నిబ్బరం. వాళ్ళను గుర్తించేందుకు తను ఫొటోలు పంపింది.

ఎటొచ్చీ ఏనిబ్బరంలేనిది రామారావుకీ సీతమ్మగారికీ. రామారావు పదితడవలు తిరిగి వచ్చాడు స్కూలు చుట్టూ... సీతమ్మగారు ఆపూట వంట చెయ్యకుండా అలాగే కూర్చుంది. పదకొండోసారి రామారావు వీధిలోకి రాగానే ప్రభాకరం ఎదురుపడ్డాడు. తమ్ముడిని చూడగానే రామారావు దుఃఖంతో సంగతిఅంతా చెప్పాడు. ప్రభాకరానికి ఆ క్షణంలో రామారావుకి సంగతి చెప్పేద్దామనిపించింది. కాని అన్న ఆనందంతో విషయం అందరికి చెప్తాడు. సరోజిని వినకూడదు ఇది. కనక ప్రభాకరం ఆశ్చర్యం ఆదుర్దా నటిస్తూ ఇంట్లోకి వచ్చాడు. సరోజినికూడా పడగ్గదిలో నిల్చుని ఉన్నది.

"అసలు పిల్లలు ఇంటికి రానేలేదా ?" అన్నాడు ప్రభాకరం ఎవర్ని ఉద్దేశించిందీ తెలియకుండా.

"రాలేదురా ... రోజూ రాగానే మళ్ళీ ఆటలకి పోతారుగదా, అలాగే వెళ్ళారనుకున్నాను నేను. వాళ్ళప్పు

ఏమీ చెప్పలేదు. ఏడింటికి పిల్లలు రాకపోతే నేనే అడిగాను...అప్పుడుకూడా ఆవిడకి బాధలేదు. ఇంతలో నాన్నా అన్నయ్యా ఒచ్చారు. నీకోసం చూస్తున్నాం. పసివెధవలు ఏమయ్యారో కదా?" అంది సీతమ్మగారు ముక్కు చీదుకుంటూ.

"ఊరుకోఅమ్మా. ఆవిడకిలేని ఆదుర్దా నీకెందుకు?" విసుక్కున్నాడు ప్రభాకరం.

ఆ విసుగుదలతో వెంకట్రామయ్యగారికి విషయం అర్థం అయింది. సీతమ్మగారుకూడా ఏదో గ్రహించింది. రామారావుగూడా ఒకప్పుడు అయితే గ్రహించేవాడే... ఇప్పుడాతని బుర్ర పనిచేయటంలేదు. సరోజిని మాత్రం ప్రభాకరం మాటలకు ఏడుస్తూ-

"నాకు ఆదుర్దాలేదా? అలా ఎవరుచెప్పారు? నా పిల్లలు కనపడక నే నేడుస్తుంటే?" అన్నది. ఆ మాటలూ దుఃఖమూ చాలా కృత్రిమంగా తోచాయి అందరికీ. ఆఖరికి రామారావుకూడా ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడు. సరోజిని గతుక్కుమంది. తనన్నమాటలలో పొరపాటు ఏమీ లేదు. దిక్కుమాలిన పోలీసు కుటుంబం అనుకుందిగాని... అక్కడనుంచి గదిలోకి వెళ్ళిపోయింది.

"అమ్మా ఆకలేస్తుంది" అన్నాడు ప్రభాకరం.

"వంట చేయలేదు" దిగాలుగా అంది సీతమ్మగారు.

"పోనీలేమ్మా...గుడ్లు ఉంటే ఆమ్లెట్లు వేసిపెట్టు ఈ పూటకి చాల్లే" అన్నాడు ప్రభాకరం బిగ్గరగా. కోడిగుడ్లు

పేరువింటే సరోజిని బయటకు రాదని అతనికి తెలుసు. నిట్టూర్పు వదిలిలేచిన సీతమ్మగారి వెంట అందరూ వంటింట్లోకి వెళ్ళారు.

రామారావు తండ్రిగదిలోకి వెళ్ళి పడుకున్నాడు... అంటే ప్రభాకరానికి ఏదో తెలుసన్నమాట...ఏమిటది? పిల్లలు జాగ్రత్తగానే ఉంటారు. లేకపోతే అంత తాపీగా ఉండడువాడు. ఈ ఊహారాగానే రామారావు నిశ్చింతగా నిద్ర పోయినాడు.

ప్రభాకరం లోగొంతుకతో తండ్రికీ తల్లికీ జరిగిందంతా చెప్పాడు. అన్నీ విన్న వెంకట్రామయ్యగారు-

"కలకత్తా పంతులుగారి కుటుంబ కథ విన్నావుగా... నా సర్వీసులో నేను ఖూజ్జాల్ని పట్టుకోవాలని చాలా ప్రయత్నించాను. ఈ శర్మసంగతీ మాంకాళి సంగతీ నాకు తెలియదు. వీరయ్యకి అనుమానం ఉండేది. కాని సర్వీసు పూర్తయింతరువాత... నేను ఆ విషయమే మర్చిపోయినాను" అన్నాడు.

"మీా కసలు ఆ ఖూజ్జాలమీాద అనుమానం ఎలా కలిగింది?

"కలకత్తాపంతులుగారి కథ విన్నాకనే. అదివరకు ఖూజ్జాలంటె దైవోపహతు లనుకునేవాడిని... వాళ్ళంత క్రూర కర్ములు సృష్టిలోలేరు. వాళ్లు హంతకులకన్న దుర్మార్గులు... నల్లతంబి అని ఒక మాలీసువాడుండేవాడు" ఇక్కడనుంచి ఇంగ్లీషులో చెప్పారు వెంకట్రామయ్యగారు.

"ఆ మాలీసునాడు...ఖొజ్జాఅని చాలామందికి తెలి యదు. వాడి మాలీసుకి అప్పట్లో చాలా డిమాండుఉండేది. కొందరు ఆడవాళ్ళుకూడా చాటుగా అలవాటు పడ్డారు వాడి మాలీసుకి. ఆరోజుల్లో ఒక హత్యజరిగింది...అనుమా నించిన భర్త చంపాడని పోలీసులం అనుమానించాం. నా ఉద్దేశ్యమూ అదే. కాని కలకత్తాపంతులుగారి కథ విన్నాక ఆస్త్రీకి మాలీసు అలవాటుందని తెలిశాక - నల్లతంబిమీద నిఘావేశాం. వాడు ఖొజ్జాఅని తేలింది. కాని వాడే హత్య చేసినట్లు ఏఋజువూలేదు. అందుకని అప్పటికి ఊరుకొన్నాం. మరో నెలరోజుల్లో మరోహత్య జరిగింది. ఆ అమ్మాయికి పెళ్ళికాలేదు. పోలీసులకి ఏ హేతువూ దొరకలేదు...కాని ఆమె జననేంద్రియాన్ని ఘోరంగా చిదిమివేసి గర్భకోశాన్ని చిందర వందర చేయటంవల్ల మృత్యువు సంభవించిందని పోలీసు డాక్టరుచెప్పాడు. ఈతడవ నూనెసీసా వేలిముద్రలూ దొరికినయ్ - నల్లతంబిని అరెస్టు చేశాం. వాడు తననేరాన్ని ఒప్పుకున్నాడు..."

"ఏమని ?"

"ఆడవాళ్ళు చాటుగా నగ్నంగా, మాలీసుచేయించు కునేవారుట. ఎటోచ్చీ వీడు ఖొజ్జాగనక భయంలేదనే ఉద్దేశ్యంతో - కాని అమోఘమైనవాళ్ళ స్త్రీత్వాన్ని చూడ గానే వీడికి కసి బయలుదేరేదట...ఆ కసిమూలంగానే ఈ హత్యలు చేశానని వాఙ్మూలం ఇచ్చాడు. వాడు జన్మఖొజ్జా కాడు. హైదరాబాదులో ఒక అరవ ఆఫీసరుగారి కొడుకట. వాడిని నాయక్ ఎత్తుకుపోయి ఖొజ్జాగా మార్చా

డట. అప్పటినుంచీ తనఖర్మ ఇలాగయిందని వాపోయాడు. తను తండ్రిదగ్గరఉంటే తన స్థితిని ఊహించుకొని ఏడిచాడు. తన మనస్సులో తీరనికామం, తన అసమర్థత కలిసి తనను హంతకుడిగా మార్చాయన్నాడు. తను చనిపోవటం చాలా మంచిదన్నాడు...వాడి వాఙ్మూలం తరువాత అందరూ బాధ పడ్డాం. వాడి చివరికోరిక ఏమిటో తెలుసా ? కోడిని తినాలని.. ఇన్నాళ్ళు తను పాటించిన వెధవ ఆచారాల్ని వదలి కోడిని తిని రామనామం చేసుకుంటూ చచ్చిపోతానన్నాడు...అది అయింతరువాత నా సర్వీసు వున్నంతకాలం నేను ఛోడ్డాల్ని కని బెడుతూనే వున్నాను కాని లాభంలేకపోయింది. భగ వంతుడు నా కుటుంబంలోనే చిచ్చు పెట్టాడు" అన్నారు వెంకట్రామయ్యగారు.

"లేదునాన్నగారూ! ఇప్పటికి మనం అదృష్టవంతులం. ఇంట్లో అందరం చచ్చే స్థితి తప్పింది" అన్నాడు ప్రభాకరం.

"అసలీ పాడు సంబంధం ప్రారబ్ధంకొద్దీ వచ్చింది" విసుక్కుంది సీతమ్మగారు.

"ప్రారబ్ధమేమరి ?...కంపెనీ బాలమ్మ మనమడు ఎండ్రిను తాగి చనిపోయాడు...ఏంపాపం చేశానని దేముడు నా కీశిక్ష వేశాడు అని ఏడిచింది. మొత్తం పోలీసుస్టేషను కొయ్యబారింది. అది చెయ్యని పాపంలేదు. హ్యామన్ ఫ్లెష్ మీాద బ్రతికింది. ఇంకా ఎన్నో ఘోరాలు చేసింది. చివరకి మనమడు కూడా ఎండ్రిను తాగి చనిపోయాడు మొన్న.

అప్పుడు దానికి శిక్ష?...ఏంపాపంచేశానని దేముడు నాకీ శిక్ష వేశాడు. అని? అలాగే ఎప్పుడేం పాపంచేశామో? నల్లతంబి ఉరిపాపం ఇదేనేమో? పోలీసులు చేసేది పాపమేనమ్మా ...... దేముడి న్యాయస్థానంలో శిక్ష లిలాగే వుంటాయి...వాడు మహాచెడ్డ జడ్జీ" అన్నాడు ప్రభాకరం వేదాంతిలాగా.

"సరేలే, పిల్లలు బెంగపడరు కదా?" అన్నాడు వెంకట్రామయ్యగారు.

"లేదులెండి...రేపు పదింటికి కలకత్తా పంతులుగారు వస్తారు...అప్పుడే ఈవిడగారు ఉత్తరం అందుకొంటుంది" అన్నాడు ప్రభాకరం.

ఆ రాత్రి తెల్లవారింది......పదిగంటలు అయింది. సరోజిని కాఫీ త్రాగి ఏమీ జరగనట్టుగా పోస్టాఫీసుకి వెళ్ళి ఉత్తరం తెచ్చుకుని గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది.

"కలకత్తా పంతులుగారా! రండి రండి అన్నాడు వెంకట్రామయ్యగారు చదువుతున్న పేపరు కిందపెట్టి.

"నమస్కారం...పేపరు విశాషాలేమిటి?" అన్నాడు పంతులుగారు నవ్వుతూ.

"ఏమున్నాయ్, కమ్యూనిస్టుపార్టీ ఎన్ని రంగులు మార్చిందో అన్న విషయాన్ని ప్రధాని ధృవీకరించింది. ముత్యాలంపాడు సాములోర్ని అరెస్టు చేశారు. విశ్వనాధ

వాళమీాద చర్చ జోరుగా ఉంది. అవన్నీ అలా ఉంచండి. మీారెలా ఉన్నారు ?"

"ఇలా ఉన్నాను...నిన్న మీావాడొచ్చి విషయాలన్నీ చెప్పాడు...చాలా విచారకరం"

"కాఫీ తీసుకోండి, చాలా రోజుల కొచ్చారు" అంది సీతమ్మగారు లోపలినుంచి వస్తూ.

"బావున్నావా సీతమ్మతల్లి...ఇంతకూ నీ కొడుకు లెక్కడ ?"

"వస్తున్నారండి" అని లోపలికి వెళ్ళిపోయింది సీతమ్మ గారు...రామారావు ప్రభాకరం వచ్చి అక్కడ కూర్చు న్నారు. సరోజిని భీకరంగా బయటికివచ్చి వాళ్ళ ఎదురుగ్గా నిలబడి-

"ఏం చేశారు ? పిల్లల్ని ఏం చేశారు ? చెప్పండి ?" అని అరిచింది. రామారావు లేచి సరోజిన్ని ఆపి-

"మతిపోయిందా ? పిల్లల్ని ఎవరేం చేస్తారు ! నోరు మూసుకొని లోపలికిపో" అన్నాడు.

"ఏమీా చెయ్యక పోతేనే...ఇల్లింత నిశ్శబ్దంగా ఉంటుందా ? పిల్లలు ఏమయిపోయిందీ మీాకు తెలుసు ! చెప్పండి ?" గర్జించింది సరోజిని.

"రాత్రినుంచీ ఈ కోపం రాలేదేం మీాకు...తెల్లా వాళ్లూ హాయిగా నిద్ర ఎలాపోయాడు ?" అడిగాడు

ప్రభాకరం వెటకారంగా. సరోజిని కొంచెం సేపు మాట్లాడలేక పోయింది.

"లోపలికి పద, ఏమిటీ రభస ?" విసుక్కున్నాడు రామారావు.

"నీకు తెలుసు...సీతమ్మే నా పిల్లల్ని దాచిపెట్టాడు నా పిల్లలు నాకు అవసరం " అరిచింది సరోజిని.

"నీ పిల్లలు నీకెందుకు అవసరం ?" అడిగాడు ప్రభాకరం.

"నా పిల్లలు నాకు కాకపోతే నీ కవసరమా ? చెప్పు ఎక్కడున్నారు పిల్లలు ?"

"రాత్రినుంచీ...నిన్న సాయంత్రంనుంచీ లేని ఆదుర్దా పొద్దున్నించీ లేని ఆదుర్దా ఇప్పుడెందు కొచ్చిందీ ? అని అడుగుతున్నాను" ప్రభాకరం తాపీగా అన్నాడు. ఈ రభసకి సీతమ్మగారు కూడా బైటికివచ్చి నిలబడింది.

"అవసరమే వచ్చింది. నా పిల్లల్ని నాకు ఇస్తావా ? పోలీసు కంప్లయింటు ఇవ్వనా ?"

"ఇవ్వండి...పోలీసు ఆఫీసరుగా పిల్లల్ని వెతికించే ఏర్పాటు చేస్తాను. అప్పుడుమాత్రం తీగలాగితే డొంక కదులుతుంది. అది గుర్తుంచుకొంటే మంచిది" దబాయించాడు ప్రభాకరం.

"అయినా నాపిల్లలు నాకు అవసరం... నేనూ నా పిల్లలూ వెళ్ళిపోతాం మీకు కిష్టంలేకపోతే..." అన్నది సరోజిని.

"పిల్లలు నీ ఒక్కరి పిల్లలేగాదు. నా పిల్లలుకూడా - వెడతావా? ఎక్కడికెడతావు?" కోపంతో చెయ్యి ఎత్తాడు రామారావు. సీతమ్మగారు పరుగెత్తుకుంటూ వచ్చి కొడుకుచెయ్యి పట్టుకుంది.

"ఆగమ్మా నువ్వు! వెళ్ళటానికేనా ఇది పెళ్ళిచేసుకున్నది. పెళ్ళయిన ఏడేళ్ళుగా ఇది పెడుతూన్న బాధలన్నీ సహించాను గుట్టుగా. ఆఖరికి పిల్లలకూడా తెలియకుండా సహించాను... దేవుడి పటాల్ని గబ్బిలో పారేస్తే నా స్తోత్రాలను ఊరుకున్నాను. కాసు ఉంగరం వెంకటేశ్వరస్వామి బొమ్మ ఉందని అవతల పారేయమంటే పారేశాను. రాత్రిళ్ళు నాకేదో వాసన నీళ్ళిచ్చి మత్తులో నాచేత దరిద్రప్పనులన్నీ చేయిస్తే సెక్సు మానియాలే అనుకున్నాను... దెయ్యాలతో భూతాలతో మాట్లాడుతుంటే? నాహాలూసినేషన్! అనుకున్నాను. కొంప అంతా అనుక్షణం నరకంచేస్తే నా ఖర్మ అనుకొన్నాను. ఇప్పుడు పోతుందట. ఎక్కడికి పోతుందో చూస్తాను వదులమ్మా" అన్నాడు రామారావు ఉద్రేకంగా.

"వద్దు నాయనా వద్దు. ఆడదానిమీద చెయ్యిచేసుకో రాదు" కొడుకును గుంజిగట్టిగా పట్టుకుని అంది సీతమ్మగారు.

"నీకు తెలియదమ్మా... ఉద్యోగంలో ఉత్తరం వచ్చినప్పుడల్లా దీనికి మతిపోతుంది... పిల్లల్ని బలి ఇవ్వటానికే... దీని ఆరాటం. ఇది మనిషికాదు దెయ్యం" తల్లిని విడిపించుకొని సరోజినిజుట్టు పట్టుకున్నాడు రామారావు.

సరోజిని ఎదురుతిరిగి ఒక్క తోపు తోసింది......
రామారావు గోడమీద పడినందువల్ల తల బొప్పి కట్టింది. అది చూసిన సీతమ్మగారు సరోజిని వంక అసహ్యంగా చూసి "ఇక్కడ నిలబడితే, చంపేస్తాడు. వెళ్ళు" అని కొడుకుదగ్గరకు వెళ్ళింది. అప్పటికే ప్రళయకాల రుద్రుడిలా లేచి నిలబడ్డాడు రామారావు.

పెళ్ళయిన ఇంత కాలంనుంచీ ఇలాంటి భీకర రూపాన్ని చూడని సరోజిని వీధిలోకి పారిపోయింది. అయ్యో అయ్యో అని మొత్తుకుంటున్న సీతమ్మగారిని వదలి భార్యని పట్టుకోవాలని పరుగెత్తబోయినాడు రామారావు.

"అన్నయ్యా" ప్రభాకరం అన్నగార్ని పట్టుకున్నాడు.

"ఫరవాలేదన్నయ్యా ఆమె ఎక్కడికిపోతుందో నాకు తెలుసు, నీవు శాంతించు."

"శాంతిస్తాను... ఇక శాంతించక చేసేదేముంది?" అని కూర్చున్నాడు రామారావు,

ప్రభాకరం సరోజిని గదిలోకి వెళ్ళి ఉరుదూ ఉత్తరాలన్నీ పట్టుకొచ్చి కలకత్తా పంతులుగారికిచ్చాడు.

"నాయనా! ఈ ఉత్తరాల్లో సారాంశం పిల్లల్నీ, భర్తనీ జననేంద్రియాలు చిదిమించేసి బహుచారా మాత సేవకి అర్పిస్తానని ప్రమాణం చేసిందట. ఆ విషయమూ, దానికి అనుసరించిన విషాలూ, విరుగుళ్లూ దెయ్యాలూ ఆత్మలూ వగైరా ప్రయోగాలూ మొదలైనవి" అన్నాడు ఆయన.

"మామయ్యగారూ! నాకు తెలుసు- మిగతా అందరికీ చెప్పండి" అన్నాడు రామారావు నీరసంగా.

"అందరికీ తెలుసనన్నయ్యా. ఇవ్వాళ పిల్లల్ని హైద్రాబాద్ పంపుదామని ఆమె ఉద్దేశ్యం. అందుకనే పిల్లల్ని దాచాను" అన్నాడు ప్రభాకరం.

"గ్రహించాను. మీరు యిప్పటికయినా తెలుసుకున్నందుకు సంతోషిస్తున్నాను. నాకు పెళ్ళినాటిరాత్రే అనుమానం తగిలింది. కాని ఏం చెయ్యను-" అన్నాడు రామారావు.

"మరి అప్పుడే ఎందుకు చెప్పలేదు? ఏదో ఒకదారి చూసేవాళ్ళం... పిల్లలు పుట్టేదాకా ఎందుకు తెచ్చుకున్నావు?" విసుగ్గా అన్నాడు వెంకట్రామయ్యగారు.

"ఇవ్వాళ మీ అంతటికి మీరే గ్రహించారుగనక సరిపోయింది. నేను ఆ రోజునే చెపితే... మీరు నమ్మేవారా? నాకు పైత్యం కుదుర్చు యిప్పించేవారా? లేదు, పైగా నన్నే కోప్పడేవారు. ఆమె కోడిని తినదంటే శాఖాహారి కాబోలు అనుకున్నాం. దేవాలయానికి రాకపోతే హేతువాది కాబోలు అనుకున్నాం. నేనేది చెప్పినా ఆమెమీద మీ సానుభూతివల్ల

ఆమె పక్షమే పుట్టాడేవారు" ఉద్వేగంగా అన్నాడు రామా రావు.

'అంతేనాన్నగారూ; అన్నయ్య చెప్పింది నిజం." ప్రశాం తరం అన్నాడు.

వెంకట్రామయ్యగారు పుట్టాడ లేదు.

"పోనీలే బాబూ... యిప్పటికయినా బయటపడ్డావు" అన్నాడు కలకత్తాపంతులుగారు.

"బయట పడ్డాను...ఏడేళ్ళ జీవితం వృధాపోయింది... ఇద్దరు పిల్లలుమిగిలారు. రెండో పెళ్ళివాడూ - పెళ్ళాంవదిలిన వాడూ అనేపేరుతో బయట పడ్డాను. ఇంతకన్నా ఆత్మహత్య నయం" అన్నాడు రామారావు.

"నాయనా...నీకేంఖర్మరా? మొగబిడ్డవి"విచారించింది సీతమ్మగారు.

"మొగవాడు మాత్రం జీవితానికి అతీతుడా అమ్మా... మొగవాడు బాధపడతాడు... మొగవాడూ సుఖపడాలని చూస్తాడు. ఇహ అది ఈగుమ్మంలోకి రాదు. రానివ్వను. అలా టప్పుడు నాగతేమిటి?"

"పశ్చాత్తాపపడి ఆ దిక్కుమాలిన వాళ్ళ స్నేహం మానితే రానివ్వటానికేం, ఆలోచించునాయనా" అంది సీతమ్మ గారు.

"నేనూ ఆవుద్దేశ్యంతోనే ఇన్ని సంవత్సరాలూ ఆమెకి అనుకూలంగా నడుచుకున్నాను. ఆమె మారలేదు. ఇహ మారుతుందనే ఆశా లేదు"

"ఎందుకని అన్నయ్యా"

"మొదటి రాత్రినుంచీ - ఈనాటివరకూ పురుష సంపర్కం అంటే మంట. అసలు స్త్రీ పురుష శారీరక బాంధవ్యం అంటే ఆమెకు తగని అసహ్యం...ఖొజ్జాలమధ్య ఉండేదే పవిత్రసంబంధం. ఇహ నేనేం సుఖపడ్డానో మీకు అర్థం అయి ఉంటుంది. నన్ను మొగవాడిని కాకుండా చెయ్యాలని - ఆమె ఎన్నో ప్రయత్నాలు చేసింది...ఒక విధంగా హింసించిందనే చెప్పాలి. ఆ హింస శారీరకంగా కూడా భరించేవాడిని. ఆమె హింసవల్ల జననేంద్రియంలోంచి నెత్తురు పడేది. అదీ సహించాను. మత్తుమందు ప్రయోగించేది...చాలారోజుల తరవాతగదా - నాన్నగారి గదిలో పడుకుంది? గర్భస్రావాలకి ప్రయత్నించింది...దబ్బనాలతో తన గర్భకోశాన్ని పుండు చేసుకుంది...ఖొజ్జాలు పంపించిన మందు నేను మార్చివేశానని కడుపుమీద బాదుకుంది. ఆ పిల్లలూ నాకన్న మొండివాళ్ళవటం వలన జన్మించారు. పుట్టిన తరువాత ఆమెలో మాతృప్రేమ లేదు. చంపటానికీ ప్రయత్నించలేదు. బహుచారా మాత వారసులుగా చేద్దామనుకుంది-వాళ్ళని తృతీయా ప్రకృతిగా మార్చేందుకు ఆరుసంవత్సరాలు రావాలిట - ఈలోగా నన్ను మార్చి .. తనూ నేనూ హైద్రాబాద్‌లో కూడా భార్యాభర్తలుగా

ఉండాలనుకుంది. ఆవిడచెప్పే సుఖాల వర్ణనకి...నిజంగానే పురుషత్వాన్ని విసర్జించాలనిపించింది కొన్ని సమయాల్లో... చివరకి విషప్రయోగం చేసింది. ఒక డాక్టరు మిత్రుడి సలహా వల్ల అదివరకే పాయిజన్ కొద్ది కొద్దిగా అలవాటు చేసుకున్నాను. గనక నామీద అది పనిచేయలేదు. గాలిలో ఏవో తేలుతుంటే వాటితో మాట్లాడేది...అవి దయ్యాలు. ఈ విధంగా విషభూత ప్రపంచంలో నే నెంతకాలం బ్రతకాలి ? మళ్ళీ ఆమెను క్షమించి ఆమెతో కాపరం చేయటం నావల్ల కాదు...పిల్లల్ని పెంచగలిగితే పెంచండి - లేకపోతే ఏ అనాధ శరణాలయంలోనో పారేయండి" అన్నాడు రామారావు.

ఎవరూ సమాధానం చెప్పలేదు.

## 9

రాత్రి పదయింది...బెజవాడ స్టేషనులోంచి బయట కొచ్చాడొక యువకుడు. జనం రద్దీ కాస్త తగ్గింది. రిక్షాలూ ఆటోలూ అక్కడక్కడా నిలబడిఉన్నాయి. స్టేషను బయట వెలుగూ వెన్నెలా నీడలు చిమ్ముతున్నాయి.

ఆ యువకుడు నిలబడి బీడీఅంటించుకుని యిటూఅటూ చూశాడు. అతన్ని చూసిన రిక్షావాడు ఒకడు దగ్గరకొచ్చి,

"అయ్యగారు, రిక్షా తెమ్మంటారా ?" అన్నాడు. ఆ యువకుడు అతన్ని పరిశీలనగా చూసి-

"కావాలి తీసుకురా" అన్నాడు.

"ఆ సంచీ యిలా యివ్వండి బాబూ. మీారేరండి, యిక్కడికి రిక్షా రానివ్వరు."

యువకుడు బీడీముక్క పారేసి అతనిదగ్గరగా నడిచి బయటికి వచ్చి రిక్షా ఎక్కాడు. హైదరాబాదువాళ్ళకి బెజవాడ రిక్షాలు ఎక్కడం సిగ్గు.

"యిదేమిటోయ్. ఈ రిక్షా యింతెత్తున ఉంది?" అన్నాడు.

"అయ్యా! తమరుహాయిదరాబాద్‌నుంచి వస్తున్నారా? అక్కడ యీాదులు ఎత్తుపల్లాలు గనక అలాంటి రిక్షాలుంటాయి. యిక్కడంతా సమానమే. అందుకనియిలావుంటాయి రిక్షాలు.కూర్చోండి, సుఖానికి ఈ వూరిరిక్షాలే బాగుంటాయి" అన్నాడు రిక్షావాడు.

యువకుడు రిక్షా ఎక్కి కూర్చుని మళ్ళీ బీడీ వెలిగించాడు.

"ఎక్కడికి పోవాలయ్యగారూ?"

"చెప్తాలే...ముందిక్కడనుంచిపద.నీపేరేమిటన్నావు"

"ఏటీ అనలేదండి"

"నీ పేరేమిటి?"

"వెంకటేశ్వర్లండి"

"అదేంపేరు పాడుపేరు... ఆపు రిక్షా దిగిపోతాను"

"అదేంటి? నా పేరు మీకు నచ్చకపోతే దిగిపోతారా?"

'ఏం దిగిపోక?'

'భలేవారే. యిదేం హైదరాబాద్ అనుకున్నారా జులుంసాగటానికి...? పేరునచ్చక దిగిపోతే రెండు రూపాయలిచ్చి మరీ దిగండి."

"ఎందుకివ్వాలి! నువ్వు గజం కూడా లాగలేదు. రెండు రూపాయలు ఊరికే యిస్తానా" దబాయించాడు యువకుడు.

"ఊరికే యివ్వటానికి ధర్మం చేస్తున్నారా! ఎక్కడికెళ్ళాలో చెప్పండి. అక్కడ దించేస్తాను. అప్పుడివ్వుదురుగాని" అన్నాడు వెంకటేశ్వర్లు.

"ఏమైంది వెంకటేశ్వర్లూ" అన్నాడు మరో రిక్షావాడు.

'శ్రీరాములూ ఒకతమాషా యిలారా; ఈ పెద్దమనిషికి నా పేరు నచ్చలేదట. అందుకని దిగుతాండట'

"నీ పేరుకీ, బేరానికీ ఏం సంబంధం? యిదేమన్నా ఇశాఖపట్నంకేసేమో" అన్నాడు శ్రీరాములు.

'పోనీ, శ్రీరాములు బండి ఎక్కండి' అన్నాడు వెంకటేశ్వర్లు.

'ఎక్కను'

'యిదేంటబ్బాబూ! ఆడిపేరూ నచ్చలేదా? నరశింహం బండి ఎక్కుతారా?'

'ఎక్కడను'

'ఆంజనేయులుబండి ఉంది, అదెక్కండి'

"ఏమిలేదు"

"ఈయన నా స్నేహితుడు కావాలేసురా. పుల్లిగాడి బండి వస్తోంది అందులో ఎక్కనుండి." అన్నాడు శ్రీరాములు నవ్వుతూ.

ఆ యువకుడు మాట్లాడకుండా పుల్లయ్యబండి ఎక్కి కూర్చున్నాడు. మిగ తారికా వాళ్ళ నవ్వులమధ్య పుల్లయ్యబండి రథంలానడవసాగింది. రోడ్లమీద జనం తగ్గిపోయారు. గోల్డెన్ కేఫుదగ్గర ఆడవాళ్ళు కనిపించారు.

"కంపెనీ ముండలు మొగోడిని బతకనివ్వరు" అన్నాడు పుల్లయ్య.

"అగ్గిపెట్టె కొనాలి, ఎక్కడన్నా ఆపు" అన్నాడు యువకుడు. కిల్లీకొట్లోంచి అగ్గిపెట్టె తెచ్చిచ్చి మళ్ళీ రిక్షా తొక్కసాగాడు పుల్లయ్య.

"ఏ పేపు వెళ్ళాలండి ?"

"పుల్లయ్యా... నేను ఒక మనిషికోసం తున్నాను ఎక్కడుంటుందో నాకు తెలియదు. ఈ ప్రాంతాల కంపెనీలకే తిరగాలి. అందులో వుంటుంది ఆ మనిషి" అన్నాడు యువకుడు.

"అయ్యబాబో... పెద్ద పనేనండి. ముందు బాలమ్మ కంపెనీకెల్దాంరండి" పుల్లయ్య ఉత్సాహంగా అని గబగబా తొక్కసాగాడు రిక్షా.

"నీ కీ వూరంతా బాగా తెలుసులాగుందే ?"

"ఈ వూళ్ళో పుట్టి పెరిగిన వాడిని. ఈ వూరు తెలియక పోవటం ఏమిటండి. సినిమాలు, కంపెనీలు లాడ్జింగులు అన్నీ తెలుసుబాబూ. మొన్నొక కుర్రాయన రిక్షాఎక్కి ఆస్తానకవిగోరింటికి పోనిమ్మన్నాడు. నాను సరాసరి సన్యాసిఅక్క-కంపెనీకి కొట్టుకెళ్ళినాను.ఆనాడు పెద్దయుద్ద వై పోయింది. ఆయనే అందరజోతికి తీసుకెల్ల మన్నాడు.నాను కమ్యూనిస్టోల్ల ఆపీసుకిఅట్టిగెల్లాను. ఇలాటిఅరదంకానిచోట్లన్నిటికీ తిప్పి ఆకాశవాణికి అట్టిగెల్లమన్నాడు. అదేటోనాకు తెలియలా.ఆయనే అడుగుతే సంగీతంపెట్టెఆఫీసు దగ్గరికి పోయినాడు.ఆకాశవాణి-అంటే సంగీతంపెట్టెఆఫీసుఅంటే నాకు తెలుస్తది. అయ్యోవో పొరపాట్లండి-మీరిప్పుడు కంపెనీలన్నార్గా మనకు తెలియన్దిలేదు." రిక్షా అతను ఉషారుగా సమాధానం ఇచ్చాడు.

"కంపెనీలు... సరే వెళ్లాలనుకో, ఆ మనిషి సంసారం చేస్తున్నదట... ఎలాగా అని?"

"అలా సెప్పండి... సంసార్ల ఆడోళ్ళు ఈది కెక్కుతుంటే మీకేలండి సిగ్గు! యింతకూ ఆ మనిషి సంసారిదా? కంపెనీదా?"

"సంసారిదే... కంపెనీలో ఉందేమో తెలియదు... ఆ మనిషి కావాలి."

"పేరేటండి... తమయిసయం నా దగ్గర బద్దరంగా ఉంటదండి. అనుమానించక సెలవీయండి"

"సరోజిని"

"సిక్కే... యింటికో సరోజిని... యీాదికో సరోజిని. కంపెనీకి యిద్దరు సరోజనులు... ఆ సరోజిని సంసారి అన్నారు కదా! పెనిమిటి పేరు తెలుసా?"

"రామారావు"

"అంతమాత్రాన తెలియదుసార్. అడ్రసుందా?"

"కేరాఫ్ పోస్టుమాస్టర్."

"అది వుత్తరాల యవ్వారంసార్. యిప్పుడు ఒకయింటికి అట్టుకుపోతాను. ఆ యిల్లుసంసారులదే. ఆయమ్మపేరు సరోజనీ కమలం... సూడండిమరి" అని పుల్లయ్య వేగంగాబండిలోక్కి సాగాడు. మళ్ళీ మొదలెట్టాడు పుల్లయ్య.

"సరోజిని చాలామంచిదిలెగండి... మీలాంటి గొప్పోరి దగ్గర తప్ప ఎదవపనులు చెయ్యరు. మొగోడు బద్దరంగా తిరిగొస్తాడు- ఆడికెత్తే... మిగతావోళ్ళు ఆసుపత్రి పాలు చేస్తారు... ఈయమ్మ శానామంచిది" అంటూ ఒక చిన్న డాబాముందు ఆపారు.

"ఏమిటి పుల్లయ్యా ఈ ఇల్లేనంటావా?" భయం భయంగా అడిగాడు ఆ యువకుడు.

"సరోజినమ్మ ఇల్లిదేనండి. అయ్యబాబో ... బెజ వాడలో ఇళ్ళు దొరికి చావనండి... దీనికే యాభయిరూపాయి లద్దె..." అని యువకుడికి చెప్పి-

"అమ్మగారూ...అమ్మగారూ" అని అరిచాడు. కొంచెం సేపటికి గాను తొడుక్కున్న లాంటి (స్త్రీ) తలుపు తీసుకొని బయటికి వచ్చి,

"నువా పుల్లయ్యా ? హు యిూజ్ హీ..." అంది తెలుగుని అమెరికన్ యాసతో మాట్లాడుతూ. ఆవిడ జుట్టు కత్తిరించి వుంది. రంగు పూర్తిగా నలుపు. చౌకబారు పౌడరు వాసన చెమటతో కలిసి తలుపు తియ్యగానే వ్యాపించింది.

"గుడ్ మార్నింగ్ మేడమ్‌గారూ...పాసింజరు ఒచ్చి నాడు" మెల్లిగా అన్నాడు పుల్లయ్య.

"తేంక్యూ పులయా దిగిరమ్మను"అన్నది ఆవిడ తెచ్చి పెట్టుకొన్న ఇంగ్లీషుయాసతో ఒత్తులులేని తెలుగు మాట్లాడుతూ.

"పేరు తెలియదు మేడమ్...ఎవరో సరోజిని కావా లంట. మన సరోజినీకమలం మేడమ్‌కోసం పట్టుకొచ్చాను. బాగా గుంజండి. నాలుగు రూపాయలు నాకివ్వాల మళ్ళీ పేచీపెడితే కాదు" అని పుల్లయ్య చెప్పి యువకుడిని దిగ మన్నాడు. విజయవాడలో దైన్యస్థితి స్పష్టంవుంది. చాలామంది విజయవాడంటే మురికి - ఫండులూ అనే అభిప్రాయంలో

వున్నాను. ఒకప్పుడు అవి వుండేవేమో మరి. ప్రస్తుతం విజయవాడ పక్కన నదీ - కొండలూ-పార్కులూ-చక్కని వీధులూ-మంచి భవనాలూ - పత్రికలూ-రేడియోస్టేషనూ-మహా రచయితలూ-నాస్తిక కేంద్రమూ- స్వాములోర్ల ఆశ్రమాలూ మొదలైన పరస్పర విరుద్ధాలతో సజీవమై కళకళలాడే పట్నం.

కాని ఆ డాబాముందు మాత్రం చాలా మురికిగా అసహ్యంగా వుంది. అరుగుమీదవున్న కోటును కాంకీలమధ్య ఎవరో నిద్రపోతున్నారు.

“పుల్లయ్యా అరుగుమీదెవరు?” అన్నాడు కాస్త సందేహంగా యువకుడు.

“ఆమె బర్తేనండి. రైల్వేలో పనిచేసి పించనీ పుచ్చుకొన్నాడు. ఆరి అమ్మాయే సరోజిని. ఎల్లుండి తవురు ఒచ్చేదాకా నేను ఇక్కడే వుంటాను.”

“పులయ్యా...లోపలికి రమను” అంది ఆమె. యువకుడు లోపలికి వెళ్ళాడు.

ఆ కొంచెం వెలుతురులో ఆమె గౌనుమీద పెద్దపెద్ద పూలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. ఆమె తలకు రంగు వేసుకోవటం వలన జుట్టు నల్లగా తెల్లగా లేకుండా ఎర్రగా ఉంది. మొహంనిండా సుద్దపౌడరు ప్రాముకున్నందువల్ల పెచ్చులు పెచ్చులుగా వుంది. పళ్ళు గారపట్టి వున్నాయి.

“వాటర్...కాఫీ...టీ...” అందామె.

"అవసరం లేదు"

"సూడండి. నాసుకంటె... బేబీ దగ్గరకే పోతే (పాతిక) పాతిక రుపీస్ హావుతుంది" అన్నది.

"సరే" అన్నాడు యువకుడు. ఇందులో సరోజిని ఎవరు ?

"బేబీ...కమ్ ఇన్" అంది గౌను ఆవిడ. బేబీవచ్చి గది గుమ్మంలో నిలబడింది. సామాన్యంగా చీర కట్టుకుని వుంది. అందం లేకపోయినా జాలి కలిగేట్లు వుంది.

"రండి" అని అతని చేతిని పట్టుకుని లోపలికి తీసుకు పోయి తలుపు గడియపెట్టింది బేబీ.

ఆ గది చాలా ఇరుకుగా... మెతక వాసనగా వుంది... బల్ల మీద సుద్ద పౌడరుతో పాటు గోడమీద జీసస్ క్రైస్ట్ శిలువమీద వేళ్ళాడుతూ తల వాల్చేసిన ఫొటో వుంది. దాని వంక వెగటుగా చూస్తున్న యువకుడిని,

"కూర్చోండి నిలబడే ఉన్నారు" అని నవ్వింది బేబి.

"నీ పేరు ఏమిటి ?"

"సరోజినీ కమలం. అమ్మ బేబి అంటుంది"

"నువ్వు మీ అమ్మలాగా గౌను వేసుకోలేదేం ? ఇంగ్లీషు మాట్లాడటం లేదేం ?" అన్నాడు అతను.

"అమ్మ కదో పిచ్చి...మేము క్రిస్టియన్లం అయినా మా తాత ముత్తాతలు తెలుగువాళ్ళే. నాన్న రైలులో

బొగ్గేసేవాడు. అప్పుడు రైల్వేలో ఎక్కువమంది ఇండియన్లు. అమ్మ ఇంగ్లీషులో మాట్లాడటం గొప్ప కుంటుంది. గొను తొడుగుతుంది. కాని ఆ ఆంగ్లోఇండియన్లు మమ్మల్ని దూరంగా వుంచేవాళ్ళు. మేం బార్బరస్ ఇండియన్లమని తిట్టేవాళ్ళు-అయినా అమ్మకీ, నాన్నకీ వాళ్ళంటే గొప్ప. రిటైరయినప్పుడు వచ్చినడబ్బు తాగేశాడు నాన్న. ఇక మాకు గతిలేదు. అసలు ఇది కులవృత్తి లెండి'' నిట్టూర్చింది ఆమె.

''వాకిట్లో వున్నది ఎవరు ?''

''డాడీయే...డాడీకి తెలుసులెండి...ఫరవాలేదు, కాఫీ తాగుతారా ?''

''మీ అమ్మ పాతిక రూపాయలంది''

''అవును. ఆదివారం చర్చికెళ్ళే గుడ్డలు చిరిగినయ్... పౌడరు అయిపోయింది. అమ్మ తలకి వేసుకునే రంగు అయిపోయింది... తక్కువ డబ్బుకి అమ్మవస్తుంది... మీరు ఏదో నిర్ణయించుకోండి. నా ఉడ్ బి హజ్బెండ్ డేవిడ్ వస్తాడు అంది బేబి- హజ్బెండ్ అనేమాట పరాయిమగవాడి యిన్స్పిరేషన్‌కి బాగా పనికివస్తుందని బేబీ అనుభవపూర్వకంగా తెలుసుకుంది.

''బేబి... డాడీకి ఫైవ్‌రూపీస్ కావాలట'' అరిచిందమమ్మీ బయటనుంచి. కూతురికీ భార్యకీ బేరం తగిలినప్పుడు జాన్‌కోటయ్యకి సారా తాగిరావటం మామూలు. అందుకే

ఏ, యువకుడుదగ్గరనుంచి అయిదు రూపాయలు తీసుకొని వాడికిచ్చి వచ్చింది.

"నీపేరు సరోజినియేనా?"

"చెప్పానుగా"

"మీది హైద్రాబాదా?"

"కాదండి విశాఖపట్నం... తరువాత ఈ వూరు వచ్చాం"

"మీరు హిందువులు కారా?"

"మొదట్లో మేము హిందువులమేనండి...మా గ్రాండ్ ఫాదరు పాలేరు... తరువాత మతంపుచ్చుకుని ఉద్యోగం తెచ్చుకున్నారుగదాండీ... ఎందుకు అడుగుతున్నారు" అంది జేబీ.

"నేను వెతికే సరోజినివి నీవు కావు. వాళ్లు హిందువులు. ఈ అయిదూ తీసుకో, వెళ్లొస్తాను."

"ప్రభువు రక్షించుగాక" అంది జేబీ చిత్రహింస తప్పినందుకు ఆనందిస్తూ.

యువకుడు పుల్లయ్యరిక్షా మళ్ళీ ఎక్కాడు. "ఏంటి సార్ సరోజినమ్మ వచ్చలేదా?" అన్నాడు పుల్లయ్య.

"ఈమె కాదోయ్... యింకో సరోజిని..."

"అలాగయితే యింకోసారి సూపిత్తా రండి" అని మసీదు సందులో ఒక పెంకుటింటియింటిని చూపాడు పుల్లయ్య.

"బూబమ్మగారూ"

"కోనై... నవ్వాపులయ్యా ... తూనమ్మక్ హరాం"

"యిశ్... సరోజనమ్మకోసం ఆద్మీ ఆగయా... మస్తానుగారెక్కడ?"

"మాధవరావూ మస్తానూ కలిసి లైను మీదికిపోతే బూతుపుస్తకాలమ్ముతున్నందుకు హైద్రాబాద్‌లో పట్టుకున్నారని యిప్పుడే కబురొచ్చింది. యింతకీ ఆద్మీ ఎవరు;" అంది బూబమ్మ.

"కొత్తాయన. నా మామూలు తెలుసుగా...పిలుస్తాను" అని రిక్షా దగ్గరికి వచ్చి-

"రండిసాబ్ ... బూబమ్మ సరోజిన్ని చూపిస్తుంది" అన్నాడు పుల్లయ్య. యువకుడు దిగాడు.

"ఆయియేసాబ్... సలాం...రండి" అంది బూబమ్మ ముసుగు సవరించుకుంటూ.

యువకుడు లోపలికి వెళ్ళి నాలుగు పక్కలా చూశాడు.

"సరోజినికోసమేగా. సరోజిన్...ఆవ్ నా సరోజిన్" అంది బూబమ్మ. ఒక పిల్ల వయ్యారంగావచ్చి యువకుడికి సలాంచేసి లోపలికి పిలుచుకుపోయింది.

(18)

గదిలో కిందనే పీచు పరుపువేసి మురికి ఖాలీసులు పెట్టారు. విరిగిన కుంపట్లోనుంచి సాంబ్రాణి ధూపం వస్తోంది.

"నీ పేరు సరోజినా ? మీరు ముసల్మాన్లు కదా ?" అన్నాడు యువకుడు.

"మా నాన్న హిందువేనండి. మా అమ్మ రెండో మొగుడు- మా నాన్న అంటే...అసలు మా నాన్నని ఎర గను...ఈ నాన్నే నాకు సరోజిని పేరు పెట్టాడు" అంది ఆమె.

"మీ నాన్న ఏం చేస్తాడు ?"

"సెక్సు పుస్తకాలూ-ఫొటోలూ అమ్ముతాడు - సిని మాలు కూడా అమ్ముదామనుకున్నాడు గాని పెట్టుబడి చాల దని వూరుకొన్నాడు...ఇప్పుడు అదే పనిమీద హైదరా బాద్ వెళ్ళి పట్టుబడ్డాడు పోలీసులకి...పాపం" అంది ఆమె.

"అయితే నువ్వు ఈపని దేనికి ?"

"మాకు ఖర్చు జాస్తీ అండి ... రోజువిడిచి రోజు అమ్మకీ నాకూ మాంసంకావాలి గదండీ...ధరలు ప్రియం అయినయి. సినిమాలు తప్పవు...ఘోషా ముసుగులు చిరిగి నయ్. ఇంకా ఎన్నో ఖర్చులు...అయినా మాకు తప్పేమిటి? మానాన్న సెక్సు పుస్తకాల్లో- అబ్బ బలే వుంటుంది లెండి."

"మీ ఊరు ఇదేనా ?"

"కాదండి, గుంటూరు. అమ్మని తీసికొచ్చి ఈ వూళ్లో ఉంటున్నాడు నాన్న."

"అయితే సరోజినీ-నీకు పెళ్ళయిందా?"

"అయిందండి."

"ఎవరు నీ భర్త?"

"సెకండ్ హాండ్ పుస్తకాలబండి వేస్తాడు. హత్య కేసులో ఆడిని జైలులో పెట్టారు పోలీసులు."

యువకుడు ఉలిక్కిపడి సర్దుకున్నాడు. ఆ యువకుడు ప్రభాకరం అనీ తన భర్తని జెయిలులో పెట్టింది అతనేననీ ఆమెకు తెలియదు. అలాగే వుల్లయ్యకి తెలియదు. కావా లనే తన రిక్షా ఎక్కాడనీ... పేరు గిట్రా కాదనీ అతనికి తెలియదు.

"పాపం నిజంగా హత్య చేయలేదు కాబోలు" అన్నాడు మారువేషంలోవున్న ప్రభాకరం.

"మీ పేరేమిటండి"

"సుబ్బారావు..."

"సుబ్బారావుగారూ, ఆ కొట్టోడు రోజూవచ్చి నన్నూ మా అమ్మనీ అనుభవించేవాడండి. అది సహించలేక ఆడిని మా ఆయన పొడిచాడు. పోనీ డబ్బిస్తే- అది వేరే విషయం. ఊరికే రమ్మంటే ఎవరొస్తారు చెప్పండి. అల్లాతోడు- ఆయన మంచివాడేనండి" అంది సరోజిని.

"చంపాడుగా. మరి పోలీసులు పట్టుకున్నారు తప్పే మిటి ?"

"ఆళ్ళడూటీ ఆళ్ళది...కాని ఋజువు లేక రెండేళ్ళే ఏశారండి."

లేపు రికార్డులు లేనందుకు విచారించాడు ప్రభాకరం.

"కంపెనీల్ని ఎమర్జెన్సీలో పట్టేసుకుంటున్నారండి ... అందుకని సంసార్ల మధ్యనే అయితే భయంలేదండి" అన్నది సరోజిని.

"సంసార్లు ఊరుకుంటారూ ?"

"ఆళ్ళకి తెలుస్తాదేటండి. ఏదో రాత్రిపూట గుప్చు చప్పంగ అయిపోతాదండి...అయినా కొందరు అల్లరిచేస్తానే ఉంటారు. ఆళ్ళకెందుకు చెప్పండి-అయినా శీనివాసులుకంటె సెడిపోలేదుగా."

"అతనెవరు ?"

"ఓ...మీదీవూరు కాదుగా, అందుచేత మీకు తెలవ లేదు, దొంగనోట్లు మారుత్తాడండి."

"...ఎట్లా ?"

'ముందు ఒకావిడ వుంది. ఆవిడ పెద్దపెద్దోళ్ళకి పార్టీ లిచ్చి అయిదు రూపాయలకి పాతిక రూపాయలని బేరం కుదు రుస్తుంది...పార్టీని ఏ నంబూరుదగ్గరో వుండమని రాత్రిళ్ళు కారేసుకొని వెళ్ళి మంచి డబ్బుకి నాలుగురెట్లు దొంగనోట్లు

ఇస్తారండి. కాసుకొని ఆళ్ళు ఎళ్ళంగానే పోలీసు వేషాలతో మరో ఇద్దరొచ్చి పార్టీని బెదిరించి ఆ డబ్బు గుంజుకొంటా రండి. ఆ యిదంగా శీనివాసులు బాగా సంపాదించాడు '

'ఆవిడ పేరేమిటి ?'

'నందనం'

'బాగుంది, ఇవన్నీ నీకెలా తెలుసు ?'

'మా ఆయన పోలీసువేషం వేసి వాళ్ళని హడలగొట్టి నందుకు వందరూపాయలు మంచిడబ్బు ఇచ్చేవాళ్ళు.'

'ఇప్పుడు ఈ ఆదాయమేనా ! మరేంలేదా ?'

'ఉందండి.'

'ఏమిటది ?'

'శర్మగోరని...ఆయన నా దగ్గరకొచ్చిన పెద్దమనుషుల ఫొటోలూ నా ఫొటోలూ కలిపి ట్రిక్కు చేస్తాడు. అలా చేయనిచ్చినందుకు డబ్బు యిస్తాడండి ... మీరు పెద్ద మనిషికాదుగా భయపడకండి' అంది సరోజిని నవ్వుతూ.

"నేను పెద్దమనిషిని కాదని నీకెలా తెలుసు?"

"మీ వాలకమే సెపుతాదండి. ఒచ్చినకాడ నుంచి ఇంటినీ నన్నూ ఒకటే సూత్తున్నారు. పోలీసూ - దొంగా అట్టా సూత్తారండి. పోలీసు కారు గనక దొంగ అయుండాలి. అయితే మా జాతే. అసలు బయంలేదు."

"నువ్వు దొంగవుకావుకదా."

"దొంగతనం నేను చెయ్యానులెండి. కుందనం ఇంట్లో వుండే గాంధీ మాలావు జేబుదొంగ. సాయంతరం లక్ష్మి టాకీసు దగ్గిరా రామాటాకీసుకాడా... మేమిద్దరం కొత్తగా పెళ్ళయిన దంపతుల్లాగా ఉషారుగా నుంచుంటాం. అప్పుడాడు మా నైసుగా జేబులు కత్తిరించేస్తాడు. పోలీసోళ్ళు అస్సలు కనిపెట్టలేరు. పర్సులో డబ్బుతీసి నాకిచ్చి ఉత్తపర్సు అవతల పారేస్తాడు. కుందనంగోరు రోజూ జల్సా చేసేది ఇలాటిడబ్బే గదా" అంది సరోజిన్.

"గాంధీ కుందనంకు ఏమవుతాడు?" అడిగాడు ప్రభాకరం.

"బావరూ... అని పిలుస్తాది. ఆడు ఆవిడని లక్కా అని పిలుస్తాడు"

"లక్కా ఏమిటి?"

"అక్కా అనేదాన్ని విశాఖపట్టణంవోళ్ళు... లక్కా అంటారు. గాంధి సంపాదనతోనే మాంసం బుడ్డీ ఎల్లిపోద్ది ఆ యమ్మకి"

"ఎవరూ లేరా ఆ యమ్మకి."

"లేకేం, మొగుడిని వదిలేసినాది. రౌడీరాముల్ని ఉంచుకున్నాది. కొడుకులూ ఉన్నారు. అందరూ తాగుతారు, మాంసం తింటారు. ఒక్కడూ పన్జేయడు. గాంధిగోడికి జేబు దొరక్కపోతే కుందనం దొరసాని ఎబిచారం చేస్తాదిక్లాసుగా.

అదీకుదరకపోతే దొంగనోట్ల శీనివాసులు సీన్లో ఉంటాడు. ఇదీ ఆ యమ్మకథ."

"కొడుకులు ఊరుకుంటారూ?"

"మొదట ఊరుకోలేదు. తిరగబడ్డారు. పెద్దోడు తల్లిని రోజూ చావ చంపుతాడు. వెబిచారంచేసి డబ్బు తెత్తే ఆడు అదేదో నాయిత్తా క్లబ్బులమ్మడి అరుత్తాడు. అదేదో సంగీత పంట. రెండోవాడు తల్లికీ, సెల్లికీ యీదిలో కాపలా కాత్తాడు. మూడోఆడు యీది చివర్లో పోలీసులు రాకుండా కుక్కతో సుంచుంటాడు టుర్లిన్ బట్టలేస్కొని. పోలీసులు రాంగానే కుక్కనొదిలేత్తాడు. అది అరుసుకుంటు ఇంటికి లగెడుతుంది. ఆ వచ్చినోడుక్లాస్‌గోడేకదా. ఆడుసిర్భయంగా కూసుంటాడు. రండిరండి అని పోలీసుల్ని పిలిచి ఆళ్ళమ్మాయికీ యీరబ్బాయికీ పెళ్ళి అనో బిజినెస్ అనో ఏదో చెవుతారు. పోలీసులు కూడా ఏదో ఆ దారమ్మట వెడుతూ వచ్చాం అని సెప్పి వెలిపోతారు. అదండీ తెలివి" నిట్టూర్చింది సరోజిని.

"మరి గాంధీని ఎవరూ పట్టుకోలేదా?"

"సుందనంగోరి తమ్ముడని... అదే బెదర్ని పట్టుకునేదమ్ము లెవడికి? ఆడిదగ్గర దొంగసొమ్ము చణం వుండదు... సేతులు మారిపోద్ది... అసలు మేం ఇద్దరం భార్యా భర్త అనే అందరూ అనుకుంటారు. అందుకుగాను నేను సుందనంగోర్ని ఒదినగోరూ అని పిలుత్తాను. ఈసోదంతా

మీ కెందుగ్గాని?... అసలు పేదోళ్ళు చేస్తేతప్పు ... అలాటి కుందనాలు చేస్తేగొప్ప.....కాలం ఎలిగిపోతావుంది.” అంది సరోజిని. ప్రభాకరం కుందనాన్ని, గాంధిని అనుమానించి కూడా పట్టుకోలేకపోయినాడు. అందుకని విచారిస్తూ-

“రాడీరాము కెందుకు?” అడిగాడు.

“ఒయ్యొయ్యవ్ ... నీకు కధలంటే ప్రేమలాగుందే ... రాడీరాముడు రామ్మందిరం ఏరియాలో ఏకచత్రాదిపతి... సోగ్గా ఉంటాడు. ఆడు కుందనాన్ని ప్రేమించాడు. మొగుడిసి ఒగ్గేసినాక ఒక సినిమాఆలు పొప్రయిటరు రోజుకి పది రూపాయలు ఇచ్చి వత్తాఉండేవాడు. ఈలోగా రాడీరాములూ కుందనం నిజంగానే ప్రేమించేసుకున్నారు. ఆడు సితకదన్నినా ఆడేకావాలి ఈయమ్మకి. ఈమె ఎంతమందిదగ్గర తొంగున్నా ఈయమ్మే కావాలి ఆడికి. ఆయమ్మ ఈడిని కుక్కనిచేసి... ఏదో గుడిలో ఇగ్గరాలు దొంగతనం సేయించింది. అయ్యి బెంగుళూరులో దొరికినాయంట. అందల ఇద్దరు చచ్చిపోయినారు... అప్పటినుంచీ రాడీరాములుగోడు పొద్దున్నే రాములోరి గుడికెళ్లి దండం పెడతాఉన్నాడు. ఆ ఇగ్గరాలు అమ్మితే లక్షలు ఒస్తాయంట యింకా బేరం సాగుతునేఉంది.”

“మరి విగ్రహాలవాళ్ళు ఊరుకున్నారా?”

“పూజారోడు పరీక్షై రిపోరుటు ఇవ్వలేదు. అందుకని ఇక్కడమన ఆంధ్రదేశంలో కేసులేదంట. కాని కన్నడపోళ్ళు మాంగట్టివోళ్ళు. ఆళ్ళు ఇచారణ సేసి రాములుగాడినికని పెట్టారు. కాని కుందనం సల్లగానే ఉంది. సేయించిన మహాతల్లి సల్లగా

కూస్తుంది మేడలో... ఈడు రాములుగోడు గుడిలో చెంపలు వాయించుకోలేక చస్తా ఉన్నాడు" నవ్వింది సరోజిని... సరోజిన్.

"బేటా" బయటనుంచి అరుపువినిపించింది.

"మాఅమ్మ అరుస్తోంది డబ్బుకోసం" అంది సరోజిన్.

"ఈ వందరూపాయలూ తీసుకో నేను మళ్లావస్తాను" ఆమె సమాధానాలకి ఎదురుచూడకుండా బయటకు నడిచి పుల్లయ్య రిక్షాలో ఎగిరి కూర్చున్నాడు ప్రభాకరం.

"సరోజిన్ని చూశారాబాబూ? చాలా అలీసెం అయినాది" అన్నాడు పుల్లయ్య.

"చూశా గాని... ఇంకో సరోజిని ఉందా?"

"ఉందండి. బందరుగుడిసెల్లో ఇంకో సరోజినిఉంది" అన్నాడు పుల్లయ్య.

"అయితే అక్కడికి పోదాంపద" అన్నాడు ప్రభాకరం. విజయవాడలో బందరుగుడిసెలు అంటే దొంగసొమ్ము... అందునా రైలువాగన్లలోంచి దోచుకున్నసొమ్ము దొరికే చోటు. పోలీలు ఉండేచోటు-రైల్వే కూలీలూ దొంగలూ షరీకయే చోటు...దొంగతనం వ్యభిచారం పట్టుపడని చోటు.

ఆగుడిసెల్లో ఒక సరోజినిఉంది... ఆమె మొదట్లో పెద్దహోటళ్ళలో పెద్దవాళ్ళతో... పెద్దతిరుగుడు తిరిగింది

ప్రస్తుతం ఆమె రూపూ చూపూ కనుమూసింది. పగహోటేళ్ళప్పుడు... పెద్దహోటళ్ళలో సరోజిని, ఇరవయ్యారేళ్ళకే ముసలిదై అన్నంకోసం తనకున్న ఏకైకమార్గంలోనే ఇంకా జీవిస్తోంది గుడిసెలో.

ప్రస్తుతం ఆమెకు ఆకలితప్ప ఇష్టానిష్టాలులేవు. దాహంతప్ప జుగుప్సలేదు. క్రోధంతప్ప కామంలేదు...ఆ క్రోధంతోనే తిడుతూనే రిక్షా జోగులుకీ - సాహెబ్‌రంగడికీ. సర్వారుసోములుకీ - కసాయి హుసేనుకీ - జానకోటడికీ - సుత్యాలంపాడు దొంగస్వాములారికీ-జేబుదొంగ గాంధీకీ - రైలుదొంగ రాముడికీ - ఇంటిదొంగ ఈశ్వరుడికీ-పేధ బిచ్చగాడు వీరడికీ - పాకీపనిచేసే పోలిగాడికీ సమానంగా సామ్యవాదిగా సిఫిలిస్ పంచిపెడుతుంది. ఏ ప్రేమికుడి నిట్టూర్పు ఆమెకు గిలిగింత పెట్టలేదు. ఏతల్లి తాలింపు ఆమెకి గుర్తులేదు - ఏతండ్రి గద్దింపులూ ఆమెను సవ్యమార్గానికి నడిపించలేదు...అసలు వాళ్ళున్నారో లేరో - ఏ రచయితకీ - ఏ చరిత్రకారుడికీ తెలియదు.

సరోజిని ఊరు తెలియదు. పేరుకూడా ఎవరో పెట్టింది. ఎవరుపెట్టిందీ ఆమెకు గుర్తులేదు...చెప్పదు.

విప్పి కట్టినచీర విడిపోగా - దువ్వి కట్టిన సిగజారిపోగా- కుట్టి తొడిగిన రెవిక చిరిగిపోగా - కుళ్ళుతో - పుళ్ళుతో - కొరుకుళ్ళతో...క్రోధంవలన ఆవంలా మండిపోతూ - శక్తిలేక శవంలా నీరసించిపోతూ...గొడ్డులా గెడ్డలా బిగుసుకుపోయి చాపులాంటి నిద్రపోతుంది సరోజిని.

ఆ నిద్ర ఉదయం పన్నెండింటివరకూ అంతే.

అప్పుడు క్రోధంతోపాటు ఆకలితోపాటు ఆమెకి మెలకువ వస్తుంది...చిరిగినరైక తొడుక్కుని-విడినచీర కట్టుకుని-జారినసిగ ముడేసుకుని గుడిసెలోంచి బయటికివచ్చి పిశాచపు కేక పెడుతుంది.

"ఒరే గుంటెదవా? ఏడచచ్చావురా?"

"వత్తన్నా వదినా" అని పరుగెత్తుకుంటూ వస్తాడు. పన్నెండేళ్ళ పోలడు. వాడికి డబ్బులిస్తుంది...మొన్న వండిన పునుకులూ...చాసీళ్ళూ వాడే ఇస్తాడు - సరోజిని వాటిని అంతకంటె మరి తినేపదార్థాలు సృష్టిలో లేనట్లు ఆబగా-ఆశగా - ఆత్రతగా తింటుండి...ఈతడవ మరోదెయ్యపు కేకెడుతుంది,

"పోలాయ్"

"వత్తన్నా వదినా?"

"ఎండుచేపలూ నూకలూ మిరపకాయలూ పట్రా" అని డబ్బులిస్తుంది. రాత్రి సంపాదననిబట్టి ఈ చాపలూ నూకలు వగైరాలు రూపాంతరం చెందుతయ్...మధ్యమధ్య చింగులుటీ. తాగుతూ సారా కొనుక్కోగలిగే అదృష్టం ఉంటే అదే తాగుతూ బతుకుతుంది. మధ్యమధ్య పోలీసులూ - కోర్టులూ - లాకప్పులూ - ఉండనే ఉన్నాయి.

అలాంటి సరోజినికి ఆరాత్రి బేరాలులేక రేపటి ఆకలికోసం బాధపడుతున్న సరోజినికి పుల్లయ్య రిక్షా పువ్వుక

విమానం అంత సుందరంగానూ, అందులో దిగినవ్యక్తి దేవుడిలాగానూ తోచి ఆనందం కలిగింది.

తీరా గుడ్డిదీపం వెల్తుర్లో ఈయన తీరికాను ఎస్సయి కాదుగదా అని అనుమానం వచ్చింది...కాదు ఆయనోలె ఉన్నాగాని ఆయనకాదు. పల్లెటూరి పెద్దమనిసి...ఒకవేళ చుట్టాలేవో ?

"మీకు యస్సయి ప్రభాకర్రావుగారు తెలుసా ?" అని సూటిగా అడిగింది సరోజిని. ప్రభాకరం తోనకలేదు. ఈ మనిషినే కేసులు దొరకనప్పుడు పోలీసులు తెస్తారన్న విషయం గ్రహించాడు"

ప్రశ్నలో అంతర్యం గ్రహించాడు. ఆ చుట్టుపక్కల ఉన్న ఆకలీ హైన్యమూ సర్వమూ గ్రహించాడు.

"కానాయన నీకెలా తెలుసూ ? మా పినతల్లి కొడుకు. ఆళ్ళకీ మాకూ మాటపట్టింపువచ్చి మాట్లాడుకోటంలేదు. వాడు ఇక్కడకొస్తాడా ?" అన్నాడు.

"మాబోటి నిర్భాగ్యుల్ని పట్టుకోటానికి అతనురాడు. ఏ పోలీసాయనో వస్తాడు. భయంలేదు" అన్నది సరోజిని.

"నీపేరు సరోజినా ?"

"అవును"

"ఏవూరు ?"

"నాకు బుద్ధి తెలిసిన తరువాత ఇక్కడే ఉన్నాను. ఇక్కడే సెడ్డాను. రేపు ఇక్కడే చస్తాను. ఈబందరు గుడిసెల వాళ్ళే నాబందుగులు. ఆళ్ళు దొంగలు. నాను సెడినదాన్ని-నేను నిద్రపోతున్నా నాకు భయంలేదు. నాకు నిద్రరాకున్నా భయంలేదు"

"ఎందుకని?"

"ఎందుకనా? సారాఉంది. మాత్రలున్నాయి. ఇండీసన్లు ఉన్నాయి. డబ్బుంటే అన్నీఉన్నాయి. హాయిగా అయితీసుకుని నిద్రపోవచ్చు - నాకు నిద్రటయింకిరాదు. ఏదో ఒకటి తీసుకోవాలి. కనీసం డబ్బుంటే అన్నీ తీసుకుంటాను. అన్నంమాని. నాలాటోళ్ళకి నిద్దరే దేవుడు" అంది సరోజిని.

"నిద్రే దేవుడు. సుఖంలో దుఃఖంలో నిద్రే దేవుడు. రోగంలో యోగంలో నిద్రే దేవుడు. మాయలో అమాయలో అసూయలో అనాధలకి నిద్రే దేవుడు. ఆస్పత్రిలో

జైల్లో, ఇంట్లో నిద్రే దేవుడు. యుగకలిలో - చిరుచలిలో - ఆకలిలో నిద్రేదేవుడు. ఆనిద్రకోసం తాగుతారు. మాత్రలు వేసుకుంటారు. ఇంజక్షన్లు తీసుకుంటారు.

ఆ నిద్రకోసం వ్యభిచారం దొంగతనం దొరతనం ఉద్యోగం వ్యాపారం అన్నీ చేస్తారు - మనిషి ఆకలి తీర్చుకోటంకోసం ఇవన్నీ చేస్తాడని చాలామంది అనుకుని వ్రాస్తారు. ఆ ఆకలి తీర్చుకోటంకూడా నిద్రపోయేటంగుకేనని చాలా

మంది గ్రహించరు. జీవి నిద్రకోసం పుట్టాడు. పెద్దనిద్రపోయే వరకూ బ్రతుకుతాడు. ఆకలికోసం పనిచేస్తాడు. ఆకలి తీర్చు కోటం నిద్రకోసం తప్ప మరిదేనికీకాదు. సరోజినీ అంతే.

మనిషికి నిద్ర అత్యావసరం.

ప్రభాకరం నిట్టూర్చి ఆమెచేతిలో పదిరూపాయలు పెట్టి బైటకివచ్చి పుల్లయ్యరిక్షా ఎక్కాడు.

"ఏం బాబూ ఈ సరోజినీకాదా?...అయితే ఒక కొత్తపిట్ట వచ్చింది. రేపు ఉంటదో ఉండదో?" అన్నాడు పుల్లయ్య.

"ఎందుకుండదు?" ఆదుర్దాగా అడిగాడు ప్రభాకరం.

"మాంకాళమ్మ. హైదరాబాదుకి సేరేస్తాది...కాని కొంచెం కరీదండి"

"ఏపాటవుద్ది?"

"అయిదొందలు బాబూ"

"అంత ఖరీదు దేనికయ్యా" పుల్లయ్యకి అనుమానం రాకుండా అడిగాడు ప్రభాకరం.

"ఆయమ్మ సంసార్లే...ఏటయిందో పొద్దున మాంకాళమ్మకాడి కొచ్చింది. ఈ రిచ్చాలోనే యెక్కింది...మాంకాళమ్మా, ఆయమ్మా బాస మాట్లాడేరు...అందట్ల సరోజిని అనేపేరు విన్నాను. మాంకాళమ్మ ఈవూరి పిట్టల్ని హైదరా

బాదులో - హైదరాబాదుపిట్టల్ని ఈవూర్లో సెల్లగొడుతా వండి...అందుకని ఆ సరోజిని ఈవూరి పిట్టగనక హైదరా బాదు ఎల్లాల. అది రూలు...మరి అయిదొందలవుద్దండి.ఒప్పు కుంటే..." అన్నాడు పుల్లయ్య.

"సరే పోదాంపద. నేను ఎతికే సరోజిని ఆవిడ కాక పోతే ఆవిడని ముట్టుకోను డబ్బివ్వను. నీకుమాత్రం డబ్బు ఇస్తాను మరి తొందరగాపోని" అన్నాడు ప్రభాకరం.

రిక్షా మస్తానుకిల్లీకొట్టుదగ్గర ఆపి "తమరు ఇక్కడే ఉండండిసాబ్ - నేను మాంకాళమ్మతో మాట్లాడుతాను" అని సమాధానంకోసం చూడకుండా వెళ్ళాడు పుల్లయ్య ప్రభాకరం మెల్లిగా-

"మస్తాన్" అన్నాడు...మస్తాను ఉలిక్కిపడి గుర్తుపట్టి ఖంగారుగా దిక్కులు చూసి ఎవరూ లేరని నిర్ణయించుకొని,

"సాబ్...నాటకంలో వేషంలాగా ఉందండి. గుర్తు పట్టలేక పోయాను...పొద్దున పదకొండున్నరకి ఎవరో ఆవిడ ఈ పుల్లిగాడి రిక్షాలోనే వచ్చిందండి...మళ్ళీ బయటకి రాలేదు. నాతోనే శర్మగాడిని ఇయ్యాల్టికి రావద్దని మాంకా ళమ్మ కబురుపెట్టింది...సాబ్, మీరు బీడీ ఎలిగించుకోండి పుల్లిగాడు ఒస్తున్నాడు" అని మామూలుగా ఉండిపోయాడు మస్తాను.

"సాబ్, ఆ యమ్మ బహుచారంమాత బక్తురాలంట. ఎదవపన్లు చెయ్యదంట. మాంకాళమ్మ నన్ను కొట్టినంత పని చేసిందండి" అన్నాడు పుల్లయ్య.

"సరే నువ్వెళ్ళు... నేను ఇక్కడే కూర్చుంటాను" అని పుల్లయ్యని పంపేశాడు ప్రభాకరం.

పుల్లయ్య దూరం వెళ్ళేదాకా ఆగి "ఈ బహూచారం మాత ఎవరో నీకు తెలుసా మస్తాన్" అన్నాడు ప్రభాకరం.

"మాంకాళమ్మ అంటూ ఉంటుందండి...జిల్లెళ్ళ మూడిఅమ్మని మంత్రశ్రీ అన్నట్టు అది పేరు కావోసండి" అన్నాడు మస్తాను.

"అయుంటుంది. ఆ ఇంటి గోడదూకుతాను...... మరేంభయంలేదు నాదగ్గర పిస్తోలుంది" అన్నాడుప్రభాకరం.

"మనుషులంటే భయం లేక పోవచ్చండి...కానిసైతానంటే పిస్తోలు ఏంచేస్తాదండి?...కొంచెం జాగర్తగా మసులుకోవాలండి" అన్నాడు మస్తాను. ఆ మాటకి ఉలిక్కిపడిన ప్రభాకరం-

"సైతానా? చిత్రంగాఉందే?" అన్నాడు.

"అవును సాబ్...సైతానే పన్నెండు నుంచీ మూడు వరకూ. మాంకాళమ్మ ఇంటిసుట్టూ తిరుగుతా ఉంటది. బగమంతుడి దయవల్ల మాంబోటి వాళ్ళని ఏటీసెయ్యాదు" అన్నాడు మస్తాను అలవాటయిన సైతాన్ని మెచ్చుకుంటూ. ప్రభాకరం టైము చూసుకున్నాడు. పన్నెండు గంటలు పది నిముషాలయింది.

"అదుగో సాబ్, గస్తీకి బయలుదేరింది సైతాన్" అన్నాడు మస్తాను - ప్రభాకరం అటు చూశాడు.

ట్రాన్స్పరెంటుగా ఉండే ఒక ఆకారం ఇంటి చుట్టూ తిరుగుతోంది - పరీక్షగా చూస్తేతప్ప కనిపించదు.

"కోడి కూసేవరకూ ఇలాగే తిరుగుద్ది సాబ్" మనవి చేశాడు మస్తాన్.

"నీకు భయంలేదా ?"

"మొదట్లో భయపడ్డానండి - మాంకాళమ్మకి సెప్పానండి ఆమె తావీజు ఇచ్చి ఎవరికీ సెప్పకే - అలాసెపితే నెత్తురు కక్కుకొని సస్తావు అంది... కాని ఆ సైతాను అలా తిరగటంతప్ప మరేటీ సెయ్యదండి... చాలా మంచిది-మడిసిగా ఉన్నప్పుడు ఎవరో కాని" అన్నాడు మస్తాను.

"నెనక్కి తిరగదా ?"

"తిరగదండి పక్కలకి సూడదండి...కిందికి అసలు సూడదండి - బూమిని తాకదండి... ఈ కిల్లీ కొట్టుకాడ ఎంత గలాట అయినా ఇటు సూడదండి...నాకు తెలుసు శానామంచిది" మరో తడవ మెచ్చుకున్నాడు మస్తాను.

"అలా అయితే గోడదూకి...వాళ్ళేంచేస్తున్నారో చూస్తాను" అన్నాడు ప్రభాకరం.

"మీరు ఇసపసరాలండి. అందుకే పోలీసులంటే దెయ్యాలు కూడా జడవాల. ఒక్క మాటండి-దానికి ఎదురు

పడకండి. ఎందుకయినా మంచిది...ఈ గూాది పక్కలు కూడా మొదట్లో అరిసేవి. ఇప్పుడు అయినా అలవాటు పడ్డయి. పక్క కిటికీ తలుపు తెరిసేఉంటుంది...కాని దానికి ఎదురవ్వ కూడదు తమరు''

''అలాగే''

''ఏ యమ్మ బిడ్డోకాని రుస్తుంసాబ్ మీారు''

''ఈ విజిల్ తీసుకుని పదినిమిషాలయ్యాక ఊదు. పోలీసు ఎవరైనా వస్తే ఇక్కడే ఉండమను...నేను వెళుతు న్నాను'' అని ప్రభాకరం చూస్తుండగానే పరిగెత్తి గోడ దూకి మస్తాన్ని వహ్వా అనేట్లు చేశాడు.

గోడ దూకంగానే బోర్ల పడుకుని పాకుతూ కిటికీ దగ్గ రకి చేరి అలుపు తీర్చుకోటానికి ఆగాడు ప్రభాకరం.

సైతాను గస్తీ కాస్తూనే వుంది...కిటికీలోంచి మాటలు వినిపిస్తున్నాయి. అందులో ఒక కంఠం సరోజినిది. రెండో కంఠం మాంకాళమ్మది అయుండవచ్చు.

''మా మరిది బహు బద్మాష్...పోలీసాడు...కూపీ తీసి వస్తాడేమో ?'' అన్నది సరోజిని.

''నువ్వేతప్పు చెయ్యలేదుగా. నీకిష్టంలేని మొగుడిని వదిలెయ్యటానికి నేను గూల్సు వుంది. నీ ఇష్టం. వాడెవడు నిన్ను పట్టుకునేందుకు...రేపు వెళ్ళేలోపల నువ్వెక్కడు న్నావో వాడికి తెలియదులే. భయపడకు''

"వాడిసంగతి నీకు తెలియదు జిన్...ఏడేళ్ళనుంచి వాడు నన్ను పట్టుకోలేదంటే- అన్న పెళ్ళాంననే తప్ప- తెలియక కాదు"

"బైట సారిన్ తిరుగుతోందిగా భయంలేదు"

"మా ఆయన్ని ఆవేశించమని నువ్వు పంపినప్పుడు సారిన్ ఏం చేసింది ?"

"ఆ రోజున వాళ్ళు ముందే గ్రహించి అడ్డుకున్నారు. సారిన్ బరువంతా రెండవున్నలేగా. అది మాత్రం ఏం చేస్తుంది భయపెట్టడం తప్ప...నువ్వు భయపడ్డట్లు నీ మరిది బ్రహ్మాండనాయకుడేం కాదు. హైద్రాబాద్ వెళ్ళిన తరువాత నాయిక్ (నాయకుడు) తో చెప్పి వాడిని సఫా చేయిద్దాం. ఈ తడవ పార్లమెంటులోకి వెళ్ళాలని నాయిక్ ప్రయత్నం... నిన్నే ఎలక్షన్లో నుంచో పెట్టవచ్చు...నువ్వు ఇంకా ఆడదానివేగా"

"ఛీ-పాడు ఆడతనం...విసుగు పుడుతోంది నెలనెలా"

"పార్లమెంటు అభ్యర్థి స్త్రీయో ! పురుషుడో ! కావాలిగదా మరి...అందుకని హిజ్రా (ఖోజ్జా) నున స్త్రత్వం కలిగి ఆడదానివైన నువ్వేసరి...సరే ఒదిలేయి. మా ఆయనతో ఆ పాడు పనిచేశావా ?"

"...చేశాను బహుచార్ మాత దయలేక...పిల్లలూ పుట్టారు ఆ, తడీ, జిగురూ, నెత్తురూ, ఛీ" అంది సరోజిని.

"మొగాడంటేనే పేడపురుగు సెక్స్ జన్మ...రంగనాయకమ్మగారు కృష్ణవేణిలో అన్నట్లు" అని భక్తిగా రంగనాయకమ్మగారికి నమస్కరించింది మాంకాళమ్మ...అలా అనిపించింది ప్రభాకరానికి.

"నువ్వు లక్ష చెప్పు-హాయిసరాగాను వెళ్ళి నాయక్ దగ్గరకి పోవాలంటే నాకు భయమే...అయినా, జిన్, మన సౌధంలో స్వర్గం జ్ఞాపకం వస్తే...నాకు ఇప్పుడే వెళ్ళి పోవాలనిపిస్తున్నది"

"పంపుదునుకాని...చద్దర్ (ముసుగు) కుట్టివ్వటం లేపుగాని కుదరదు. ఆ పని శర్మగాడికి చెప్పాను. నగలూ డబ్బూ జాగ్రత్తగా ఉంచాలంటే ముసుగు ధరించాలిగా మరి...ఇటుతిరుగు" అంది జిన్ - సరోజిని అటుతిరిగినట్టుంది. సైతాన్ X స్త్రీ కాస్తూనే ఉంది...ప్రభాకరం కుతూహలం ఆపుకోలేక కిటికీలోంచి తొంగిచూశాడు.

లోకంలో నాగరికులెవరూ సహించలేని దృశ్యమది. ఈ ప్రభుత్వంలో ఎమెల్యే లున్నారు. వాళ్ళెన్నుకున్న మంత్రులు - చైర్మన్లు-కమీషనర్లు-ప్రెసిడెంట్లు - పంచాయితీలు - కలెక్టర్లు - పోలీసాఫీసర్లు- ప్లీడర్లు- జడ్జీలు -మాస్టర్లు- ప్రొఫెసర్లు - సైంటిష్టులు - డాక్టర్లు - డాక్టరేట్లు - కళాప్రపూర్ణులు - పద్మశ్రీలు. - భారతరత్నలు - సినిమాస్టార్లు - బ్లాక్ మార్కెటీర్లు - స్మగ్లర్స్ - క్రిస్టియన్లు - ముస్లిములు - హిందువులు - జైనులు - బౌద్ధులు - గుళ్ళ కనకదుర్గ - గుడిబైట ప్రజానీకం - క్రిస్టియన్ సరోజినీ కమలం -

అగ్రమహమ్మదీయ సరోజిన్ - పూర్తి దౌర్భాగ్యురాలు పతిత సరోజిని - కవులు-కవిసామ్రాట్టులు - మహారచయితలు స. ర. స. లు, వి. ర. స. లు, అ. ర. స. లు, కమ్యూనిస్టులు - మార్క్సిస్టులు - ఆనందమార్గీయులు - నక్సలైట్లు - నానాజాతిసమితివారు - ఐక్యరాజ్య సమితివారు - పంచశీలసిద్ధాంతంవారు - భూదానోద్యమంవారు - ఇరవయిసూత్రాలవారు - ఎమర్జెన్సీవారు - ఇంకెందుకు - స్త్రీ పురుషులు ఎవరు చూసినా ఆ దృశ్యం విరుచుకుపడి సైతానుకి ఆహారం అవుతారు.

సోదరులారా! సోదరీ మణులారా! ఇది సెక్సు కోసం ఆ ఎఫెక్టుకోసం నేను వ్రాయటంలేదు. సినిమావారు గౌరవనీయమైన రేప్ సీన్లని పెట్టినట్లు నేను పెట్టలేదు. ఇది సెక్స్ పుస్తకం కాదు. ఈ దృశ్యం వర్ణించి శృంగారం గొప్పగా వ్రాశాననిపించుకోవాలనే దుర్బుద్ధి నాకు లేదు. వాల్‌పోస్టర్ల మీద మొండిమొలబొమ్మని చూసి ఉషారునొందే సోదరులారా! ఈ దృశ్యం అలాటిది కాదు. సినిమాలో డ్యూయట్ విని కలలుగనే సోదరీ మణులారా! ఈ దృశ్యం అలాంటిది కాదు. పుణ్యం సినిమాలు చూసే తల్లులారా- తండ్రులారా- ఈదృశ్యం అలాటిదికాదు. సర్వాంతర్యామివైన భగవంతుడా! ఈ దృశ్యం నీలాటి దసలే కాదు.

ఈ దృశ్యం ఇది - గస్తీ తిరిగే సైతాను ఒక్క- గెంతుగెంతి మాయమయిన సీను - మానవుడు భరించలేని సీను. హింద్రజాల శృంగారపు సీను.

సరోజిని జననేంద్రియంలో మాంకాళి నాలుక కదులుతున్నది. సరోజిని పరవశంలో ఉంది. గోడమీద కోడెక్కిన ఆడబొమ్మా (బహుచార్), కిటికీ దగ్గర ప్రభాకరం తప్ప ఆ దృశ్యానికి సాక్షులెవరూ లేరు. అగోచరుడైన ఈశ్వరుడు సాక్ష్యానికి రాడు.

కోడికూతా - పోలీసు విజిలూ గింగురు మన్నాయి.

# 10

ఉదయాన్నే హెడ్ కానిస్టేబులు వీరయ్య - మరో పోలీసుని తీసుకుని అనుమానం మీద అరెస్టుకీ - నిజంగా అరెస్టుకీ బయలుదేరాడు వారంటు పుచ్చుకుని. కాని ప్రభాకరంగారు చెప్పినమాట విన్నదగ్గరినించీ పులిలాటి వీరయ్య పిల్లిలాగైనాడు. కాని డ్యూటీ డ్యూటీయే గదా-

వీరయ్య ఇహ రెండేళ్ళకి రిటైరవుతాడు. అతని సర్వీసులో ఇలాటి సైతాను కేసు చూడలేదు. గంభీరంగా ఉండే వీరయ్య అవసరం వస్తే గుర్రంలాగా పరుగెత్తగలడు. ఆ ధైర్యంతోనే సైతాన్ల అరెస్టుకి బయల్దేరాడు - సైరనులా-రైలింజన్లా - అరవగలడు. ఆ ధైర్యంతోనే సైతాన్ల అరెస్టుకి బరాలుదేరాడు. అవసరంవస్తే హనుమాన్ చాలీసా చదవగలడు. ఆ ధైర్యంతోనే సైతాన్ల అరెస్టుకి బయలుదేరాడు.

అదీగాక డ్యూటీ డ్యూటీయే.

గతంలో వీరయ్య - చేసిన నేరాల్ని కప్పెట్టాడు - చెయ్యని నేరాల్ని ఒప్పించాడు. సీతమ్మవారిని గీతదాటించి కంపెనీ సిలకకింద మార్చే బ్రోకర్లకి, యముడయినాడు. పొట్ట కోసం దిక్కులేని ఆడకూతుళ్ళు ఎదవపనిచెయ్యక తప్పక పోతే చూసీ చూడనట్టూ పోయాడు. గంజికోసం బ్లాకు టికెట్లమ్మే సినిమాహాలు కుర్రాళ్ళని ఒదిలేశాడు. హాలువాళ్ళనే- బెదిరించగలిగాడు. చిన్న దొంగని వదిలేశాడు - కలిగిన దొంగల్ని కాటేసి కబడ్దారన్నాడు.

కాని ఇది సైతాను కేసు.

కూపీ తియ్యటంలో వీరయ్యకి వీరయ్యే సాటి - అది ఆతని ప్రత్యేక నైపుణ్యం. దొంగ సొమ్ములన్నీ మార్వాడీలే కొంటారని రూలు - లంజకంపెనీలన్నీ ఊరిపెద్దల పేర్లేనని రూలు. బ్లాక్ మార్కెట్ అంతా వైశ్యులదేనని రూలు - రవుడీలందరూ పిరికాళ్ళనే రూలు - పాతకేడీలందరూ పోలీసు మిత్రులేనని రూలు - మరోకాపురం పెట్టినవాడు నల్లడబ్బు ఉన్నవాడని రూలు - పెట్టనివాడు లంచగొండి అయినా - మంచగొండి అయినా దుమ్ములగొండి అయినా అవుతాడని రూలు- ప్రతీదానికీ ఖరీదుంటుందని రూలు.

మంత్రిగారు మాధవుడిలా ప్రవర్తిస్తారని రూలు.

ఇన్నిరూల్లూ ఉంటాయనేది పెద్దరూలు.

కాని సైతానుగురించి ఏరూలు లేదు...భయం తెలియకుండా పక్కనున్న పోలీసుతో కబుర్లు పెట్టుకున్నాడు వీరయ్య.

"మనిద్దరం సైతాన్ని పట్టుకోటానికి పోతన్నాంగనక. నేను హెడ్డునని - నీవు కానిస్టేబుల్ వని మర్చిపోదాం- నాపేరు వీరయ్య. నీపేరు రంగారావు అవునా?"

"యస్ సార్"

"రంగా! నీ సర్వీసెంతరా?"

"అయిదేళ్ళండి"

"ఎన్ని కేసులు పట్టుకున్నావురా?"

"చాలా రయిడింగులు చేశానండి"

"అందులో ముఖ్యమైన దేదిరా?"

"బాలమ్మ కంపెనీ రైడండి"

"అది ఒకసారి చెప్పరా...ధైర్యం మొస్తాది" అన్నాడు వీరయ్య. రంగారావు కంఠం సవరించుకొని చెప్పటం ప్రారంభించాడు.

"మనం రెయిడుకెళ్లేసరికి ... యమ్మెల్యేగారి జీపు పక్క నెట్టిఉంది. మనం అది కానుకోలేదు" రెయిడు రోజుని తల్చుకున్నాడు రంగారావు.

బాలమ్మ కంపెనీ అవాళ కళగా పెళపెళ ఉంది. సారాలు పొంగుతున్నాయి- సరసాలు ఉప్పొంగుతున్నాయి- మత్స్యాలూ - నృత్యాలూ - ఆ రెండిటితాలూకు చెమట వాసనా - విటమిన్ బి. వాసనలాంటి నెత్తురువాసనా - మొగ వాళ్ళకీ - మొనగాళ్ళకీ ఇన్స్పిరేషన్ ఇస్తున్నాయి.

బయట రిక్షావాళ్ళకీ - బ్రోకర్లకీ - కూడా తాగినంత సారా - నీరా - దొరుకుతున్నాయి - జీపులోవచ్చిన పెద్ద మనుషులు ఆటవికులేనా అయుండాలి- దేవతలేనా అయుండాలి. వాళ్ళకి సిగ్గులేదుకాబట్టి లోపల ఆడపాపలూ - ముసలి బేబీలూకూడా ఆనాడు ఉషారుగానే ఉన్నారు-జీవితాన్ని జుర్రుకోటం తెలియనివాళ్ళు ఇదంతా తప్పనవచ్చును.

అయితే స్త్రీ పురుషులు పుట్టడమే తప్పసార్ - అందరూ బాహుచారా మాతకే అంకితం అవటం మంచిది - వ్యభిచారం తప్పంటారా? అయితే అందరూ హిజ్రాలై పోవడమే మంచిది. అన్ని కోణాల్నించీ సమస్యని పరిశీలిస్తున్నాం- అనే రచకమిత్రులు వ్యభిచారంతప్పని, పద్ధెనిమిద పురాణాలనించీ- చరిత్ర గ్రంథాలనించీ అంతులేని అమర సాహిత్యంనించీ - మార్క్సిజంనించి మావోసూత్రాలనించీ ఎన్నో ఉదాహరణలు చూపించగలరు.

కాస ఆక్షణంలో రెండుపెగ్గులు బిగించి కడుపారా కోడినారగించే - ఆడపాపలు ఒక్కరోజైనా గతమైన పవిత్ర జీవితాలలో పవిత్రతతప్ప సుఖంలేదని ఢంకా బజాయించి పక్కనున్న మగవాళ్ళకి చెప్తున్నారు. దానిసంగతేమిటి?

ముసలి బేబీలు... విస్కీకన్న మాంసం తక్కువతిని మత్తిల్లిపోయి ఇదేస్వర్గం అంటున్నారు. దానిసంగతేమిటి?

బాలమ్మ రాజకీయంవాళ్ళొచ్చినందుకు - తనకంపెనీ స్టేటస్ తోటికంపెనీలన్నింటికంటె పెరిగిందని చాలా సంతోష పడిపోతుంది.

అన్నీచాలక స్వాములారుకూడా వాళ్ళతో వచ్చాడు

"రండిస్వామీ దయచేయండి"
"హరోంహర"
"చిత్తం...కాస్త తీర్థం సేవిస్తారా ?"
"సుర తాగనివారు అసురులు...అలాగే"
"అందులో తమరు ఏమి స్వీకరిస్తారు ?"
"మేమకుక్కుటములైన మేలు"
"చిత్తం అలాగే"

"అయితే బాలమ్మా ఇదుగో ఈడబ్బు నీదగ్గరఉంచు. స్వాములారికీ - నాకూ - ఫ్రెండ్స్‌కీ - కూడా ఏర్పాట్లు మజాగా జరగాలి... ముదురు చిలకయినా సరసం తెలిసిన సరోజిని స్వాములారికి సేవచేసి తరించమను" అన్న రాజకీయం పెద్దమనిషిమాటకంటె డబ్బుకి పరవశించి పోయిన బాలమ్మ-

"తమరు నాతో దయ చేయండిసామీ" అని దారితీసింది. సన్యాసాశ్రమం అనంతరంకన్న ఈ పంచరంగుల కలకి మురిసి పోతూ బాలమ్మని అనుసరించాడు స్వాములారు.

ఈ విధంగా బాలమ్మ కంపెనీ...రాగాలలో - రంగులలో - మిలమిల మెరుస్తూ ఉండగా - కొత్తగావచ్చిన డియస్పీగారు ఎవరికి తెలియకుండా రెయిడు అన్నారు... ముందు కొంచెం తెలిసినా వార్తలు వెళ్ళిపోయేవి...కాని ఏం లాభం-ఇప్పుడు రెయిడు జరిగితీరాలి మొన్ననే రెయిడయింది-బాలమ్మ కంపెనీలో అమ్మాయిలు దొరక్కుండా పోలీసులూ బాలమ్మా జాగ్రత్త పడ్డారు.

ఈ తడవ అలాకాదు. డీయస్పీగారూ సర్కిలుగారూ స్వయంగా వేంచేశారు-వాళ్ళిద్దరూ వాకిట్లో నిలోచగా- ఇద్దరు

సబ్ ఇనస్పెక్టర్లు హెడ్ కానిస్టేబులూ - ఇద్దరు కానిస్టేబిలూ లోపలికి పోయారు - కంపెనీ అంతా గోల గోల అయింది.

నాలుగు జంటల్ని వీధిలోకి తీసుకొచ్చారు.

“ఇదేమిటి ? సంసార్ల ఇళ్ళమధ్య బొంబే బ్రోతల్లాగా వుంది” డీయస్పీగారు ఆశ్చర్యాన్ని వెలువరించారు.

రెండు మిల్లులూ సినిమా హాలూ వున్న రాజకీయం పెద్దమనిషినీ - స్వాములార్నీ కూడా వారి వారి జంటలతో నిర్దాక్షిణ్యంగా బయటకి లాక్కొచ్చారు.

“అబ్బ...నాయనోయ్” ఒకమ్మాయి పరుగెత్తుకొచ్చి డీయస్పీగారిని ఢీ కొట్టి అయస్తూ నిలబడింది.

“ఎవర్నువ్వు ?”

“నేను కన్నారందగ్గర గొల్లోళ్ళమ్మిని...నువ్వెవరు... అందర్లాగా నువ్వు కూడా మమ్మల్ని చంపటానికొచ్చేవా ? కార్లూ జీపులూ మీదొచ్చేవాళ్ళు మరీ గోరం ఛ. ఛ.” అంది అమ్మాయి.

“నువ్వు ఎవరు ?”

“చెప్పానుగా...నన్నిక్కడ సినిమాహాల్లో పట్టుకుని ఇక్కడికి లాక్కొచ్చి చంపేస్తున్నారు” అని కంప్లయింటు చేసింది. వీరయ్యకి రాజకీయం పెద్దమనిషి ఇలాటోడని తెలుసు. స్వాములో చిక్కేసరికి భద్రంగా నేవ్యానెక్కించాడు- అంతకుముందే వ్యానులో స్వాములారు సురక్షితంగా కూర్చున్నారు.

శాంఖ్మనీ, దానిప్రియుడు ఉగాదినికూడా పట్టుకుపోయారు పోలీసులు...ఆడపాపల్ని జుల్మానా వేసి వదిలే

స్తారు గాని ఉగాదినీ బాలమ్మనీమాత్రం ఒదిలేట్లు లేరు. సాములారి సంగతి మరీ అన్యాయంగా వుంది.

బాలమ్మ భాషలో- "డియాస్పీ బేపనాయన... కాష్టంకి మనం సాకలోళ్ళం. కన్నన్ బాబు అయితే కత ఇందాకా రానే రాదు. అందరూ చమానంగుండాల అంటరే కాని... మాం దార్న మేం యాపారం నేసుకుంటుంతే ఈ బాపనయ్య డియస్పీకి తక్కువ కులాంమీాద ఉండే కచ్చగొద్దీ రెయిడు చేయించినాడు. నెలనెలా యాభైరూపాయిలుచందాఁపట్టుకెళ్లే మారికిస్టోళ్ళు... ఈ బాపనాయన జులుం సాగనీ రాదు. మనం సెడ్డ్యాలు జాతోల్లం" అని మార్కిస్టుపార్టీవారికి కబు రెట్టింది బాలమ్మ.

ఉగాదికి లాకప్పులోఉన్నా కోడిమాంసం కావాలి.

"నేనూ మా ఆడదీ ఏంచేశామని పట్టుకొచ్చారు? తక్కువ కులపోళ్ళమయినా మాది నెత్తురే... బేపనోళ్ళేమన్నా బెమ్మదేవుళ్ళా..." అని అరుస్తున్నాడు వాడు. స్వాములారు మాత్రం రాజకీయంపెద్దమనిషితో వచ్చాను గాని మరేంలేదు. "శివోహం" అన్నాడు.

"ఇంకో యమ్మెల్యేగారు బ్రామ్మడు ... ఆయన వార్డులో ఓట్లేసి గెలిపించినాళ్ళందరూ బ్రాహ్మలే కారుగా... అన్ని జాతులూ ఉన్నాయి. ఈవూరి కవిగోరు బ్రాహ్మడు... ఆయన పుస్తకాలు అందరూ చదువుతారు... ఇలాగ్గా బ్రాహ్మలు పేట్రేగి పోతున్నారు. ధర్మం న్యాయం అంటే వీకతెగ్గోసు కుంటారు. అందులో కొత్త డియాస్పీగా రొకాయన.

ఇన్నాళ్ళనించీ బ్రాహ్మణ చైర్మన్లు ఉంటే - ఎందు కైనా మంచిదని ఆళ్ళనిదించి ఇంకో జాతి సినిమాఆయన్ని చైర్మను చేయటం మంచిదయింది. లేకపోతే ఇంకా ఈ బాపన్నాలు చంపేద్దురు మన్ని - అసలు మనోళ్ళకి బుద్ధిలేదు- ఇది ఉగాది అభిప్రాయం.

రాజకీయం పెద్దమనిషి పానెక్కినాక - తాగివున్నందు వల్లా - ధనమదంవల్లా - బాపన్నాల్ని డియస్పీని మూడు గంటలసేపు అనర్గళంగా ఏకధాటిగా తిట్టాట్ట - తిట్టనిచ్చి - తిట్టనిచ్చి - తిట్టనిచ్చి...ఆయన్ని ఆయన వర్ణస్తుడే అయిన సర్కిల్ ఇన్స్పెక్టరు చితగ్గొట్టడం జరిగింది - అప్పుడు ఆయన గురించి మరో ఇన్స్పెక్టరు ఈయన డబ్బూ పోలూ మిల్లూ వగైరాలున్నాయి- హైదరాబాలో మనపీకల మీదికి తెస్తాడు- అని సర్కిల్కి చెప్పి కొట్టడం ఆపుచేశారు - పొద్దున్నే కేసులేకుండా విడిచిపెట్టారు.

అయినా ఆ రాజకీయం పెద్దమనిసి కోపం అంతా బ్రాహ్మడైన డియస్పీమీదనే...కనక కల్లుతాగి నిప్పు తొక్కి ముల్లు గుచ్చుకొన్న ఆ పెద్దమనిషికి కల్లుమీదా నిప్పుమీదా రానికోపం ముల్లుమీద వచ్చింది - బయటికి వచ్చిన వెంటనే హాస్పటలుకి వెళ్ళి దెబ్బలకి కట్లు కట్టించు కొని ఇవి కొట్టిన దెబ్బలే-అని గవర్నమెంటు డాక్టరు దగ్గర సర్టిఫికేట్ తీసుకెని బందరెళ్ళి యస్పీని కలిసి-

"కులగర్వంవల్ల డియస్పీ ఇలా చేశాడు" అని చెప్పి యస్పీ ఏం చెప్పినా వినకుండా - సరాసరి హైద్రాబాద్ వెళ్ళి -

"మన కులంమీద పెద్దకులం వాళ్ళకి కక్ష" అని తన ఎమ్మెల్లేలని కూడగట్టుకొని లీడర్ని పట్టుకొని - తన కులం మంత్రి దగ్గరకెళ్ళి-

"నాకూ-హోటలూ - మిల్లూ - ఉన్నాయి - నేను ఇన్ కంటాక్సు కడుతున్నాను...నేను ఆ దారినపోతూ గలాటా ఏమిటో అని కారాపాను. అందుకుగాను నన్నీవిధంగా డియస్పీ కొట్టాడు. ఒకవేళ నేను తప్పుచేసినా కేసు పెట్టాలి గాని ఈ విధంగా కొట్టడం చాలా అన్యాయం" అన్నాడు - బ్రాహ్మలు కానివారందరూ ఈ జులుం సహించమని నొక్కి-వక్కాణించారు. ఐ. జీ. గాని మంత్రిగాని చేసేదిలేక - బ్రాహ్మణ డియస్పీని బదిలీచేశారు నిముషాలమీద-

"అది సార్ కథ" అన్నాడు రంగారావు.

"అందుకని...మనం ఎంతో జాగ్రతగా ఉండాలి. అందులో ఇప్పుడు సైతాన్ని...ఆడమొగ కానోళ్ళనీ అరెస్టు చేయడానికి పోతున్నాం...దేముడికి దణ్ణం పెట్టుకో! వారంటు కాగితాలు జాగ్రత" అన్నాడు వీరయ్య. అతనికి ఎందుకో నీరసం అనిపించింది.

"కాఫీతాగుదాంపద నాయనా" అని ఎదురుగా వున్న తొమ్మిది రంగులహోటల్లోకి రంగద్వితీయుడై రంగుగా ప్రవేశించాడు.

విజయవాడలో రంగుల లాడ్జింగ్ బోర్డింగ్ కి చాలా పేరుంది. అందులో పాగ్గనర్లు అందరూ ఉత్సాహవంతులవటం చేత...ఉత్సాహాన్ని ఇచ్చే ఏర్పాట్లు అన్నీ అందులో వున్నాయి. ముచ్చటైన ఆ పూటకూటీ భవనానికి మంచగొండి మహనీయులందరూ విలాసార్థమూ వినోదార్థమూ చేర

తారు- సినిమాలవారు...వ్యాపారాలవారు వారి నెచ్చెలులు అందరూ లంచంపుచ్చుకొని మంచంమీద చేరాలంటే ఈ హోటలు అత్యవసరం...రిసెప్షన్‌లోనే అవసరాలు గ్రహించేస్తారు. లిఫ్టులోనే విషయం తేలిపోతుంది. గదిలో అడుగు పెట్టేసరికి మదిరా మదవతీ మాంసమూ రెడీగా వుంటాయి కొత్త కొత్త లైటింగూ - కన్సీల్డ్ లైటింగూ - సెక్సు లైటింగూ (పుస్తకాలు) అక్కడ మంచగొండి మహాసీయుల్ని ఆకర్షిస్తాయి.

అన్నీ అతిశీతలమైన చలువగదులూ - సుందరమైన చెలువ గదులూ అందుబాటులో లేని విలువగదులూ.

వేడిగా ఉండే విజయవాడలో ఆ హోటలు కాశ్మీరం లాగా వుంటుంది...విజయవాడలో అడుగు వర్గంవాడు ఆ హోటల్లో తరుచు వుంటాడు. అ హోటల్లో ప్రిన్స్ ఉండ గలడు. పింప్ ఉండగలడు.

అక్కడ నాటురంభలకి ప్రవేశము లేదు. A సర్టిఫికేట్ ఉన్న హోటలు అవటంవలన కారూ-బీరూ- జోరూ- ఉంటే గాని అందులో ప్రవేశంలేదు- అప్పుడుకూడా మిస్టర్ ఎంప్ మిసెస్ అని వ్రాయాలి...అవటం కాకపోవటం వేరే సంగతి అక్కడ బేరరు కలెక్టరుకంటె హుందాగా వుంటాడు. బట్లరు ధన్వంతరివలె అమృతహస్తంలో కాక్‌టైల్ కలుపుతాడు.

హోటల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవరు? అనే పాడుప్రశ్న ఇప్పుడడుగవద్దు...అడుగుతామంటారా? సరే కానివ్వండి.

ఈ హోటలు నిర్మాణావస్థలో వున్నప్పుడు - పేద బ్రాహ్మణ కుటుంబం కూలికొచ్చింది. కడుపుకి మాత్రమే

వచ్చి పనిచేస్తున్న ఆ కుటుంబంలో ఆడపిల్లకి కడుపునిండింది. దాంతో హత్యో? ఆత్మహత్యో తెలియదుగాని ఆమె ఆ పునాదుల్లోనే చనిపోయింది.

మీరేసిన పాత ప్రశ్నకి ఇదే జవాబు. పోనివ్వండి ఎందుకొచ్చిన రొష్టు. ప్రస్తుతం అందులో పురుషులకే కడుపులు నిండుతున్నాయి-స్త్రీలకు- కడుపు-నిండుతున్నది. పార్టనర్స్‌కి జేబులు నింపుతున్నాయి. అంతా హాయిగావున్న సమయంలో రాళ్ళెత్తిన కూలీల సంగతి అనవసరం.

అక్కడ పోరుగూరి పెద్దమనిషి కట్టుకున్న ఇల్లాలితో దిగినా బేరర్లు యిలా అడగ్గలరు అనుకోగలరు.

"ఏ వూరు పాపానీది ?"

"కొత్తపిట్ట గాబోసు"

"బాలమ్మ కంపెనీ కాబోలు."

"ఫష్టుగా వుంది బ్రదరూ"

"ఏదైనా రాత్రికి వందరూపాయలు రెండేళ్ళపాటు అవలీలగా సంపాయించగలదు."

"మన బియ్యం షావుకారికి దీన్ని అప్పచెపితే సగం ఆస్తి వెంటనే రిజిష్టరు చేస్తాడు."

"ఈడు మొగుడా...ఎస్కార్టా ?"

"ఎవడయినా మిస్టర్ మిసెస్ అనాల్సిందే గదా ... అందులో మన ఎయిర్ కండిషన్ చల్లదనానికి ఆడి మనసు కూడా గడ్డకట్టుకుపోతుంది."

"నాయ్యో! తానికి సంగతి తెలిసిపోయుంటదిలే."

"బియ్యం షావుకారికీ...డిస్ట్రిబ్యూటరు కొడుక్కీ—నాటకాలదాంతో విసుగెత్తింది. దీన్ని చూపిద్దాం ఏమిటి?"

ఈ విధమైన సంభాషణ సాగినట్లు పాపం ఆ భార్యాభర్తలకి ఎంతమాత్రం తెలియదు.

కనకదుర్గ మల్లికార్జునిడితో వచ్చినా వాళ్ళిలాగే మాట్లాడతారు. అమ్మవారు నిజస్వరూపం చూపించినా,

"మేకప్ బాగుందిరా, సినిమాలోకి పనికొస్తాది, డిస్ట్రిబ్యూటరు కొడుక్కి చెప్పుదామేమిటి?" అంటారు.

"అభిషేకానంతరం దేవి ప్రత్యక్షమయితే "షో వేసింది కాబోలు, చెమటపట్టేసింది" అంటారు.

ఏ స్మగ్లరయినా పూర్వకాలపు దేవివిగ్రహాన్ని ప్యాక్ చేసి తీసుకొచ్చినా, విగ్రహం ఆపదిగనక అనుభవించే మహా రసికులున్నారు మా వూళ్ళో. (క్షమించాలి అసత్యంకాదు) అలాగే హీరో లెవరయినా ఆ హోటల్లో దిగితే- వాళ్ళ డమ్మీల్ని హీరోలే అని చెప్పి రసికశిఖామణులైన స్త్రీరత్నాల దగ్గరనుంచి డబ్బుగుంజటం ఒక పద్ధతి. నిజంగా ఆ హీరోలు మాట్లాడటానికి ఒప్పుకుంటే (ఒప్పుకుంటారు) ఆళ్ళ కట్టాం సొమ్ము, పిన్నాం దగ్గర బంగారం, కన్నారిచ్చిన భూమి హీరోలకి ఇచ్చేసే త్యాగమూర్తులైన ప్రౌఢలున్నారు.

ఇంట్లో మద్యమాంసాలూ పార్టనర్సూ దొరకని ప్రతివాళ్ళూ ఈ హోటలుకొస్తారు స్త్రీ పురుష భేదం లేకుండా.

అవుట్ డోర్ కొచ్చిన ప్రతినటీనటుడూ, నాలుగైదు వేల మినిమం సంపాదనతో ఈ వూరినుంచి వెళతారు.

అదే ఈ హోటలు ప్రత్యేకత.

వీరయ్యా రంగారావూ ఆ భూ(తా)తల స్వర్గంలోకి ప్రవేశించి ఒకటేబిలు దగ్గర కూర్చున్నారు.

ఇలాంటివాళ్ళ దగ్గరికి న్యాయంగా అయితే చాలా నిర్లక్ష్యంగా వస్తారు సర్వర్లు.

కాని వీళ్ళిద్దరూ పోలీసులు. అనుమానంమీద అరెస్టు చేసి లాకప్పులో పెట్టేయగల సమర్థులు. అందులో ఎమర్జెన్సీ కూడాను. అందుకే-

"ఏం కావాలి సార్" అన్నాడు సర్వరు.

"ఏంరా ఏమిటిసంగతులు?" అన్నాడు వీరయ్యా హెడ్డు దర్జా దర్పం ఒలకబోస్తూ.

"తమరికి తెలియనివి ఏముంటాయిసార్" వినయంగా సమాధానమిచ్చాడు సర్వరు.

"చెప్పవోయి బట్టలకొట్టుషావుకారుకోడలు యింకా తాగడానికి వస్తూనేవుందా?"

"చిత్తంసార్, ప్రొహిబిషన్ లేదుగాతప్పేమిటిసార్"

"తప్పన్నానుట్రానాయనా. ఒకపని తప్పా ఒప్పా- ఆ చేసేవాళ్ళనిబట్టి ఉంటాయి. నూ రంగడి పెళ్ళాం అలా కాగ్లో దర్జాగావచ్చి వాట్-69 తాగేసి వెళ్ళగలదా? లేదు. ఆపిల్ల ఒచ్చినా అదే కాఫీకి వచ్చినా... ఏవూరుది పాపా సిద? అనవానువ్వు? మరందుచేత... అత్తచేస్తే ఒప్పు - కోడలు చేస్తె తప్పును. డబ్బున్న ఆడదీ మగాడూ ఎవర్నన్నా హత్య చేసి బెడ్డింగులో చుట్టి రైలుకట్టదగ్గర పారేయమన్నా పారే

స్తారు ఈ హోటలువాళ్ళు. ఎవరికి తెలియని భాగోతంరా ఇది" దబాయించాడు వీరయ్య.

"నన్ను దబాయిస్తే ఏంలాభంసార్... కాఫీ తెమ్మంటారా?" అన్నాడు సర్వరు.

"మా మొహానికి కాఫీకాకపోతే విస్కీ ఇస్తావుటగాని అదే తగలెయ్యి" అన్నాడు వీరయ్య. సర్వరు వెళ్ళాడు.

"నమస్కారం సార్"

"తస్సదియ్య ఏమిటిరా వేషం మారింది గాంధిగా-ఎవరిదయినా పెద్దబేరం తగిల్నాదా ఏమిటి?"

"హి...అలాటిది కాదండి."

"జేబులు కొట్టేవాళ్ళు దొరలై పోతున్నార్రా... మా చిన్నతనంలో దొరలంటే పెద్దమనసూ పెద్దకులమూ... పెద్దరికమూ ఉన్నవోళ్ళు. ఇప్పుడు దొరలంటే...దొంగ సరుకుకొనేవట్లూ-స్మగిలింగు చేసేవాళ్ళూ-బ్రోకర్లూ వగైరాలు. ఎవడి దగ్గర డబ్బుంటే-ఆడే దొర" వాపోయాడు వీరయ్య.

"డబ్బు దేవుడుతో సమానమండి...ఎవరి దగ్గరినించి ఏ మార్గంలో ఎవరిదగ్గర కెళ్ళినా చిరక్కుండా వుంటే రూపాయినోటు చెల్లి పోతుంది. అలాటప్పుడు దానికి మంచీ చెడూ న్యాయమూ అన్యాయమూ దొంగతనం దొరతనం ఎలా వస్తాయి సార్"

"అరే గాంధీ-నువ్వెంత తెలివిగలవోడివి గనకనే ఒక్కసారీ పోలీసులకి చిక్కలేదు.కుందనం దొరసాని ఏమంటుంది?"

"ఏమంటుంది. బాగానేవుంది, సరోజినీ ఇలారా-హెడ్డు కానిస్టేబుల్ గారికి నమస్కారం చెయ్యి" అని మరో బల్లదగ్గర

కూర్చున్న సరోజినీని కేకేశాడు గాంధీ. రంగారావు ఖంగారు పడ్డాడు. అదిచూసి అతని పాదం నొక్కాడు వీరయ్య.

"దండాలండి"

దీర్ఘ సుమంగళీభవ...ఏ మొగుడు బ్రతికినా ప్రపంచానికి ప్రమాదమే ... మీ బాబు హైద్రాబాద్‌నించి వచ్చాడా ?"

"రాలేదండి."

"బూతు పుస్తకాలు నువ్వూ మీయమ్మా ఎక్కడ దాచారు ?"

"అసలు లేవండి. ఆఖరి వంద పుస్తకాలతోనే మా నాన్న పట్టుబడ్డాడు."

"గాంధీపెళ్ళాం అబద్ధం చెప్పదు. మార్నింగ్ షోకి వెళుతున్నారా ? అక్కడ కన్నన్ వుంటాడు. ఆడిదాడికి పారేస్తే ఎన్ని జేబులుకొట్టినా అడగడు. అసలు సిసలైన సామ్యవాది వాడు."

"ఛ...మా యమ్మమీదా-దుర్గ తల్లిమీదా ఒట్టండి-నేను జేబులు ఎన్నడూ కొట్టలేదు. తమరలా సెలవిస్తే నేనేం చెయ్యను. మీ తోడండి నేను అబద్ధం చెప్పను" అన్నాడు గాంధీ.

"నామీద ఒట్టెట్టనురోయ్...కావాలంటే అమ్మవారి మీద ఒట్టుపెట్టుకో-ఆ తల్లి ఒట్టెట్టిన నీ జోలికి రాదుగాని-దండంపెట్టే నన్ను మొట్టుతుంది. సామెతుంది కాదురా అలాగ...అది సర్లే సినిమాకి కాకపోతే కంట్రాక్టుకి వచ్చావా ?"

"నూ కజిన్ ఒకడు ఇందులో వున్నాడు చూసిపోదా మని."

"గాంధీ ఒరే...కజినా? ఫష్టు కజినా? త్రిష్టకజినా? ఏదయినా శాగా గిట్టుబాటయ్యే వ్యవహారమే అయుంటుంది"

"కాఫీ సార్" అన్నాడు సర్వరు ఈలోగావచ్చి.

"ఒరే సర్వరూ! గాంధీగారి కజిను ఏ రూములో ఉన్నార్రా, బయం లేదులే చెప్పు"అన్నాడు వీరయ్య.

"కుందనంగారి కజినేగా? ఎనభయ్యవ నెంబరులో సార్-రాత్రినుంచీ ఆళ్ళు బిజినెస్ మాట్లాడుతున్నారండి."

"ఎన్ని సీసాలారీ?"

"రెండు స్కాచీలూ-ఒక సిక్సువెనూ-మూడు జిన్నులూ పది సోడాలూ అరడజను నిమ్మకాయలూ అరడజను గోల్డు స్పాట్లూ- సార్, ప్రొహిబిషన్ లేదుగా సార్"

"ఉంటేమాత్రం బయవేమిటిగాని...ఏ వూర్రా ఆ కజిన్ దీ?"

"బెంగుళూరు సార్" సర్వరూ గాంధీ ఒకసారే అన్నారు. ప్రభాకరంబాబుకి గతరాత్రి అనుభవాల్లో ఈ బెంగుళూరూ కుందనం స్మగ్లింగూ గొడవాటి తెలిసినట్లు వీరయ్యకి తెలుసు...ఇప్పుడు ఏం చెయ్యగలడు? ఉలిక్కి పడటం తప్ప. అదే చేశాడు వీరయ్య.

"చరిత్ర వెనక్కి నడుస్తున్నది-పద నాయనా రంగా పోదాం" అని లేచాడు వీరయ్య. వీధిలోకి వచ్చేసరికి,

"గుడ్ మార్నింగ్ సార్-ఎలా వున్నారు సార్" వీర య్యకి ఘాటుగా షేక్ హాండిచ్చింది సరోజినీ కమలం."

"ఏమిటి సాబ్ అలా చూస్తారు... నేను సరోజిన్ని" అంది సరోజినీ కమలం-రంగారావు మళ్ళీ ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటి కథ ? పొద్దున్నే బయల్దేరావు ? మీ యమ్మకి గానుగుడ్డ కొంటానికా ? మీ నాన్నకి నాటుసారా కొంటా నికా ?" వీరయ్య పరామర్శించాడు.

"రెండూ కాదుసాబ్, కాఫీ తాగడానికి."

"కాఫీకి పెద్దహోటలు కొస్తున్నావు...సింగిలు టీ తాగే దానివి ఏమిటి వ్యవహారం ?"

"ఏంలేదు మీరుకూడా రండిసార్ కాఫీతాగుదాం"

"భేష్...పద మీ నాయన రైలులో బొగ్గేసేప్పుడు కూడా స్నేహితుడివని నాకు కాఫీ యిప్పించలేదు-మీయమ్మ ఇంగ్లీషుది కనక ఉప్పుబిస్కట్లు పెట్టేదినాకు దొరసాన్లు... ఇంగ్లండునించి దిగివచ్చినట్లు మాటాడితే ఎలా ? పద" అని మళ్ళీ శిష్యసమేతుడై లోపలికి వెళ్ళాడు వీరయ్య.

అప్పటికి సరోజిన్ అక్కడేవుంది. సరోజిన్‌కీ, సరోజినీ కమలానికీ-మతరీత్యానేకాక వృత్తిరీత్యాకూడా అమితమైన పోటీ వుంది. అందువలన యిద్దరూ కొరకొరాచూసుకున్నారు. గాంధీమొగం తేటపడింది - యింతమంది నేరస్తులమధ్య యిద్దరు పోలీసులుండీ-వారినేమీ చెయ్యని పరిస్థితిలో వుండటం అతనికి అమితానదాన్ని ఇచ్చింది. పైనఎయిర్‌కండిషన్డ్ రూములో స్మగ్లింగ్ రాకెట్‌తో కుందనం ఉంది. వీరయ్య ఏం చెయ్యలేడు. మరో కాటేజీలో సినిమా డమ్మీ ఈ వూరి భామామణీ ఉన్నారు. వీరయ్య ఏం చెయ్యలేడు. ఎదురుగ్గా

ఇద్దరు బజారుభామలూ జేబుదొంగా ఉన్నారు. వీరయ్య ఏం చెయ్యలేడు. అదీకారణం గాంధీ ఆనందానికి.

ఆ టేబిలుదగ్గిర వీరయ్యా-రంగారావూ-సరోజినీకమలం కూర్చున్నారు. పక్క టేబిలు దగ్గర సరోజిన్ గాంధీ కూర్చు న్నారు. విధి వింతచేష్టలవల్ల బందరు గుడిసెల సరోజిని వచ్చి హెడ్డుగారి టేబిలు దగ్గర మిగిలిపోయిన కుర్చీమీదకూర్చుని

"నమస్కారం హెడ్డుగారూ నేను సరోజిన్ని" అంది. రంగారావు మళ్ళీ ఉలిక్కిపడగా వీరయ్య మళ్ళీ ఒకసారిఅతని కాలు నొక్కినవాడై ఇలా ఆశీర్వదించాడు-

"చల్లగా ఉండు సరోజినీ- ఏమిటే ఇలాగయిపోయావు ఈ మధ్య కనిపించటంలేదు."

"ఏం చెయ్యమంటారు బాలమ్మ వెళ్ళకొట్టింది. దుర్గ మెట్లదగ్గర అడుక్కుందామని ప్రయత్నించాను. అక్కడ అడు క్కుంటున్నవాళ్ళు పోటీవస్తుందని వెళ్ళగొట్టారు. ఎవరి ఇంట్లో నయినా పాచిపని చేసుకు బ్రతుకుదామనుకొన్నాను. ఆ పెద్ద ఇళ్ళ పెద్దమనుషులతో ఇదేహోటలుకి అనేకసార్లు రావటం వలన పనిదొరకలేదు. ఫలితం బందరుగుడిసెలలో పాతపాటే పాడుతున్నాను" అంది సరోజిని నిట్టూరుస్తూ.

"మరిప్పుడు దేనికొచ్చావు?"

"శర్మగారు ఏదో ఫోటోలు తీసి డబ్బిస్తామనీ- ఈ హోటలులో ఉండమనీ చెప్పారు. చెడిన చేనుకి రెండుమంచె లేమిటి? ఏదయితే అదయిందని వచ్చేశాను."

"ఆ శర్మ ఇప్పుడు ఇక్కడికి వస్తాడా?"

"అలాగే చెప్పాడుమరి." కాఫీవంక ఆశగా చూస్తూ అడిగింది సరోజిని.

"ఇది క్రీస్తుబిడ్డ సరోజిని- ఆ బల్లదగ్గర మసీదు బిడ్డ సరోజిన్, ఇది హిందూ సరోజిని... మూడు సరోజిన్లు ఏఒకతి భూమ్మీద నడిచినా విజయవాడ దద్దరిల్లిపోతుంది. ఈ రోజు ముగ్గురూ ఈ హోటలుకి వచ్చారంటే బంగాళాఖాతంలో వాయుగుండమువల్ల వరసాగ్గా మూడుతుపాన్లు వచ్చినట్లు దేశానికి ఏదో ఉపద్రవం రానచ్చును. కనీసం ఈహోటల్లో నయినా ఉపద్రవం రాకతప్పదు" జోస్యం చెప్పాడు వీరయ్య.

"ఏం భయంలేదు. డబ్బూ తిండీ పవరూలేని బజారు సరోజినులు డబ్బున్న హోటల్నిగాని, ప్రజానాయకుల్నిగాని దేశభక్తుల్నిగాని, పోలీసుల్నిగానీ ఏంచెయ్యవు. పోతే అవే మట్టికొట్టుకుపోతాయి" బందరుగుడిసెలసరోజిని సమాధానం చెప్పింది.

మిగతా ఇద్దరు సరోజిన్లూ ఆమాటలకి అసూయపడుతూ ఉండగానే- మహంకాళమ్మా, శర్మా, మరో నల్లముసుగు ఘోషామనిషీ లోపలికి వచ్చారు.

ఈతడవ వీరయ్య రంగారావుకాలునొక్కడు.

శర్మ వీరయ్యని చూస్తూనే గతుక్కుమన్నాడు. కాని వెంటనే సర్దుకుని,

"నమస్కారం హెడ్డుగారూ" అన్నాడు.

"నమస్కారం. నమస్కారం పత్రికబాగా నడుస్తోందా ఎవరో ఘోషాస్త్రీలతో వచ్చారే" అన్నాడు వీరయ్య నవ్వుతూ.

‘అవునండీ. హైదరాబాద్ స్నేహితులు. మధ్యాహ్నం బండిలో వెడతారు. మహంకాళీదేవి. ఈ వారే- చాలా ఉత్తములు” అన్నాడు శర్మ భక్తిగా మహంకాళమ్మవంక చూస్తూ.

“పత్రిక నడుస్తోందా?” అన్నాడు వీరయ్య శర్మనుద్దేశించి- కాలుగోటితో రంగారావుకాలిని గోకుతూ. అంతటితో రంగారావు రెండు జేబులూ తడుముకుని సిగరెట్ త్రాగటానికి బయటికి నడిచాడు.

“పత్రికని పోలీసులూ, పెద్దమనుష్యులూ సాగనివ్వరు గదండీ. అయినా నిజమైన జర్నలిస్టుకి ఈ దేశంలో స్థానం లేదులెండి. ఏది రాస్తే పీకమీదకొస్తుందో అని భయంతోనే జర్నలిస్టు జీవితం గడపాలి” అన్నాడు శర్మ.

“ఈ సరోజిని మీకోసమే వచ్చివెళ్లింది” అన్నాడు వీరయ్య. దానితో సరోజినీ కుసుమం, సరోజిని, బందరు గుడిసెల సరోజినీ ముసుగులో సరోజినీ నలుగురూ ఉలిక్కిపడ్డారు. వీరయ్యకి కావల్సినసమాచారం ముసుగులోనుంచివచ్చేసింది.

కాని ఏం చెయ్యాలి?

పదినుంచి నేరస్తులున్న ఒక్కపోలీసు తను. రంగారావు యింకా రాలేదు. యిహ మాటలలోకి దిగాడు శర్మతో వీరయ్య.

“సరోజిని చాలా సేపయింది వచ్చి” అన్నాడు.

“ఏ సరోజిని?”

"బాగుంది శర్మగారూ... ఇక్కడ ముగ్గురు సరోజిన్లు ఉన్నారు. మీరు ముగ్గుర్నీ ఎమ్మన్నారేమిటి" అంది బాదరు గుడిసెల సరోజిని

"నాకు ఒక సరోజినే తెలియదు. ముగ్గురిసంగతి అసలే తెలియదు. అయినా ఆడవాళ్ళతో నాకేంపని?"

"యిప్పటికి నిజం చెప్పారు శర్మగారూ!...ఆ! ఇంకా ఏమిటి? కబుర్లూ అవీ చెప్పండి" అంటూ వీరయ్య ఎంట్రన్సు వైపు చూశాడు. రంగారావూ ప్రభాకరం వస్తున్నారు. తను లేచి సెల్యూట్ కొడదామనుకున్నాడుగాని మఫ్టీలో వున. ప్రభాకరం సైగ అందుకుని మెదలకుండా కూర్చున్నాడు.

ప్రభాకరాన్ని చూసి నలుగురు సరోజినులూ గుర్తు పట్టారు...ముసుగుసరోజినికి చెమటలు దిగ్గారిపోతున్నాయి- మాట్లాడేందుకు వీలులేక మాంకాళమ్మ కాలు తొక్కింది. మాంకాళమ్మ అర్థం అయిందన్నట్లు తలూపింది-హోటలులో కప్పులప్లేట్ల ధ్వనినిమించి వారి గుండెలు లబ్ డబ్ - లబ్ డబ్ అంటున్నాయి.

నేరస్థులకే కాదు పోలీసులకీ అదుటుగానే వున్నాయి. వీరయ్యకి అయితే ధైర్యమొచ్చింది. సైతాను లేకుండా నేరస్థులు సరాసరి ఒచ్చి పడిపోయినారు వలలో-ప్రస్తుతం అరెస్టుచేసి లాకప్ లో పెడితే ఆ దయ్యమేదో జైలుచుట్టూ తిరుగుతాది...ఆ వూహతో కొండంత ధైర్యమొచ్చింది వీరయ్యకి. ప్రభాకరం వంక చూశాడు.

"రంగా - ఫోను చేశావా ?" చీటీమీద రాసి రంగారావు కిచ్చాడు వీరయ్య.

"వ్యాసు వస్తూనే వుంటుంది" మళ్ళీ చీటీమీద వ్రాసి ఇచ్చాడు రంగారావు.

కమ్యూనిస్టు మీటింగులో స్పెషల్ బ్రాంచివాడు. స్పెషల్ బ్రాంచివాడు అని తెలిస్తే ఎంత ఖంగారు పడతారో అంత ఖంగారుగా వుంది అక్కడి నేరస్థులకి. పరిస్థితి యిలా వుండగా రోస్టుమీద వ్యాసూ-పోలీసుల టకటకలూ-వినిపించినయ్-ఇంతా పక్కనేవున్న బాత్ రూంలో దూరి-మిసెస్ రామారావుగా బయటికివచ్చి పోలీసుల ముఖ్యనించి నడుచుకుంటూ వెళ్ళిపోయింది. పోలీసులకి విషయం అర్థంకా లేదు.

అర్థమయిన పరిభాకరం దిగ్భ్రాంతుడై పోయినాడు. చివరకి వీరయ్యకి ఏదో రహస్యంగా చెప్పి...శర్మనీ మాంకా శర్మనీ వ్యానెక్కించాడు. వీరయ్యా రంగారావూ బయటికి పరుగెత్తారు.

అప్పటికే సరోజిని మలుపు తిరిగింది ... జనాన్ని తప్పించుకొని ఆ మలుపు దగ్గరికి వచ్చేసరికి జనంలో కలిసి పోయింది - అక్కడున్న మూడురోడ్లూ మూడుచోట్లకి పోతాయి-అందులో ఒకరోడ్డు రైల్వేస్టేషనుకి-

"ఫుల్లిగా పదరా" ఎదురుగా వచ్చిన ఫుల్లయ్య రిక్షాలో ఎక్కి కూర్చున్నాడు వీరయ్య.

రంగారావు మరో వీధిలోకి పరుగెత్తాడు.

"ఏరా - ఆడమనిషి ఎవరయినా నీ కెదురొచ్చిందా ?" వీరయ్య ధాటిగా ప్రశ్నించాడు.

"ఆ పైరేడ్డులో షూటింగు జరుగుతా వుందండి" అందుకని పక్క సందమ్మడి ఒచ్చాను"

"రైల్వేస్టేషనుకే పోయుంటది - అక్కడికి పద" అన్నాడు వీరయ్య ఆదుర్దాగా.

విజయవాడ రైల్వేస్టేషను చాలా పెద్దది. మొదటిది మొగల్ షరాయి అనీ-రెండోది విజయవాడ అనీ-భారత దేశంలో పొడుగాటి స్టేషన్లూ పెద్దవీ అని ఈ రెండిటికీ పేరు. ఆ రెంటిలో ఒకటయిన విజయవాడ జంక్షన్‌లోకి వీరయ్య దూరాడు. బ్రిడ్జిలో మధ్య ఒక ఇనప తడిక వుంటుంది. అందులో ఒకవేపు వెడితే స్టేషనులోకీ మరోవైపు వెడితే విజయవాడ పాత నగరంలోకి ప్రవేశం. వీరయ్య రెండు క్షణాలు తటపటాయించి స్టేషను దారిలోంచే పరుగెత్తాడు.

మొదటి మెట్లమీదనించి కనిపించినంతవరకూ ప్లాట్ ఫారంవంక చూశాడు. బందరునుంచి ఏదో రైలువచ్చి ఆగింది. ప్లాట్‌ఫారం రేకులు పుస్తకం విప్పినట్లు వున్నాయి. అక్కడినుంచి స్టేషను మెయిన్‌ప్లాటుఫారాలున్న మెట్లు దిగాడు. ఎదురుగుండా టెలివిజన్‌లో ఏదో రైలు ఎన్నిటికో వస్తుందని మెరుస్తోంది. మెట్లు దిగగానే ఎదురుగ్గా పళ్ళ దుకాణం వుంది. మధ్యలో ఆఫీసూ దాని నెత్తిన రైల్వే వెయిటింగ్ రూములూ వున్నాయి. అంచేత కుడివైపు పరుగెత్తాడు. అద్దాల కేసులలో సినిమా బొమ్మలూ... కనకదుర్గ సజీవ విగ్రహమూ వున్నాయి. ఆ విగ్రహంచేసిన శిల్పి ధన్యుడు.

అందమైన దేవి ప్రాణంతో ఆ అద్దాలకేసులో కూర్చుని కానుక లందుకుంటున్నది. ఆవిడని చూసేసరికి దైవ విగ్రహం వున్నవైపు హిజ్రాలు రారని తోచి వెనక్కి తిరిగి పరుగెత్తాడు.

మొయిన్ మోస్లుపక్క ఫౌంటెన్ - దానిచుట్టూ కుర్చీలూ ఉన్నాయి. అక్కడ కూర్చున్న జనంలోలేదు - ఇంకా పైకి పరుగెత్తాడు. డ్రమ్ముల్లోవున్న చేపలవాసనా పచ్చిమిరప కాయల బుట్టల వాసనా గుప్పుమంది ... చివరదాకా వెళ్ళి మళ్ళీవచ్చి ఎడంవైపుకి పరుగెత్తాడు. రైల్వేకాంటీను జనం- హిగిన్ బాతమ్స్ వారి గ్రంథ విక్రయశాలా ... కూజాల దుకాణం ... వట్టి వేళ్ళసప్లయి అన్నీ జాగ్రత్తగా దాటేశాడు. హెచ్చు తరగతి స్త్రీల విశ్రాంతి కేంద్రంలోకి జొరబడ్డాడు.

రైల్వేవారికున్న వర్గభేదం - ఇరవయి సూత్రాల పథకం అనంతరంకూడా ఎంతమాత్రమూ మారలేదు.

ఆ వెయిటింగు రూంలో హెచ్చు తరగతి స్త్రీలు వెడల్పాటి పడకకుర్చీలలో విశ్రాంతితీసుకుంటున్నారు. ఆమెఅక్కడా లేదు. బాత్ రూములలో దూరే ధైర్యం అతనికి లేకపోయింది. అప్పుడే లింక్ ఎక్స్ప్రెస్ వచ్చిఆగింది. విజయవాడ జంక్షన్ సుదీర్ఘమైన ప్లాటు ఫారాలలో వకకాలంలో ఎన్ని రైళ్ళయినా ఆగి నేరస్తులపాలిట వరప్రసాదంగా ఉండేవి పూర్వం.

ప్రస్తుతం కొంచెం పారిపోయే వారి సంఖ్య తగ్గిందనే చెప్పాలి. ఆ లింక్ ఎక్స్ప్రెస్ ఎటునుంచి వచ్చిందో ఎటు పోతుందో వీరయ్యకి పట్టలేదు. వెయ్యికళ్లతో జనాన్ని చూస్తూ నిలబడ్డాడు.

వీరయ్యజాతకం బాగోలేక- మరో జనతా అమ్మవారి వేపు ప్లాటుఫారంమీద ఆగబోతున్నట్లు ప్రయోక్త మూడు భాషలలో ముద్దుగా చెప్పాడు. కాని అటువైపు అమ్మవారున్నందున నేరస్తులెటు వెళ్లరని దృఢమైన నమ్మకం కలవాడై వెయిటింగ్ రూంకెళ్ళే మెట్లు ఎక్కనారంభించాడు.

రైల్వే వెయిటింగ్ రూములు... విజయవాడలో రైడు జరగని ఏకైక సురక్షిత ప్రదేశాలు. భార్యఅయినా ప్రియురాలయినా రైల్వే వారికి హెచ్చుతరగతి స్త్రీలన్నా కడుంగడు గౌరవం.

ఆ రైల్వే వెయిటింగ్ రూముల అటెండర్-వీరయ్యని చూడగానే "ఏమిటిగురూ హడావిడి? బీడీఉంటేయిచ్చుకో" అన్నాడు.

"యిటుఒక ఆడమనిషివచ్చిందా?" వీరయ్య రొప్పుతూ అడిగాడు.

"ఏం పెశ్న గురూ నీది. ఒక్క ఆడమనిషా నీకు కావల్సింది? ఆరుగురు ఆడమనుషులు వచ్చారు. ఝుంకఝుమాఝుం" అన్నాడు.

"అదిగాదుసోములూ-ఖంగారుగాఎవరైనావచ్చారా"

"రైళ్ళ హడావుడికన్నా... అందరూ ఖంగారుగానే పనులు ముగించుకుంటారు. ఝుంకఝుమాఝుం."

"అదికాదురా - ఒకావిడనిపట్టుకోవాలిరానాయనా"

"ఝుంకఝుమాఝుం ఎలా ఉంటుంది?"

"చీరకట్టుకుంది...జడేసుకుంది...స్త్రీ"

"వీరయ్యమామా నువ్వు ప్రతిఆడదానికీ ఉండేకామన్ వర్ణన వర్ణిస్తున్నావు. నేను చెప్పనా ఝుంకఝుమాఝుం"

"చెప్పరా నాయన"

"ఆ గదిలో ఉన్నావిడ చీరకట్టుకుంది. జడేసుకుంది. గ్యారంటీగా స్త్రీయే. ఆ చీర బహుపల్చగా ఉండి, పెళ్ళికొడుక్కీ— పెళ్ళికూతురికీ ఉండే తెరలాగా పల్చగాఉండటం వలన పెళ్ళికొడుకులమైన మనందరికీ ఆ తెర ఒకసారి ఎత్తి చూడాలనిపిస్తుంది. ఈ గదిలోఉన్న సుందరాంగి బహుపల్చని శరీరంమీద చీరకట్టి దానిమీద స్వెట్టరుకూడా తొడిగినందువల్ల ఆకులోచుట్టిన మేకమాంసంలాగా బయటికి ఏమీ కనిపించటంలేదు. ఇకపోతే ఆవిడ రొప్పుతూ రోజుతూవచ్చి ఆ గదిలో దూరిపోయింది. ఝుంకఝుమాఝుం"

"ఎలా వుంటుంది."

"నీ వర్ణన ప్రకారమే. అయితే ఆ గదిలో అదివరకే ఘోషాబాబూ సాయిబుగారూ ఉన్నారు- కనుక నీవు చెకింగ్ చేస్తే విజయవాడ జంక్షను అనబడే భారతదేశంలో రెండవ పెద్ద స్టేషనులో మతకలహాలు వచ్చే అవకాశంఉంది. కనక ఘనత వహించిన రైల్వే ఉద్యోగినయినందున నేను దానికి ఒప్పుకోను. అసలింతకీ సంగతేమిటి ఝుంకఝుమాఝుం" అన్నాడు అటెండరు.

"బాబ్బాబు సోములూ- ఆ గదిలోంచి ఎవరూ బైటకి వెళ్ళకుండా చూస్తావా? ఫోనుచేసివస్తాను"

“పురజనులు- మరీముఖ్యంగా ప్రయాణీకుల స్వాతంత్ర్యాన్ని హరించే హక్కు ఎవరికీ లేదు. ఝుంకఝుంఝుం” అన్నాడు సోములు.

అతని మాటపూర్తి కాకుండానే- ఆ తలుపు తీసుకుని సరోజిని మెట్లమీదనుంచి పరుగెత్తింది. పీరయ్య వెంటనే పరుగెత్తాడు.

సరోజిని పొరపాటున మరొకరి గదిలోకి వెళ్ళింది... ఆ గదిలో ఉన్నాయన హైద్రాబాద్ సి.ఐ.డి ఆఫీసరు సలామత్ ఖాన్, మిసెస్ సలామత్ ఖాన్. ఆయన ఈమెని గుర్తుపడతాడనే భయంతో బయటకు వచ్చి పీరయ్యనిచూసి మెట్లకేసి పరుగెత్తింది.

సరోజిని అడుగు ముందుకు పడలేదు. అప్పుడామె త్రిశూలం తనని పొడుస్తున్నట్లుగా ఉంది. ఆవిడ సర్వాయి ధాలూ తనని నిలబెట్టినట్లుఉంది. బహుచేరా సుంతైనా ఆ చుట్టుపక్కల లేదు. జగజ్జనని కనకదుర్గ విగ్రహారూపంలోనూ కూడా తన అఖండ స్త్రీత్వాన్ని వెదజల్లుతూ- చిరునవ్వుతో- చెలరేగుతూ అద్దాల్ని పగలగొట్టుకొని సరోజినిముందు నిలబడింది. ఇంతై - అంతై గాంధికొండంత అయింది.

సరోజిని కెవ్వునకేకపెట్టి విరుచుకుపడి కోడిపూతలాటి ఒక అరుపు అరిచింది. ఆమె ప్రాణవాయువులు అనంతవాయువుల్లో కలిసిపోయినయి.

(సమాప్తం)